**బ్రహ్మశ్రీ అప్పాల విశ్వనాథశర్మగారి**
**జీవితం - రచనలు - సమగ్ర పరిశీలన (సిద్ధాంతవ్యాసం)**

రచన : **శ్రీమతి త్రిగుళ్ళ (గౌరీభట్ల) శాంత**

ప్రథమ ముద్రణ : **ఏప్రిల్, 2007**
ప్రతులు : **1000**

ముద్రణ :
**మహతి ప్రింట్ క్రియేషన్స్**
చిక్కడపల్లి, హైదరాబాద్. ఫోన్ : 66772225

ప్రతులకు :
**శ్రీ పాండురంగాశ్రమము,**
మరుకూకు, మెదక్ జిల్లా.

వెల : **అమూల్యము**

# కృతజ్ఞతలు

"మహాత్మా బ్రహ్మశ్రీ అప్పాల విశ్వనాథశర్మగారి జీవితం – రచనలు – సమగ్రపరిశీలన" అనే అంశాన్ని గురించి పరిశోధన చేయడానికి అనుమతిచ్చిన ఓరియంటల్ భాషా విభాగం ఉస్మానియా విశ్వవిద్యాలయం నాటి డీన్ డా॥ శేషగోవర్ధనం రామానుజాచార్యులు గారికి, గ్రంథసమర్పణ సమయంలో డీన్‌గా ఉన్న డా॥ రమేశ్‌కుమార్ జాధవ్ గారికి గౌరవాభి వందనాలు.

పరిశోధనలో నాకు అన్నివిధాలుగా సలహాలనిస్తూ, నా పరిశోధనకు తగిన మార్గదర్శనంచేసి, నాకు పర్యవేక్షకులుగా ఉన్న డా॥బి. జయరాములు (రీడర్) గారికి కృతజ్ఞతాభివందనాలు.

నేను ఇంత ఎదగడానికి ఎంతో ప్రోత్సాహాన్ని, సహాయ సహకారాల్ని అందిస్తూ, ఎన్నో కష్టనష్టాలకు ఓర్చుకొని అహరహం శ్రమించిన నా జీవితభాగస్వామి శ్రీ త్రిగుళ్ళ జానకిరామశర్మగారికి నా ప్రేమపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

స్త్రీకి విద్య అవసరం అని ప్రోత్సహించిన మా అత్తగారు శ్రీమతి బాలరుక్మిణిగారికి నమస్కారాలు.

శ్రీపాండురంగాశ్రమంలో విశ్వనాథశర్మగారి జీవితానికి సంబంధించిన విషయసేకరణకు తోడ్పడిన శ్రీఅప్పాల సత్యనారాయణశర్మగారికి, వారి సోదరులకు, కుటుంబసభ్యులకు కృతజ్ఞతాంజలి.

నాకు పరిశోధన విషయాన్ని సూచించిన డా॥ఎ.రాములు (సంస్కృత ఉపన్యాసకులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం) గారికి, శర్మగారి రచనలను అందించిన శ్రీ మదునూరి వెంకటరామశర్మగారికి ప్రత్యేక కృతజ్ఞతాపూర్వక అభివాదాలు.

చిన్ననాటినుండి విద్యావ్యాసంగం కల్పించిన నా తల్లిదండ్రులు శ్రీమతి విజయలక్ష్మి, శ్రీరాధాకృష్ణశర్మ గారలకు, నా సంస్కృత విద్యాభ్యాసాన్ని ప్రోత్సహించిన మాచిన్నాన్న శ్రీసత్యనారాయణశర్మగారికి కృతజ్ఞతాంజలి.

నాకు ఎన్నో విధాలుగా సహకరించిన స్నేహితురాలు శ్రీమతి ఎం.పావని బాలకృష్ణగారికి అభినందనలు.

నాకు చేదోడువాదోడుగా ఉన్న నా చిరంజీవులు వాసుదేవశర్మ, శ్రీవాణిలకు నా శుభాశీస్సులు.

నా శ్రేయస్సును సర్వదా కాంక్షించి, నా పరిశోధనా వ్యాసంగంలో ప్రోత్సాహాన్నిచ్చిన ఆప్తులు, మిత్రులు, శ్రేయోభిలాషులందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

తెలుగు ప్రాచ్య భాషావిభాగంలోని సిబ్బంది శ్రీ అచ్యుత్, శ్రీమైసయ్య లకు కృతజ్ఞతలు.

నా సిద్ధాంతవ్యాసానికి సకాలంలో అందంగా అక్షరాలు కూర్చి ఇచ్చిన మహతి ప్రింట్ క్రియేషన్స్ వారికి నా కృతజ్ఞతలు.

**– జి. శాంత**

# ప్రరోచన

సమాజాభ్యుదయానికి కళలను, భక్తిని ఉపయోగించుకోవచ్చుననే, మానవసేవయే మాధవసేవగా భావించాలనే ఉన్నత లక్ష్యాలు కలిగిన విశ్వనాథశర్మగారి జీవితం, జీవితాశయం నాకు బాగా నచ్చాయి. తమ రచనలలో భక్తి జ్ఞానాలతోపాటు సమాజ శ్రేయస్సును కాంక్షించే మహాత్ముని హృదయాన్ని దర్శించాను. అందుకే మహాత్మా విశ్వనాథశర్మగారి జీవితం, రచనలను గూర్చి సమగ్ర పరిశీలన చేయాలనే సంకల్పం కలిగింది.

విశ్వనాథశర్మగారి జీవితంలోని పుట్టుపూర్వోత్తరాలు, విద్యార్జన, కుటుంబంతోపాటు ఆయన పదహారవ ఏటనే ఆశ్రమం యొక్క బరువు బాధ్యతలను స్వీకరించి, నిర్వహించిన తీరు ముదావహం. కాబట్టి ఆయన జీవనరేఖలు, గార్హస్థ్య జీవితం నేటి మానవాళికి ఆదర్శప్రాయం.

శర్మగారిలో అనేక సద్గుణాలున్నాయి. ఆయనలో కనిపించే దాతృత్వం, సత్యవాక్పరిపాలనం, పరోపకారగుణం, నిర్భీతి, అహింస, భూతదయ మొదలైనవి ఉత్తమమానవుడు కాదలచుకొన్నవారికి అవశ్యాచరణీయాలు. ఆయన సుగుణాలలో ఒకటైన భూతదయకు ఒక ఉదాహరణం. పక్షులు, జంతువులు నీటికోసం తిరుగుతూ అవస్థపడకుండా ఉండడంకోసం ఆశ్రమంలో తగిన ఏర్పాట్లను ఆయనే స్వయంగా చేశారు. ఈ విషయం చూపరులకు ఆశ్చర్యాన్ని కలుగజేస్తుంది.

శ్రీ పాండురంగాశ్రమ చరిత్ర, అక్కడి స్థితిగతులు, ప్రజలకు ఆశ్రమంవల్ల లభించే అండదండలు, ఆ ఆశ్రమంలో శర్మగారి తండ్రి, శర్మగారు నిర్వహించిన సేవలూ దానిలో జరిగే ఉత్సవాలు భజనలు, ముఖ్యంగా ఆషాఢ ఉత్సవాలు, వాటిని జనాకర్షకంగా జరిపే పద్ధతులూ, ఆశ్రమ నిర్వహణ, తదితర విశేషాలు పరిశీలనా దృష్టికలవారి నెవరినైనా ఇట్టే ఆకర్షిస్తాయి.

శర్మగారి రచనలన్నీ సరస్వతీదేవికి సమర్పించిన హారమైతే శ్రీపాండురంగశతకం వాటిలో మణిపూస. దీనిలో అద్వైతతత్త్వం, భాగవత కథా ఘట్టాలకు సంబంధించిన విషయాలు, నవవిధభక్తులు, వైరాగ్యం, వేదాంత విషయాలను రంగరించి ఈ శతకాన్ని శాస్త్రీయంగా, మనోరంజకంగా, పాఠకులకు భక్తి, వైరాగ్యాలు కలిగేవిధంగా రచించారు.

ఈశతకంలోని ఒక పద్యంలో తైత్తిరీయోపనిషత్‌లో ఉన్న భృగువల్లిలోని 'అన్నం బ్రహ్మేతి వ్యజానాత్', 'ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్', 'మనో బ్రహ్మేతి వ్యజానాత్', 'విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్', 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అనే భావాలను పొందు పరచి, భక్తుడు ఒక్కొక్క మెట్టు ఎదుగుతూ స్వామికి చేరువైన విధానాన్ని చిత్రించారు.

**సీ॥ ఆకలి బాధచే నార్చెడువానికి**
**కూటిపై నుండెడు కూర్మిపగిది**
**పెరచోటికేగిన ప్రియుని రాకనుగూర్చి**
**వేదనలొందెడు వెలది భంగి**
**జలధరమ్ముల జూచి జలకణమ్ములనాన**
**కలవరపడు చాతకమ్ము రీతి**
**వెన్నలలంద్రావు వేడ్క వెన్నలరేని**
**రాకజూచెడు చకోరమ్ము మాడ్కి**

**గీ॥ కలవరించుచు నినుజూడ కలలుగనెడు**
**దీనునెడబాయ దగదయ్య దీననాథ**
**విడువకుండుము। నాదు హృద్వీథినెపుడు**
**పరమ కరుణాంతరంగ శ్రీపాండురంగ ॥**

శివకేశవులకు భేదంలేదని నమ్మే శర్మగారు శివుని గురించి ఒక శతకం రచించారు. అదే శివలింగ విలాసం. ఒక్కొక్క గ్రామంలో శివాభిషేకాన్ని నిర్వహిస్తూ, ప్రతి గ్రామంలో ఆ గ్రామం పేరు వచ్చేవిధంగా శర్మగారు ఒక ఉత్పలమాలా వృత్తాన్ని రచించేవారు. ఈ ఉత్పలాలన్నిటిని 'శివలింగ విలాసం'గా రూపొందించారు. ఈశతకంలో శివుని వర్ణన, శివుని లీలలను సుమనో హరంగా చిత్రించారు.

'ముక్తి' అనే గమ్యానికి చేరాలంటే "నామస్మరణ" చేయాలని వివరిస్తూ భగవన్నామ విశిష్టతను తెలియపరచారు. "సద్భావలహరి"లోని వైరాగ్యం, "శ్రీ పాండురంగ వర్ణమాల"లోని మధురభక్తి మొదలైన అంశాలు పరిశోధకుల దృష్టిని తమవైపు లాక్కుంటాయి.

చిదానందమయుని 'చిత్రకవిత్వం'లో బంధించారు. ప్రతిబంధంలో స్వామి సాకారవర్ణన చేసి, శర్మగారు తమ మేధాశక్తిని, పాండిత్య ప్రకర్షను ప్రదర్శించారు.

తెలుగు సాహిత్యంలోనే కాదు సంస్కృత సాహిత్యంలోను అనేక ప్రక్రియలను సృజించారు. తమ ఇష్టదైవాలను సుప్రభాతాదులలోను, అష్టకాలలోను, స్తోత్రాలలోను, నవకమ్‌లోను స్తుతించారు. అవి కూడా పరిశోధనార్హాలుగా ఉన్నాయి.

సంగీత సాహిత్యాలను మేళవించి మంగళహారతులు రచించారు. వీటిలో వివిధరాగాలు, బాణీలు దర్శనమిస్తాయి. మంగళహారతులలో శివపరంగా, విష్ణుపరంగా, దేవీపరంగా భగవద్భక్తుల పరంగా హారతులు రచించారు. ప్రతి హారతి వైవిధ్య భరితం, అలంకారయుతం, భక్తిభావ బంధురం. హారతులలో భగవంతుని మనోహరమైన వర్ణనలు, లీలలు హృదయాకర్షకంగా చిత్రించారు శర్మగారు.

వేదోక్తంగా, పురాణోక్తంగా అర్చనచేయడం అన్నివర్గాల వారికి అసాధ్యం. పాట రూపంలో స్వామిని అర్చించడం సుసాధ్యం. కాబట్టి స్వామిని షోడశోపచారాలతో అనుచానంగా వస్తున్న మరికొన్ని ఉపచారాలను కలిపి శర్మగారు 'పూజపాట'ను రచించారు. అది ప్రామాణికమైనది. దానిలోని ప్రామాణికతను వేదోక్త, పురాణోక్త విధులతో సరిచూడవచ్చును.

శర్మగారికి మార్గకవితలో ఎంత ప్రావీణ్యం ఉందో, దేశికవితలో కూడ అంతే ప్రావీణ్యం ఉంది. మేలుకొలుపు, లాలిపాట, జోలపాటలను ఒక్కక్కటే రచించారు. అవి పండిత, పామర రంజకంగా ఉన్నాయి.

ఆదర్శవంతమైన శర్మగారి జీవితం, వారి ఉన్నత భావాలు, ఆయన కవిత్వంలోని అనేక విశిష్టతలు, పరిశీలించిన మీదట ఆయన మహాత్ముడు, అద్వైతి అనే విషయాన్ని నిర్ధారించవచ్చు.

ఈవిధమైన దృక్పథంతో ఆయన రచనలను సమగ్రంగా పరిశీలించి, ఈ సిద్ధాంత వ్యాసం రూపొందించ బడింది.

**– జి. శాంత**

# Osmania University





**Faculty of** Oriental Languages

This is to certify that Gorribhatla Shantha

son/daughter of G. Radhakrishna Sharma

having pursued a course of study prescribed by this University and having passed the requirements by Examination and by thesis has been admitted to the Degree of

## Doctor of Philosophy

in the Subject of Telugu (Oriental)

" The title of the thesis is

Mahakavi Brahmasri Appala Viswanadha Sarma Gari Jeevitham - Rachanalu - Samagra Parisheelana."

The candidate has been declared qualified for the award of the Degree of Ph. D. on 28th June 2006.

Given under the seal of the University

Hyderabad

Date MAGHA 14, 1928
FEBRUARY 01, 2007

Vice-Chancellor

# ఈ పుస్తక ముద్రణకు
# ద్రవ్యసహాయమొనర్చిన దాతలు

**బ్రహ్మశ్రీ అప్పాల వేణుగోపాల శర్మగారు, శ్రీమతి శైలజ**

గ్రామం : మరుకూకు, మెదక్ జిల్లా

**కీ॥శే॥ త్రిగుళ్ళ నృసింహశర్మ గారి జ్ఞాపకార్థం వారి కుమారులు**

**శ్రీ త్రిగుళ్ళ కృష్ణమూర్తి శర్మ**

**శ్రీ త్రిగుళ్ళ వెంకటేశ్వర శర్మ**

**శ్రీ త్రిగుళ్ళ జానకిరామ శర్మ**

గ్రామం : మూడుచింతలపల్లి, మం॥ శామీర్‌పేట జి॥రంగారెడ్డి

**కీ॥శే॥ నాళ్ళ రాజేశ్వరమ్మ కీ॥శే॥ నాళ్ళ రామయ్యగారల జ్ఞాపకార్థం వారి కుమారులు**

**శ్రీ నాళ్ళ సిద్ధయ్య, శ్రీమతి సావిత్రి**

**శ్రీ నాళ్ళ లక్ష్మయ్య, శ్రీమతి సుశీల**

గ్రామం : మద్దూరు జి॥వరంగల్

**తల్లిదండ్రులు కీ॥శే॥ బుస్సా రాములమ్మ, కీ॥శే॥ బుస్సా అంజయ్య గారల మరియు ధర్మపత్ని కీ॥శే॥ బుస్సా భారతిల జ్ఞాపకార్థం**

**శ్రీ బుస్సా లింగయ్య, భాగ్యలక్ష్మి**

బాకారం, ముషీరాబాద్, హైదరాబాద్

**అత్తమామలు కీ॥శే॥ పొద్దుటూరి లక్ష్మయ్య, కీ॥శే॥ రామమ్మ గారల జ్ఞాపకార్థం**

**శ్రీ పొద్దుటూరి నాగరాజం, శివరాజమ్మ**

గ్రామం : ప్రజ్ఞాపురం, మం॥గజ్వేల్ జి॥ మెదక్

**డా॥ ఎనుముల రామిరెడ్డి, శ్రీమతి విమల**

కర్మన్‌ఘాట్, హైదరాబాద్

Grams : " TELVERS"

Phone : Off : 040-23234815
Tele Fax : 040-23236911
E-mail : info@teluguuniversity.ac.in



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
POTTI SREERAMULU TELUGU UNIVERSITY



Dr. A. MANJULATA
VICE-CHANCELLOR

Lalitha Kala Kshetram
Public Gardens
Hyderabad - 500 004. (A.P.)
తేది 7.4.2007.

# అభినందన

**సా**మాజిక చైతన్యం, ఊహలకు వాస్తవాలు జోడించి చేసే రచనా ప్రక్రియే సాహిత్యం. రచయిత రచనలమీద సామాజిక పరిస్థితుల ప్రభావం ఉంటుంది. అంతేగాక రచయిత వ్యక్తిత్వం కూడా రచనల్లో ప్రస్ఫుటిస్తుంది. ఈవిధంగా రచయితకు, సమాజానికి అవినాభావ సంబంధం ఉంది. రచయిత నడవడికను తమ సాహిత్యంలో ప్రతిఫలింపజేస్తున్నారా లేదా చేసే రచనలకు, జీవితపు అలవాట్లకు ఏదైనా తేడా ఉందా అనే విషయాలు రచయిత జీవితం ఆధారంగా అతని సాహిత్యాన్ని అధ్యయనం ద్వారా తెలుసుకునే వీలు కలుగుతుంది. గతంలో రచయిత రచనల మీదనే అనేక కోణాల్లో పరిశోధన జరిపి అందులోని అంశాలు పాఠకులకు అందించే ప్రయత్నం పరిశోధకులు చేశారు. కాలానుగతంగా పరిశోధకుల్లో పెరిగిన జిజ్ఞాస, పాఠకులకు మరింత సమాచారం అందించాలనే ఆకాంక్ష రచయిత గొప్పతనం, ఉన్నత వ్యక్తిత్వం పాఠకులకు అందించి ఒక మార్గదర్శిగా చేయడం అనే ఆలోచనలకు ఆలంబనగా పరిశోధకులు తమ పరిశోధనను విస్తృతపరచి నూతనాంశాలు పాఠకులకు అందించే ప్రయత్నం చేస్తున్నారు. ఆ ప్రయత్నంలోనే శ్రీమతి గౌరీభట్ల శాంతగారు మానవసేవే మహనీయంగా భావించే ఉదాత్త ఆశయంగల బ్రహ్మశ్రీ అప్పాల విశ్వనాథశర్మగారి జీవితం రచనలను తమ పరిశోధనాంశంగా ఎన్నుకుని పరిశోధనకు న్యాయం చేకూర్చారు. రచయిత వ్యక్తిత్వం వారి రచనలమీద చూపుతుంది. ఉత్తమ లక్షణాలు గల విశ్వనాథశర్మ గారి రచనలు, సమాజాన్ని ఏవిధంగా ప్రభావితం చేయడానికి దోహదం చేశాయో పరిశోధకురాలు ఈ సిద్ధాంత వ్యాసంలో చెప్పేందుకు ప్రయత్నించారు.

పది ప్రకరణాల్లో శర్మగారి జీవితాన్ని, రచనల్ని పరిశోధకురాలు విశ్లేషించారు. చిత్ర కవిత్వం గురించి పలు అంశాలు తెలియజేసి ఆ కవిత్వం గొప్పదనం గురించి పాఠకులకు అందించే ప్రయత్నం చేశారు. విశ్వనాథశర్మగారి ఆశ్రమజీవితానికీ, సాహిత్యానికీ గల అవినాభావ సంబంధాన్ని, వారి రచనల్లోని భక్తి భావాన్ని, అద్వైతతత్త్వాన్ని వివరించారు. విశ్వనాథశర్మగారిని పరమభక్తుడుగా, ప్రజాసేవకుడుగా నిరూపించే ప్రయత్నం చేశారు.

భక్తిభావాన్ని, ఆధ్యాత్మిక చింతనను పెంపొందించే విధంగా పరిశోధన గ్రంథాన్ని రూపొందించిన గౌరీభట్ల శాంతగారిని అభినందిస్తున్నాను.

**ఎ. మంజులత**

శ్రీ భావానంద - రాధాకృష్ణ

# శుభాశీస్సులు

**శ్లో॥ యత్రైవ యత్రైవ మనోమదీయం। తత్రైవ తత్రైవ తవస్వరూపం।**
**యత్రైవ యత్రైవ శిరోమదీయం। తత్రైవ తత్రైవ పదద్వయంతే॥**

(ఎందెందు నా మనస్సున్నను అందందు నీ రూపముండుగాక, ఎందెందు నా శిరస్సున్నను అందందు నీ పాదపద్మములుండుగాక) **- శ్రీ ఆదిశంకరాచార్య**

పూజ్యులైన నాన్నగారు (శ్రీ విశ్వనాథశర్మగారు) ఆశ్రమ నిర్వహణజేస్తూ పాండురంగని మీద భక్తితో రచనలు చేసినారు. సర్వం శ్రీ పాండురంగడే అని ప్రతి అణువునా దర్శించినారు. 'మమేతిచ పరం మృత్యుః నమమేతి చ శాశ్వతం' నాది నేను అనుకున్నప్పుడే దుఃఖాలు. నాది కాదు అనుకున్నప్పుడు అన్నీ సుఖాలే అనే ఈ సూత్రాన్ని గట్టిగా నమ్మి ఆచరించారు. 'మానవసేవే మాధవసేవ' అని ఆచరించారు. మా నాన్నగారు ఈ ఆశయాలతోటే తన డెబ్బైనాలుగేళ్ళ జీవనం సాగించారు. ప్రతి రచనలో పై ఆశయాలను దర్శింపజేసినారు. ఆయన ఆశయాలు, సూత్రాలు ఈ వ్యాసంలో చదువరులకు స్పష్టమవుతాయి.

'మహాపురుషార్జితంబైన ద్రవ్యం పరోపకారమునకే యౌను సుమ్ము' అను విధంగా సమాజంయొక్క శాంతి సౌభ్రాతృత్వాలను కాపాడాలి అనే కాంక్షతో ఈ రచనలు మనకిందించారు. ఈ రచనల జాబితా ఒకే దగ్గర ఈ వ్యాసంలో పేర్కొనబడింది. ప్రతి రచనకు న్యాయం సమకూర్చగలిగారు ఈ పరిశోధకురాలు.

మా నాన్నగారు జీవితంలో కోరుకుంది "అందరూ స్వతంత్రంగా ఉండాలి. "వినా దైన్యేన జీవనం' దైన్యం లేకుండా వుండాలి. స్వయం శక్తి కలిగి ఉండాలి" అని అక్షరాలా అదే బాటలో నడిచారు. మావంటి వారెందరికో మార్గదర్శకులై అందరిచేత మా 'విశ్వన్న' అని కొనియాడబడ్డారు.

ఆయన మార్గదర్శకంలో ముందుతరాల వారందరు ఈ సిద్ధాంతవ్యాసం చదివి నవయువత మన సనాతన సంస్కృతీ సంప్రదాయాలను నిలబెట్టుతూ, సదాశయాలను ఆచరిస్తారని ఆశిస్తున్నాను.

'మహాత్మా బ్రహ్మశ్రీ అప్పాల విశ్వనాథశర్మగారి జీవితం –రచనలు – సమగ్ర పరిశీలన' అనే అంశం పరిశోధనకు గ్రహించి, విశ్వవిద్యాలయ స్థాయిలో గుర్తింపు కలుగజేయుటకు ప్రయత్నించిన శాంతాజానకిరామశర్మల కృషికి శ్రీ పాండురంగాశ్రమవాసులందరి తరపున అభినందనలు తెలియజేస్తున్నాను. వీరి కుటుంబానికి శుభాశీస్సులు అందిస్తున్నాను.

'మహాత్ముని బాటలో నడుద్దాం – చరితార్థులమవుదాం'

**శ్లో॥ కాలక్షేపో నకర్తవ్యః క్షీణమాయుర్దినేదినే।**
**దేహస్య పతంవీక్ష్య। కర్తవ్యం హరికీర్తనమ్॥**

**– బ్ర॥శ్రీ॥ అప్పాల సత్యనారాయణశర్మ**
(పాండురంగాశ్రమ అధిపతి)

# ఫలవంతమైన పరిశోధన

ఎనభైనాలుగు లక్షల జీవరాసులలో మానవ జన్మ శ్రేష్ఠమైనది. వాక్కు, బుద్ధి అనే రెండూ మానవునికి శ్రేష్ఠత్వాన్ని కలిగించాయి. మానవుడు ఉత్తమ మానవుడుగా జీవించి, పురుషోత్తముడుగా మారడం మానవ జీవన ప్రస్థాన లక్ష్యం. అంటే మానవుడు దయ, క్షాంతి, అనసూయ, శౌచం, అనాయాసం, మంగళం, అకార్పణ్యం (దైన్యం లేకుండడం), అస్పృహ (కోరికలు లేకుండడం) అనే లక్షణాలను అలవరచుకొని మానవోత్తముడుగా జీవించగలిగితే అతనికి సంస్కారం కలగడమే కాకుండా మోక్ష ప్రాప్తి లభిస్తుంది.

**"క్షమావాన్ జయతే భూమిః దయావాన్ సుఖమశ్నుతే।**
**అనసూయుర్లభతే స్వర్గం, శౌచేనాధ్యాత్మ మేవచ॥**
**మంగళాదపి సంపూజ్య, ఇహలోకే పరత్రచ।**
**సురసామ్య మనాయాసాత్, అకార్పణ్యత్వాత్ ప్రకృతౌలయమ్॥**
**అస్పృహో లభతే నిత్యమనన్తం సుఖమేవచ।**
**సర్వైస్తు బ్రాహ్మణః స్థానం, సంస్కారైస్తు తథైవచ॥"**

పైన పేర్కొన్న అష్టగుణ భూయిష్టుడైన కారణజన్ముడు మహాత్మా బ్రహ్మశ్రీ అప్పాల విశ్వనాథ శర్మగారు. ఆయన ఉత్తమ జీవిత ప్రస్థానాన్ని సాగించిన వారు మాత్రమే కాదు. ఉత్తమ కవిత్వాన్ని సృజించిన వారు కూడా. ఆయన భక్తి సంయుతమైన ఉత్తమ కవిత్వం ఆయన జీవితానికి మెరుగులు దిద్దడమే కాదు, సమాజానికీ ఒక మార్గాన్ని నిర్దేశించింది. దీనితో శర్మగారు తానూ తరించి, ఇతరులనూ తరింపజేశారు. (స్వయంతీర్ణః పరాంస్తారయతి)

అలాంటి మహోన్నత వ్యక్తిత్వంగల విశ్వనాథశర్మగారి జీవితాన్ని, రచనలను సమగ్రంగా పరిశోధించడానికి కంకణబద్ధులై ఆ కార్యాన్ని అనాయాసంగా నెరవేర్చి, డాక్టరేట్ పట్టాపొందారు శ్రీమతి గౌరీభట్ల శాంత. ఉత్తమ మార్గంలో పయనించేవారికి ఉత్తమ పరిశోధనాంశాలే లభిస్తాయి. అయితే గృహిణిగా కుటుంబ బాధ్యతలను

నిర్వర్తిస్తూ, ఉద్యోగినిగా అధ్యయన, అధ్యాపనాలను సాగిస్తూ, పరిశోధనను చేపట్టి ఆబాధ్యతను కూడా సమర్థంగా నిర్వహించడం ఆమె దీక్షకు, దక్షతకు నిదర్శనం.

విశ్వనాథ శర్మగారి జీవితకాలంనాటి సామాజిక నేపథ్యాన్ని వివరించి, ఆయన జీవనరేఖలు, గార్హస్థ్య జీవితాన్ని పరిశీలించడం, ఆయనవ్యక్తిత్వ పరిమళాన్ని తమ పరిశోధనలో గుబాళింపచేయడం, ఆయన ఆశ్రమ నిర్వహణ, భౌతిక ఆధ్యాత్మిక జీవితాన్ని అనుశీలించడం ఒక ఎత్తైతే ఆయన రచనలను ప్రాధాన్య వివక్షతో పరిశీలించి, వాటిలోని పరమార్థాన్ని వివేచించడం, తత్త్వాన్ని అనుశీలించడం, రచనలలోని సంగీత సాహిత్యాలను విశ్లేషించడం మరొక ఎత్తు.

డా. జి. శాంత పరిశోధనకు అన్వేషణం లక్షణంగా, సాహిత్య సిద్ధాంత దర్శనం లక్ష్యంగా కనబడుతుంది. ఆమె తమ పరిశోధనలో శర్మగారి జీవిత ప్రస్థానాన్ని వివరించేటప్పుడు వర్ణనాత్మకతను ఆశ్రయించారు. శ్రీ పాండురంగశతకాన్ని పరిశోధించడంలో వివేచనాత్మకత దర్శనమిస్తుంది. శ్రీ శివలింగ విలాసాది శతకాలను పరిశోధించేటప్పుడు అనుశీలనాత్మకతకు ప్రాధాన్యం ఇచ్చారు. మంగళహారతులు చిత్రకవిత్వ పరిశీలనలో విశ్లేషణాత్మకత, పూజపాట మొదలైనవాటి పరిశోధనలో సమన్వయాత్మకత కనబడతాయి. మొత్తం మీద ఈ అయిదురకాల పరిశోధనాంశాలు శర్మగారి జీవిత, సాహిత్య సిద్ధాంత ప్రతిపాదనాత్మక పరిశోధనాముఖంగా సాగి శర్మగారు అద్వైతి అని, ఆయనగ్రంథాలలో ప్రతిపాదించబడింది. (పైకి భక్తిరసంలా కనబడుతున్నా) అద్వైత సిద్ధాంతమని సిద్ధాంతీకరించడం వల్ల ఆమె పరిశోధనకు పరిపూర్ణత చేకూరింది. ఆమె ప్రభావ పరిశీలనం జోలికి వెళ్ళలేదు. శర్మగారిపై ఇతరుల ప్రభావంకాని, శర్మగారి ప్రభావం ఇతరులపై ఉన్న విషయాన్ని గురించి పరిశీలించడాన్ని ఆమె తన పరిశోధనా పరిధిలోకి గ్రహించలేదు. ఆమె ఆయన సాహిత్య సిద్ధాంత దర్శనం మీదనే దృష్టిని కేంద్రీకరించి, పరిశోధనను సాగించి, ఫలితాన్ని సాధించింది.

గౌరీభట్లవారి కుటుంబం భక్తి, ఆధ్యాత్మికతలకు ఆలవాలం. డా. శాంత తండ్రి శ్రీ రాధాకృష్ణమూర్తిగారు పరమనైష్ఠికులు, స్మర్త, సాహితీవేత్త, సహృదయులు. ఆయన ఆమెలో పరిశోధనా బీజం నాటారు. ఆమెను చేపట్టిన శ్రీ త్రిగుళ్ల జానకిరామశర్మగారు

ఆమెలోని పరిశోధనా బీజానికి నీరు పోయడమేకాక అంకుర, కోరక, పుష్ప, ఫలావస్థలను పొందేట్లుగా దోహదం చేసి శ్రీమతి శాంత, డాక్టర్ శాంత కావడానికి సర్వదా, సర్వథా కృషి చేసేట్లుగా ప్రోత్సహించారు. అంతేకాదు డా. శాంత విద్యార్థిదశ నుంచి పట్టుదలగల వ్యక్తి. ప్రతిభాశాలిని. అనుకున్నది సాధించేంతవరకు నిద్రపోని మనస్తత్త్వం ఆమెది. అందువల్లనే ఈ ఫలవంతమైన పరిశోధనను విజయవంతంగా సాగించారు. అంతేకాదు, ఆ గ్రంథాన్ని వెలుగులోకి తీసికొని రావడం తెలుగు సమాజానికి మార్గదర్శకంగా ఉంటుందనడంలో సందేహం లేదు. ఇంతటితో ఆగక తమ పరిశోధనను ఇక ముందు కూడా సాగించి, సాహిత్యలోకంలో తనదైన ఒక స్థానాన్ని ఏర్పరచుకోవాలని ఆకాంక్షిస్తున్నాను. భవిష్యత్తులో వారు, వారి కుటుంబం అభ్యుదయపథంలో పయనించాలని కోరుకుంటున్నాను. ఈ వెన్నెలపాటలో రెండుమాటలు వ్రాసే అవకాశాన్నిచ్చిన డా. జి. శాంత, జానకిరామశర్మలను అభినందిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

**– డా॥ బి. జయరాములు**

**చైర్మన్, బోర్డ్ ఆఫ్ స్టడీస్ (ఓరియంటల్ ఫ్యాకల్టీ – తెలుగు)**

**ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్**

తేది : 2.4.2007

సర్వజిత్, చైత్ర శు. 15

సోమవారం

## బ్రహ్మశ్రీ అప్పాల విశ్వనాథశర్మగారి
## జీవితం - రచనలు - సమగ్ర పరిశీలన (సిద్ధాంతవ్యాసం)

# విషయసూచిక


**1. విశ్వనాథశర్మగారి జీవన రేఖలు - గార్హస్థ్య జీవితం** 24–34

1. భూమిక
2. విశ్వనాథావతరణం
3. విశ్వనాథుని ఆలన పాలన
4. విశ్వనాథుని విద్యార్జన రీతి
5. శ్రీ విశ్వనాథ శర్మగారి కుటుంబం

**2. సకల సద్గుణభరితం శ్రీ శర్మగారి వ్యక్తిత్వం** 35–46

అ) నిత్యతృప్తుడు
ఆ) నిర్భయస్థుడు
ఇ) సత్యవాక్కు
ఈ) నిస్స్వార్థపరుడు
ఉ) దాత
ఊ) భూతదయాపరుడు
ఋ) అహింసామూర్తి
ౠ) సహనశీలి
ఌ) శాంతిదూత
ౡ) ఉత్తమ అధ్యేత
ఎ) సూక్ష్మగ్రాహి
ఏ) పరోపకారి
ఐ) సమాజసేవకుడు
ఒ) పితృభక్తి పరాయణుడు
ఓ) నియమబద్ధ జీవనుడు
ఔ) భక్తవత్సలుడు

అం) భగవత్సాయుజ్య సాధకుడు

అః) మహాత్ముడైన మనీషి "విశ్వన్న"

**3. శ్రీపాండురంగాశ్రమ విశిష్టత–పితాపుత్రుల వరివస్య** 47–59

1. అ) శ్రీ పాండురంగాశ్రమం ప్రశాంతతకు నిలయం

ఆ) భౌతిక, ఆధ్యాత్మికతల ఉన్నతికి పెన్నిధి బాబాగారి సన్నిధి.

ఇ) నాటి చారిత్రక సామాజిక స్థితిగతులు – ప్రజలకు ఆశ్రమం అండదండలు

2. భజనసంప్రదాయం – భక్తితత్త్వం

క) ఏకాంతభజన

ఖ) సామూహికభజన

గ) చక్రిభజన

ఘ) పహరాభజన

3. బాధ్యతాస్వీకారం – భారనిర్వహణం

అ) నిరంతర కార్యక్రమ రూపశిల్పి – నిష్కామకర్మయోగి

ఆ) ఆషాఢ ఉత్సవాలు

**4. శ్రీపాండురంగశతకం – పరమార్థ వివేచనం** 60–89

1) శ్రీపాండురంగశతకం – తత్త్వానుశీలనం

2) అద్వైత తత్త్వ ప్రతిపాదనం

3) పాండురంగనిలో అవతార తత్త్వప్రదర్శనం

4) ఆత్మపరమాత్మ తత్త్వచిత్రణం

5) పాండురంగని దయాతత్త్వం

6) బ్రహ్మసత్యం జగన్మిథ్య

7) నవవిధ భక్తులు – నామస్మరణం

8) పూర్వకవుల సంప్రదాయాన్ని పాటించడం

9) సాహిత్యతత్త్వం – ఆధ్యాత్మిక నేపథ్యం

10) ఫలపుష్ప సమర్పణం

**5. శ్రీశివలింగ విలాసాది శతకాలు - తత్త్వానుశీలనం** 90–106

1. శ్రీశివలింగవిలాసం

    అ) మతసామరస్యం

    ఆ) అద్వైత భావప్రాధాన్యం

    ఇ) విశేషాంశాలు

2. "నామస్మరణ శతకం" ముక్తిగమ్య బోధకం

3. "శ్రీపాండురంగ వర్ణమాల శతకం" అనేక భావవర్ణాల ద్యోతకం

4. "సద్భావలహరి శతకం" సంపూర్ణ వైరాగ్య భావశోభితం

5. శబ్దాలంకారాల డోల "కేశవాది నామమాల"

6. "రామనామరహస్యము" రామనామ వైశిష్ట్యం

7. గంగావతరణం కోసం "ఆవేదన"

**6. చిత్రకవిత్వంలో చిదానందరూపం** 107–119

(ఎ) ద్వ్యక్షరిలో భక్తి

(బి) బంధకవిత్వం

    ఎ) ఆయుధబంధాలు

    బి) ప్రకీర్ణబంధాలు

ఎ) ఆయుధబంధాలు

    1. షోడశదళ చక్రబంధం

    2. ఖడ్గబంధం

    3. అసిబంధం

    4. ఛురికాబంధం

    5. చక్రబంధం

బి) ప్రకీర్ణబంధాలు

    1. నాగబంధం

    2. పంచపుష్పమాలికాబంధం

    3. చంపకమాలికాబంధం

    4. గోమూత్రికా బంధం

సి) గర్భకవిత్వం

    1. కందగీతగర్భ చంపకమాల

2. చతుర్విధ కందం

డి) తాత్త్వికసంఖ్య ఏకస్వరూపం

**7. సంస్కృతసుప్రభాతాదులు - స్థూలసమీక్ష** 120–143

1) సుప్రభాతాలు - సుమనోహర భక్తిభావ బంధురాలు

ఎ) శ్రీ పాండురంగ సుప్రభాతమ్

బి) శ్రీ శివపంచాయతన సుప్రభాతమ్

సి) శ్రీ సీతారామచంద్ర సుప్రభాతమ్

డి) శ్రీ ఆంజనేయ సుప్రభాతమ్

ఇ) శ్రీ భావానంద భారతీ సుప్రభాతమ్

2) స్తోత్రాలు - గురు, దేవానుగ్రహ పాత్రాలు

ఎ) శ్రీ భావానంద స్తోత్రమ్

బి) శ్రీ భావానంద భకార శతనామస్తోత్రమ్

సి) శ్రీ బాలవీర మారుతి స్తోత్రమ్

డి) శ్రీ సాయిబాబా అష్టోత్తర శతనామ స్తోత్రమ్

ఇ) గంగా పంచరత్న స్తోత్రమ్

3) అష్టకాలు - భక్తితత్త్వ బోధకాలు

ఎ) రుద్రదేవాష్టకమ్

బి) శ్రీ రుక్మిణీవల్లభాష్టకమ్

సి) శ్రీసీతారామచంద్రాష్టకమ్

డి) శ్రీ కృష్ణప్రేమాష్టకమ్

ఇ) శ్రీ రాధాష్టకమ్

ఎఫ్) శ్రీ రాజరాజేశ్వర్యష్టకమ్

జి) శ్రీ సంతోషిమాత్రష్టకమ్

హెచ్) శ్రీసత్యదేవాష్టకమ్

4. శ్రీ భావ నవనీతమ్

5. శ్రీ రాజేశ్వరీ నవకమ్

6. నమామి మురళీధరమ్

7. ప్రపన్న శతకమ్

**8. మంగళహారతులు – సంగీత సాహిత్య శోభితాలు** 144–181

1) మంగళహారతులు – వైశిష్ట్యం

2) మంగళహారతులు – వర్గీకరణ

3) శ్రీ కృష్ణ హారతులు

అ) బాలకృష్ణుని వర్ణన

ఆ) గోపాలకృష్ణుని వర్ణన

ఇ) శ్రీ రాధాకృష్ణుని వర్ణన

ఈ) హారతులలోని శబ్దార్థాలంకార ఔచిత్యం

ఉ) సంస్కృతంలో శ్రీకృష్ణ హారతులు

4) శ్రీపాండురంగ హారతులు

అ) సంస్కృతంలో శ్రీపాండురంగ హారతులు

5) శ్రీరామ హారతులు

అ) సంస్కృతంలో శ్రీరామ హారతి

6) శ్రీ ఆంజనేయ హారతులు

7) శ్రీ శివ హారతులు

అ) పదప్రయోగ ఔచిత్యం

ఆ) అలంకార శిల్పం

ఇ) సంస్కృతంలో శివహారతులు

8) శ్రీ విఘ్నేశ్వర హారతి

9) భగవద్భక్తుల హారతులు

అ) శ్రీ వివేకానందస్వామి హారతి

ఆ) శ్రీ భావానందస్వామి హారతులు

ఇ) శ్రీ శంకరాచార్య హారతి

10) స్త్రీ దేవతా హారతులు

1. సంతోషిమాత హారతి

2. సరస్వతీదేవి హారతి

అ) అలంకార శిల్పం
3. శ్రీ రాజరాజేశ్వరి హారతులు
4. శ్రీ యశోదమాత హారతి
11) హారతులలోని విషయ విశ్లేషణం
1. భౌతిక వర్ణనా హారతులు
అ) శ్రీకృష్ణుని వర్ణన
ఆ) శివుని వర్ణన
2. మానసిక వర్ణనా హారతులు
అ) శ్రీకృష్ణుని మానసిక చిత్రణం
ఆ) శ్రీరాముని మానసిక చిత్రణం
3. కథాస్ఫురణ హారతులు
4. మధురభక్తి హారతులు
5. వైరాగ్యవేదాంత ప్రతిపాదక హారతులు

**9. పూజపాట – షోడశోపచారాల తేట** 182–205

ఎ). రూపసాక్షాత్కారం “ధ్యానం”
1. ఆనందపీఠంపై “ఆవాహనం”
2. హృదయ సింహాసనమే “ఆసనం”
3. పరమాత్మ పాదపద్మాలకు “పాద్యం”
4. ధర్మమోక్షదాయకం “అర్ఘ్యం”
5. త్రిగుణాతీతునికి త్రికరణశుద్ధిగా (త్రిః) “ఆచమనం”
6. ఆయా పదార్థాల అభిషేకమే “స్నానం”
7. అలంకారార్థం “వస్త్రం”
8. బ్రహ్మత్వ సిద్ధికోసం “బ్రహ్మసూత్రం” (యజ్ఞోపవీతం)
9. స్వామి అలంకార ప్రీతికి “చందనం”
10. ఆకర్షణ, అనుగ్రహాల కోసం “పుష్పం”
11. ఇంద్రియతర్పణకు “ధూపం”
12. జ్ఞానస్వరూప దర్శనంకోసం “దీపం”
13. భగవన్నివేదనమే “నైవేద్యం”

14. వాసనారాహిత్యం కోసం "తాంబూలం"
15. త్రిగుణాతీతత్వ సాధనకోసం "ప్రదక్షిణం"
16. స్వీయసమర్పణం "నమస్కారం"
అ) లౌకిక మాధుర్యం "మధుపర్కం"
ఆ) ఆనందదాయకాలు "అక్షతలు"
ఇ) అలంకారప్రియునికి "ఆభరణాలు"
ఈ) సంగీత సాహిత్య ఆరాధనం "నీరాజనం"
ఉ) వరాలవర్షం "మంత్రపుష్పం"
ఊ) పరోపకారార్థం "ఫలశ్రుతి"

**10. మేలుకొలుపు, లాలి, జోల పాటలు - విషయానుశీలనం** 206-216

1) జీవులరక్షణకు పిలుపు "మేలుకొలుపు"
2) భక్తజన తాపహారి "లాలిపాట"
3) ఆనందదాయిని "జోలపాట"
4) విశ్వనాథముద్ర - "విశ్వము"
5) ఉపసంహారం

**అనుబంధం -1** 217-219

పద్య ప్రసూనాలు

**అనుబంధం - 2** 220-221

శర్మగారి ఆత్మీయుల అభిప్రాయ సుమాలు

**అనుబంధం - 3** 222-224

శర్మగారి ఆశ్రమజీవితాన్ని, ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రతిబింబించే ఛాయాచిత్రమంజరి.

**ఉపయుక్త గ్రంథసూచి** 225-229

**అనుషక్త గ్రంథసూచి** 230

# 1. విశ్వనాథశర్మగారి జీవనరేఖలు - గార్హస్థ్య జీవితం

## 1. భూమిక

**భా**రతభూమి కర్మభూమి. ఈ భూమిలో జన్మించడమే ఒకవరంగా ఎందరో భావించారు. బుద్ధ భగవానుడు, ఆదిశంకరాచార్యులు, మధ్వాచార్యులు, రామానుజా చార్యులు, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, రమణమహర్షి మొదలగు మహనీయులు జన్మించి, ఈ దేశానికి గణనీయమైన సేవజేసి మాతృభూమి ఋణం తీర్చుకున్నారు. ఎందరో విదేశీయులు సైతం మన భారతావనిలో ఉండాలని, ఇచటి సంస్కృతీ సంప్రదాయాలను అలవరచు కోవాలని భావించారు, భావిస్తున్నారు.

భారతదేశంలోని అన్ని రాష్ట్రాలు విశిష్టమైనవే. వాటిలో ఆంధ్రప్రదేశ్ మరీ విశిష్ట మైనది. ఇది అన్ని కళలకు పుట్టినిల్లు. ఇక్కడ అన్ని రంగాలలో ప్రముఖులు ఎందరో ఉన్నారు. వారిలో ఆదికవి నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱాప్రగడ, పోతనామాత్యుడు మొదలైన కవీశ్వరులు, అన్నమాచార్యులు, త్యాగరాజు, రామదాసు మొదలైన వాగ్గేయకారులు, వేమన, వీరబ్రహ్మంలాంటి యోగులు, మోక్షగుండం విశ్వేశ్వరయ్య, ఎల్లాప్రగడ సుబ్బా రావులాంటి విజ్ఞానశాస్త్రవేత్తలు, శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్, కనుపర్తి వరలక్ష్మమ్మ, కందుకూరి లాంటి సమాజసేవకులు, తిరుపతి వేంకటకవులు లాంటి అవధానులు, గోరా, మల్లాది సుబ్బమ్మలాంటి హేతువాదులు, టంగుటూరి ప్రకాశంపంతులు, నీలంసంజీవరెడ్డిలాంటి రాజకీయవేత్తలు, ఇలా ఎందరెందరో మహనీయులు జన్మించారు.

హిందూధర్మాన్ని సంస్కృతీ సంప్రదాయాలను కాపాడుకోవాలనే తపనతో ఎందరో మహాత్ములు ప్రజలకు ప్రబోధించి చైతన్యవంతులను చేశారు. అలాంటి మహాత్ములకోవలోకి చేరదగినవారే శ్రీ అప్పాల విశ్వనాథశర్మగారు.

చిన్ననాటి నుండి ఆశ్రమప్రాంగణంలో పెరిగి ఆశ్రమాన్ని ఆదర్శవంతంగా నడిపి, ఆధ్యాత్మిక భావాలను పెంపొందింపజేసి తన కవిత్వంతో తన నడవడికతో ఆదర్శప్రాయులై నిలిచారు.

అమితమైన దైవభక్తి, పితృభక్తి కలిగి, ఆయన ఉన్నతమైన కవిత్వ సంపదను

పొందగలిగారు. తన జీవితంలో ఎదురైన సుఖదుఃఖాలను ఒకే రీతిగా చూడ గలిగారు.

స్వాతంత్ర్యం కోసం మనదేశంలో ఉద్యమాలు, సత్యాగ్రహాలు సాగుతున్నరోజులు అవి. ఆంధ్రప్రాంతం తమిళనాడులో కలిసి ఉంది. తెలంగాణా ప్రాంతం నిజాం పాలనలో ఉంది.

ఆంధ్రప్రాంతంలో ఎందరో మహనీయులు చైతన్యవంతులై స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటున్నారు. కాని తెలంగాణలో నిజాం పరిపాలనలో ఆ అవకాశం లేక తెలుగు ప్రజ, తెలుగు భాష కూడా దీనదశలో ఉన్న రోజులవి.

ఆ పరిస్థితులలో ఇక్కడ కవులు ఉదయించారంటే వారి అనితరసాధ్యమైన కృషివల్లే సాధ్యమయింది. అలా ఉదయించిన కవులలో విశ్వనాథశర్మగారు ఒకరు.

## 2. విశ్వనాథావతరణం

ఆంధ్రప్రదేశ్‌లోని మెదక్‌జిల్లా మొలుగు మండలంలో గల వర్గల్ గ్రామం. నేడు సరస్వతీక్షేత్రంగా ప్రసిద్ధి చెందినది. ఈ వర్గలే మొదట అప్పాలవంశం వారి జన్మస్థానం. వారి ప్రపితామహులు శ్రీ వెంకయ్యగారు. వెంకయ్యగారు సంతానం కోసం శంభు(దేవు)ని గూర్చి తపస్సు చేశారు. అలా కలిగిన సంతానానికి శంభయ్య అనే పేరుపెట్టారు. శ్రీ శంభయ్యగారు, విశ్వనాథశర్మగారి పితామహులు.

శ్రీశంభయ్య, శ్రీమతిరత్నాంబ దంపతులకు గారాల పట్టిగా 1899వ సంవత్సరంలో ఒక కుమారుడు జన్మించాడు. ఆయనకు వారు 'సత్యనారాయణ' అని నామకరణం చేశారు. ఈ సత్యనారాయణగారే విశ్వనాథశర్మగారి తండ్రి.

శ్రీసత్యనారాయణగారు తమ పూర్వులలాగే చిన్ననాటి నుండి ఆధ్యాత్మ రామాయణ పారాయణం, గాయత్రీ జపం, సంధ్యావందనాది కార్యక్రమాలు నియమం తప్పకుండా చేసేవారు. నిరంతర భగవన్నామస్మరణ చేస్తూ, పౌరోహిత్యం చేసి కుటుంబపోషణ కావించు కొన్నారు.

1915లో సత్యనారాయణగారికి శ్రీ త్రిగుళ్ళ రామచంద్రయ్యగారి పుత్రిక 'యశోద' అనే అమ్మాయిని ఇచ్చి వివాహం చేశారు. నాటి నుండి ఆమె భర్తకు అనుకూలవతియైన భార్యగా సంసార జీవనం సాగించింది.

సత్యనారాయణగారు గృహస్థాశ్రమ ధర్మాన్ని చక్కగా నిర్వహించారు. అతిథిసేవ, భగవద్భజన, నిరంతర ధ్యానం, జపం, విరివిగా అన్నదానం, యాత్రలు, సప్తాహాలు, దీనజనుల సేవలను చిత్తశుద్ధితో చేశారు. ఆయన మంచికవి. "బాలభక్తి" గేయసంపుటి రచించారు. అది ఆయన మనోభావాలకు దర్పణంలాంటిది.

హిందువుల పవిత్రక్షేత్రమైన కాశీపట్టణానికి వెళ్ళివచ్చిన తరువాత సత్యనారాయణ, యశోదా దంపతులకు మొదటి సంతానం కలిగింది. ఆయనే విశ్వనాథుడు.

మెదక్ జిల్లా కుకునూరుపల్లెలో తమ పెద్దమ్మగారి ఇంటిలో 31.7.1927 నాడు రాత్రి 12గంటలకు ఆయన జన్మించారు.




విశ్వనాథశర్మ, సోదరులు మరుకూకులో పెరిగి పెద్దయ్యారు. విశ్వనాథశర్మ గారికి జ్ఞాపకశక్తి అధికం. ఆయనకు చిన్ననాడు మూడేళ్ళ ప్రాయంలో జరిగిన విషయాలు కూడా జ్ఞాపకం ఉండేవి. మరుకూకు గ్రామంలో విశ్వనాథశర్మ తండ్రి సత్యనారాయణగారిని నారాయణబాబా అని గౌరవంగా పిలిచేవారు. నారాయణ బాబాగారు ఎల్లప్పుడు భజనలు చేస్తూ, చేయిస్తూ ఉండడంవల్ల చుట్టుప్రక్కల గ్రామాలవారంతా వీరింటికి రావడం, తెల్లవార్లు భజనలు చేయటం కొంతమందికి కష్టంగా ఉండేది. అందువల్ల ఇతనిపై నేరారోపణలు చేసి ఆయనను, అక్కడినుంచి పంపించాలని భావించి లేనిపోని ఆరోపణలు చేశారు.

నారాయణ బాబాగారు భగవంతుని భజన, సేవలేకుంటే గ్రామంలో తానుండ నని, ఏదైనా అరణ్య ప్రాంతానికి వెళ్తానని నిశ్చయించుకున్నారు. ఆయన భార్య యశోదమ్మ కూడా ఆయననే అనుసరించింది. ఊరికి చాలా దూరంలో 'జంగ మగుళ్ళు' అనే అడవి ప్రాంతంలో ఉండడానికి నిర్ణయించుకొని, తమ పిల్లలతో కూడా అక్కడికి చేరారు. అప్పటికి విశ్వనాథశర్మ వయస్సు ఏడుసంవత్సరాలు. నాటి నుండి అక్కడే పెరిగి పెద్దవారయ్యారు.

ఆ అరణ్యప్రాంతంలో మొదట గుడిసెలు వేసుకొని భగవద్భజనకు ఎలాంటి ఆటంకం రాకుండా జీవితం కొనసాగించారు. రాను రాను భక్తజనులు పెరగటంవల్ల పక్కా ఇల్లు నిర్మింపజేశారు. ఆయిల్లు కొన్ని వందల మంది భక్తులు వచ్చినా ఉండడానికి యోగ్యంగా కట్టించారు. తర్వాత పండరీపురానికి వెళ్ళి అక్కడి నుంచి పాండురంగని, రుక్మిణీదేవి విగ్రహాలను తీసుకొనివచ్చి చక్కటి ఆలయాన్ని నిర్మింప జేశారు. అదే ఇప్పుడు 'శ్రీ పాండురంగా శ్రమం'గా ప్రసిద్ధి పొందింది. అక్కడ ఆషాఢ ఉత్సవం నాటినుండి నిర్వహిస్తున్నారు.

అలాంటి భక్తిపూరిత వాతావరణంలో పెరిగారు విశ్వనాథశర్మగారు. శర్మగారి తోబుట్టువులు అనారోగ్య కారణాలవల్ల మరణించారు. వారు ఒకరి తరువాత ఒకరు ఆరుగురూ చనిపోయారు. చివరగా ఒక చెల్లెలు శ్రీమతి మహాలక్ష్మమ్మ మాత్రం జీవించి ఉంది.

## 3. విశ్వనాథుని ఆలన పాలన

ఆశ్రమంలో విశ్వనాథశర్మగారు పెరుగుతూ, దినదినాభివృద్ధి నొందుచుండగా ఎటు చూసినా భక్తులు, భజనలు, దైవకార్యక్రమాలు, సూక్తులు వినిపించేవి. తనకు తెలియకుండానే భక్తి బీజాలు ఆ చిన్ని హృదయంలో నాటుకున్నాయి.

ఆయనకు "మూడేళ్ళ ప్రాయము నాటి సంఘటనలు కూడా జ్ఞాపకములో ఉండేవి."[1] చిన్ననాటి నుండి ఒకసారి ఏదైనా వింటే అది నోటికి వచ్చేది. ఆయన ఏకసంథాగ్రాహి. ఇంట్లో అందరితో కలిసిమెలిసి ఉండేవారు.

ఆటలలో బంతియాట మాత్రమే ఆడేవారు. పిల్లలతో కలిసి చిన్నచిన్న బొమ్మలను పెట్టి పూజలు, భజనలని తోటి వారిని కూర్చోబెట్టుకొని ఆడేవారు.

తాతగారైన శ్రీశంభయ్యగారు ఒక్కగానొక్క మనవడిని గారాబంగా చూసుకొనే

వారు. అదంతా అడవి ప్రాంతం కాబట్టి చీకట్లో ఎటైనా వెళ్ళవలసి వస్తే తను స్వయంగా లాంతరు పట్టుకొని మనుమని తీసికెళ్ళేవారు. ఇలా తాతగారు మనవడిపై ఎంతో మమకారం చూపే వారు.

విశ్వనాథశర్మగారి మేనత్త శ్రీమతి నర్సమ్మగారు బాలవితంతువు. అన్నగారైన నారాయణ బాబాగారి పోషణలోనే కాలం గడిపేది. ఆశ్రమ నిర్వహణలో అహర్నిశలు కష్టపడి తన జీవితాన్ని సార్థకం చేసుకుంది. సహనశీల, ధైర్యవంతురాలు. ఈమె తన మేనల్లుడైన విశ్వనాథుని అమితప్రేమతో ఆదరించేది. ఆ బాలునికి అన్ని అమర్చిపెట్టేది.

'ఈశ్వరుడు' అనే ఆయన నారాయణబాబాగారి ప్రియశిష్యుడు. ఆశ్రమానికి తన చిన్ననాడే వచ్చి స్వామిసేవకే అంకితమయ్యాడు. ఆ ఈశ్వరుడు ఆశ్రమంలో వ్యవసాయం, ఆర్థిక లావాదేవీలు చూసుకొనేవాడు. గురుపుత్రుడైన విశ్వనాథుని కాలికి మట్టి అంటనివ్వకుండా చూస్తూ, చాలా జాగ్రత్తగా, కంటికి రెప్పలా కాపాడేవాడు.

విశ్వనాథుని తల్లి యశోదమ్మ అచంచలమైన భగవద్భక్తి కలది. చాలా నెమ్మదస్తురాలు. సుగుణశీల. ఆమెకు ఉబ్బసపువ్యాధి ఉండేది. అయినా పతిసేవ, అతిథిసేవ చేస్తూ బాలునికి భక్తి కథలు, భగవంతుని లీలలు వివరించేది. విశ్వనాథునికి తల్లిగారి సహజగుణం సహనం పూర్తిగా అబ్బింది.

తల్లిదండ్రులు, తాత, మేనత్త, ఈశ్వరుడు వీరి పోషణ విశ్వనాథునికి శ్రీరామరక్ష.

ఆశ్రమానికి వచ్చే భక్తులు, ఆత్మీయులు, శిష్యులు ఈ బాలుని గురుపుత్రునిగా భావించి ఆడించేవారు. ప్రేమించేవారు. ఎంతోమంది బంధువులు నెలలకొద్ది ఇక్కడే ఉండేవారు. పెదతల్లి, పినతల్లి పిల్లలు, గుండు వంశంవారు ప్రక్కనే ఊరైన దామరకుంటలో ఉండేవారు. వారి పిల్లలు అంతా ఇక్కడే ఉండేవారు.

ముఖ్యంగా గుండు వెంకటరామయ్య, రఘురామయ్య, త్రిగుళ్ళ నరసింహాశర్మ మొదలైన వారు బాలునికి బాల్యమిత్రులు. చెల్లెళ్ళు మహాలక్ష్మమ్మ, బాల రుక్మిణి (చిన్నమ్మ కూతురు) వీరితో కూడా పోటీపడి ఆడుకునేవారు.

ఆ చిన్ననాటి స్నేహం పెద్దయిన తరువాత కూడా వదలలేదు. వారికి ఏ సమస్య వచ్చినా తనవంతుగా సహాయం చేసేవారు.

ఈవిధంగా శర్మగారి బాల్యం ఎలాంటి ఒడిదొడుకులు లేకుండా గడిచింది.

## 4. విశ్వనాథుని విద్యార్జనరీతి

విశ్వనాథశర్మ నాలుగోయేట తండ్రి నారాయణబాబాగారు అక్షరస్వీకారం గావించారు. వర్ణమాల మొదలు తెలుగు చదవడం, వ్రాయడం ఇంటివద్దే తండ్రివద్ద అభ్యసించారు.  పాఠశాలకు వెళ్ళలేదు. తెలంగాణా ప్రాంతం నిజాం పాలనలో ఉంది. నాడు పాఠశాలలలో ఉర్దూ నేర్పేవారు. తెలుగుభాషకు ప్రాధాన్యం తక్కువగా ఉండేది. అందువల్ల చాలామంది తమ పిల్లలను పాఠశాలకు పంపించడానికి ఇష్టపడేవారు కాదు. వీధిబడులు ఏకాచార్య నిర్వహణలో ఉండేవి. ఆశ్రమప్రాంతానికి దూరంగా ఉండేవి. ఈ కారణాలవల్ల విశ్వనాథుడు పాఠశాలకు వెళ్ళలేదు.

శర్మగారి తండ్రి 'బాలభక్తి' అనే భక్తిగీతమాల రచించారు. సహజంగానే తండ్రి కవి, పండితుడు కనుక పిల్లవాడికి తద్వారా కవిత్వం, సంగీతం అబ్బినాయి.

"విశ్వనాథ శర్మగారికి ఎనిమిదవ ఏట ఉపనయన సంస్కారం గావించారు. ఆకాలంలో ఆ వేడుకను చూడటానికి చుట్టుప్రక్కల గ్రామాలప్రజలు బ్రాహ్మణులు వందలమంది విచ్చేశారు. భోజనాదులు స్వీకరించి వటువును ఆశీర్వదించి వెళ్ళారు."[2] నాటి నుండి  ఆయన సంధ్యావందనం, సహస్ర గాయత్రి, విష్ణు సహస్రనామాలు, దైవపూజ మొదలైన నిత్య నైమిత్తిక కర్మలను ఆచరించేవారు. తమకు పదకొండు, పన్నెండేళ్ళ వయస్సు వచ్చిన తరువాత ప్రక్కనే ఉన్న ఊరు మాముదాలలో తన అమ్మమ్మగారింట మేనమామ త్రిగుళ్ళ రఘురామశర్మగారి వద్ద 'కుమార సంభవం రెండుసర్గలు, మేఘసందేశం ఒక సర్గ' విశ్వనాథ శర్మగారు, ఆయన మిత్రులు ఆదరాసుపల్లి రఘురామశర్మగారితో కలిసి చెప్పించుకున్నారు.

పాఠం చెప్పినపుడు మాత్రం వినడమేకాని, తరువాత ఆ పాఠం వల్లించడంకాని, చదవటంకాని చేసేవారుకాదు. తన మిత్రునికి వచ్చేవరకు మాత్రం శ్రద్ధగా చదివించేవారు.

గురువుగారు "నాయనా! విశ్వన్నా! ఈరోజు చదువవలసిన శ్లోకం చదువు" అనగానే గడగడా శ్లోకం చదివేవాడు. "పద విభాగం చేయుము" అనగానే పదవిభాగం చేసేవాడు. ఇక అన్వయానికి క్రియాపదం ఎక్కడున్నదో వెదకమని

చెప్పగానే క్రియాపదం పట్టుకొనేవారు. అన్వయం చెప్పడం, అర్థాలు వివరించడం కూడా తానే చేసేవారు. కేవలం గురువుగారు అక్కడక్కడ సవరణలు చేసి, విశేషాలు మాత్రమే వివరించేవారు. అలా వాళ్ళిద్దరు కుమారసంభవంలో రెండు సర్గలు, మేఘసందేశంలో ఒక సర్గ నేర్చుకోవటంతో వారి చదువు ముగిసిందని శర్మగారి మిత్రులు సహాధ్యాయి ఆదరాసుపల్లి రఘురామశర్మగారు వివరించారు.

గురువుగారి వద్ద నేర్చినది అంతమాత్రమే కాని పంచకావ్యాలు నేర్చుకున్నా కూడా రాని విజ్ఞానం ఆయనకు అబ్బింది.

"డిగ్రీలు లేని పాండిత్యం ప్రకృతి ప్రసాదించే విజ్ఞానధనం"[3] అని విశ్వకవి రవీంద్రుని గూర్చి అమరేంద్ర వ్రాసిన వాక్యాలు వీరికి అన్వయించవచ్చు.

గోరఖ్‌పూర్ సంస్థవారి 'కల్యాణ్' పత్రిక అంకాలను తండ్రి తెప్పించేవాడు. అందులో ఏ అంకాన్ని వదలక శర్మగారు అన్నింటినీ చదివేవారు. హిందీభాషను కూడా ఆయన ఎక్కడా నేర్చుకోలేదు. సంస్కృత భాషా పరిజ్ఞానంతోపాటు, నిజాం ప్రభుత్వపాలనలో ఉండటంవల్ల కొంత ఉర్దూ భాషా పరిజ్ఞానం కూడా అలవడింది.

ఇతర కవుల రచనలను చూసి వాటిలాగా రచించాలని, సంకల్పించగానే అలాంటి రచన చేయగలిగేవారు. సులక్షణ సారం, అప్పకవీయం చదివి ఛందోపరిజ్ఞానం పొందారని ఆయన రచించిన బంధకవిత్వం ద్వారా గ్రహించవచ్చు.

సంప్రదాయ సిద్ధమైన ధోవతి, ఉత్తరీయం ధరించి, నుదుటిపై పెద్దగా కుంకుమబొట్టు పెట్టుకొనేవారు. జుట్టును కూడా హుమ్నాబాద్ శ్రీ మాణిక్‌ప్రభు మహరాజు గారిలాగా, నేటి గణపతి సచ్చిదానంద స్వామివారిలాగా పెంచుకోవడం వల్ల చూడగానే చేతులెత్తి నమస్కరించా లనే భావన కలిగేది. ఆయన స్ఫురద్రూపి. ఎప్పుడూ అందరిని సౌమ్యంగా పలకరించేవారు. హాస్య సంభాషణ అంటే చాలా ఇష్టపడేవారు.

ఆయనకు పదహారు సంవత్సరాల ప్రాయంలోనే సంసార బాధ్యతలు, ఆశ్రమ బాధ్యతలు మీదపడ్డాయి. తండ్రి సన్యాసాశ్రమ స్వీకారం వల్ల ఈ భారం ఆయనపై పడింది. ఆయన దానిలో నుండి తేరుకొనేవరకు కొన్ని సంవత్సరాలు పట్టింది. ఆ కాలంలోనే మొదటి వివాహం జరగటం, ఆమె మరణించటం, ఆతరువాత తండ్రి ఆజ్ఞమేరకు రెండో వివాహం చేసుకోవటం, సంతానం కలగటం వరుసగా జరిగాయి.

ఈవిధమైన సమస్యలతో ఆయన ఆధ్యాత్మికతకు అంతరాయం జరుగలేదు. కాని కవితాఝురి మాత్రం ఆగిపోయింది.

తల్లి మరణించిన సంవత్సరం శ్రీ పాండురంగ శతకంలోని పదహారు పద్యాలు మాత్రమే రచించి (మాతృకట్నంగా ఇచ్చి) తన ఆవేదనను వెల్లడించారు. దాని తరువాత నాలుగైదేళ్ళ తరువాత శ్రీ భావానందస్వామి (శ్రీ నారాయణబాబాగారు సన్యాసాశ్రమం స్వీకరించిన తరువాత ఏర్పడ్డ నామం)వారు పూర్తి చేయమని అనుజ్ఞనివ్వగా నాటినుండి కలంపట్టి కవితామృతాన్ని లోకానికి అందించారు.

నాడు మొదలు తమ డెబ్భైనాలుగేళ్ళ వయస్సు వరకు (దాదాపుగా నలభై, నలభై ఐదు ఏళ్ళ వరకు) ఏదో ఒక ప్రక్రియను స్వీకరించి రచనా వ్యాసంగంలో కలం నడిపించారు.

ఎలాంటి (కట్టుబాట్లు) శిక్షణ లేకుండా తనకు తానుగా విద్యను అభ్యసించారు. దైవకృపవల్ల తండ్రి అనుగ్రహంవల్ల ఆయన అంతటి ప్రతిభామూర్తి అయ్యారు.

పోతనామాత్యుడు, అన్నమయ్య, కవయిత్రి మొల్లలలాగా వీరిది దైవదత్తమైన కవిత్వం అని చెప్పవచ్చు. దీనికి ఆయన సంస్కృతాంధ్ర రచనలే దృష్టాంతం.

## 5. శ్రీ విశ్వనాథశర్మగారి కుటుంబం

శ్రీవిశ్వనాథశర్మగారి తండ్రి – ముత్తాత శ్రీ తిమ్మయ్యగారు. ఈయన శివభక్తుడు. త్రికాల పార్థివపూజా దీక్షాతత్పరులు. రోజుకు పదకొండువేల శివపంచాక్షరీ మహామంత్రాన్ని అనుష్ఠించేవారు. మెదక్‌జిల్లా గజ్వేల్ తాలూకాలోగల వర్గల్ వీరి నివాసస్థలం. ఆయనకు ఇద్దరు కుమారులు రామయ్య, వెంకయ్యలు. వీరిలో శర్మగారి ముత్తాతగారు వెంకయ్యగారు. ఈయన కూడా తండ్రిలాగా శివదీక్ష బూని, వర్గల్‌లో ఉన్న శంభుదేవుని గుట్ట దగ్గర సంతానం కోసం తపస్సు చేశారు. శివానుగ్రహంవల్ల ఆయనకు ఒక కుమారుడు జన్మించాడు. ఆ శిశువుకు 'శంభు దేవుడు' అనే పేరు పెట్టారు. ఈయన శర్మగారి తాతగారు.

శంభుదేవుడు, రత్నమాంబా దంపతులకు క్రీ.శ. 1899లో సత్యనారాయణ బాబాగారు జన్మించారు.

విశ్వనాథశర్మగారి తండ్రి సత్యనారాయణబాబాగారు. సత్యనారాయణబాబా

గారు (భావానందస్వామి) నిత్యానుష్ఠానం, దైవభక్తి, నిరతాన్నదానం, అఖండనామ జపం చేస్తూ జీవించారు. 'గ్రామంలో ఈయన భక్తి ప్రబోధాలతో జనులు మోసపోతున్నారు' అంటూ ఎవరో నేరారోపణచేయగా, ఆయన గ్రామాన్ని వదలి అరణ్యప్రాంతంలో తమ జీవనం కొనసాగించారు. ఎందరికో మార్గదర్శకులయ్యారు.

విశ్వనాథశర్మగారి తల్లి యశోదమ్మగారు. ఈమె పుణ్యవతి. భర్తను పూర్తిగా అనుసరించినది. కృష్ణుని నిరంతరం ధ్యానిస్తూ శ్యామం, శ్యామం అంటూ కృష్ణ నామాన్ని ఉచ్చరించేది. ఒక్కొక్కసారి చైతన్య మహాప్రభువులా సమాధిస్థితికిచేరి ఉన్మాదిలా ప్రవర్తించేది. అలా భర్తను సేవిస్తూ, భగవంతుని స్తుతిస్తూ, మృదు మధురంగా జనులను పలుకరిస్తూ, నిరాడంబరంగా, సహనంతో తన జీవన యాత్రను కొనసాగించిన సాధ్వీమతల్లి యశోదమ్మ.

విశ్వనాథశర్మగారి మేనత్త నర్సమ్మగారు. ఈమె బాలవితంతువు. అన్నగారైన సత్యనారాయణబాబాగారు నిర్వహిస్తున్న ఆశ్రమంలో సేవజేస్తూ, వచ్చిన అతిథి అభ్యాగతులకు వసతులు కల్పిస్తూ భోజనాదులు పెడుతూ వచ్చిన వారితో 'అమ్మా' అని పిలిపించుకొనేది. విశ్వనాథశర్మగారు ఆశ్రమ బాధ్యతను నిర్వహిస్తున్న కాలంలో తగిన సలహాలు, సూచనలు ఇస్తూ గురుతర బాధ్యతను నిర్వహించిన మహనీయురాలు ఆమె. ఏపనిచేసినా భగవదర్పణంగా చేస్తూ, నిరంతర భగవన్నామ సంకీర్తన చేస్తూ మానవసేవే మాధవసేవగా భావిస్తూ తన జీవితయాత్రను ధన్యం చేసుకున్న మాతృస్వరూపిణి.

విశ్వనాథశర్మగారి సోదరి శ్రీమతి మహాలక్ష్మి. శర్మగారికి ఈమె తోబుట్టువు. ఈమె వివాహానంతరం తన కుటుంబంతో పట్టణంలో నివసిస్తూ ఉంది. ఆశ్రమంలో జరిగే కార్యక్రమాలలో పాల్గొంటూ తనకు చేతనైన సేవచేస్తున్న ఇల్లాలు.

**శ్రీ విశ్వనాథశర్మగారి వైవాహిక జీవితం :** 1945సంవత్సరంలో వివాహం మహావైభవంగా రాములమ్మ అనే అమ్మాయితో జరిగింది. కాని విధి వక్రించింది. ఒక మగపిల్లవానికి జన్మనిచ్చి అనారోగ్యంతో మరణించింది. ఆపిల్లవాడు కూడా నాలుగైదు నెలల తర్వాత మరణించాడు.

ఈ సంఘటనతో కలతచెందిన శర్మగారు ఆశ్రమ కార్యక్రమాల నిర్వహణకే తన పూర్తి కాలాన్ని వినియోగించాలని నిశ్చయించుకున్నారు.

మూడేళ్ళ తరువాత తండ్రి సత్యనారాయణ బాబాగారు శర్మగారిని ఆశ్రమ నిర్వహణ కోసమైనా నీవు సంతానవంతుడవ్వాలని, తిరిగి తప్పక పెళ్ళిచేసుకోవాలని ఆజ్ఞాపించగా, తండ్రి మాట ప్రకారం దొంతి పాలావర్ఘుల (చేండ్లవారి) విశ్వనాథ శాస్త్రిగారి కూతురు కాత్యాయని అనే అమ్మాయిని 1948సం॥ వివాహం చేసుకున్నారు. వీరిరువురిది అన్యోన్య దాంపత్యం.

శర్మగారికి ఆరుగురు అమ్మాయిలు. 1. శ్రీమతి భారతి, 2. శ్రీమతి నాగ, 3. శ్రీమతి శ్రీమతి, 4. శ్రీమతి యశోద, 5. శ్రీమతి మాలతి, 6. శ్రీమతి రమ. వీరు తమ తాతను, తండ్రిని గురువులుగా భావించి సేవించారు. ఆశ్రమంలో ఏకార్యక్రమం జరిగినా తమవంతు సేవజేస్తున్నారు.

శర్మగారికి నలుగురు కుమారులు. 1. సత్యనారాయణశర్మ, 2. వేణుగోపాల శర్మ, 3. విఠలశర్మ, 4. రసరాజుశర్మ. వీరిలో రెండవకుమారుని తండ్రి ఆజ్ఞమేరకు పక్కగ్రామంలోని తమ పినతండ్రికి దత్తత ఇచ్చారు.

మిగిలిన ముగ్గురు అబ్బాయిలు ఆశ్రమం బాగోగులు చూస్తున్నారు. వీరు కూడ తాత, తండ్రుల పద్ధతి ననుసరించి ఆశ్రమాన్ని నిర్వహిస్తున్నారు.

అల్లుళ్ల కూడా ఆశ్రమ నిర్వహణకు తగిన ఆర్థిక, హార్ధిక సహాయాన్ని అందిస్తూ నిరంతరం కృషిచేస్తున్నారు. ఇందులో రెండవ అల్లుడు శ్రీ వెంకటరామశర్మగారు. మామగారి రచనలను వెలుగులోకి తీసుకురావడానికి తగిన శ్రద్ధ తీసుకొని రచనలన్నింటిని సేకరించి ముద్రించారు.

కోడళ్ళు ఆశ్రమానికి వచ్చినవారికి విసుగులేకుండా వండి వడ్డిస్తున్నారు. మామగారు చెప్పిన పద్ధతి ప్రకారం నిరంతరం రామనామజపం చేస్తూ వంటచేయాలని, ఆత్మీయంగా అందరికి భోజనం అందించాలనే వారి మాటలను మరవకుండా పాటిస్తూ, ఆశ్రమ నిర్వహణలో తమవంతు కృషిచేస్తున్నారు.

శర్మగారి మనవలు, మనవరాళ్ళు దాదాపు 40మంది వరకు ఉంటారు. వారు ఆధునిక పద్ధతుల్లో జీవిస్తున్నా తాతగారిని అనుసరిస్తున్నారు.

తాతగారు చెప్పిన మంచిమాటలు, చేసిన స్తోత్రాలు, శతకాలు, కీర్తనలు, మంగళ హారతులు, భజనలు, జపం సదా మననం చేసుకుంటూ ఉంటామని చెప్పారు.

ఉత్సవాలలో అందరు కలిసికట్టుగా శ్రమించడం, పూజాకార్యక్రమాలకుతగిన సంభారాలు సమకూర్చడం, మంగళహారతులు పాడడం మొదలైనవన్నీ వారు భక్తితో నేటికీ నిర్వ హిస్తున్నారు.

ఈవిధమైన సుగుణాలతో జీవితాన్ని ఆనందంగా ఎలాంటి ఇబ్బందులు లేకుండా గడుపుతున్నారు.

ఆశ్రమంలో ఎవరిని పలకరించినా శర్మగారి మంచితనాన్ని గూర్చి ఏకరువు పెడతారు. వారి కుటుంబానికి శర్మగారు ఇలవేల్పులాంటివారు.

ఈమధ్యకాలంలో జరిగిన మనవడు, మనవరాలి పెళ్లిలో శర్మగారి ఫోటో పూజించిగాని వివాహం మొదలుపెట్టలేదు. దీనిబట్టి వారికి శర్మగారిపైగల గౌరవం ఎలాంటిదో మనం గ్రహించవచ్చు.

## జ్ఞాపికలు


1. శ్రీ యతివర భావానందస్వామి (జీవితచరిత్రము) : రఘురామశాస్త్రి, గౌరీభట్ల, పుట. 106
2. శ్రీ యతివర భావానందస్వామి (జీవితచరిత్రము) : రఘురామశాస్త్రి, గౌరీభట్ల, పుట. 108.
3. విశ్వకవి : డా. అమరేంద్ర

# 2. సకల సద్గుణభరితం - శ్రీ శర్మగారి వ్యక్తిత్వం

**1శ్లో॥ "అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్॥**

**2శ్లో॥ అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునమ్।**
**దయాభూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్॥**

**3శ్లో॥ తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహోనాతిమానితా।**
**భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత॥[1]"**

'భయం లేకుండటం, సత్వశుద్ధి, జ్ఞానయోగ నిష్ఠ, దానం, దమం, యజ్ఞం, స్వాధ్యాయం, తపస్సు, ఋజుత్వం, అహింస, సత్యం, కోపం లేకుండటం, త్యాగం, శాంతి, చాడీలు చెప్పకుండటం, భూతదయ, విషయలోలత్వం లేకుండటం, మృదుత్వం, సిగ్గు, చపలత్వం లేకుండటం, తేజస్సు, ఓర్పు, ధైర్యం, శుభ్రత, ద్రోహబుద్ధి లేకుండటం, గర్వంలేకుండటం' అనేవి సుగుణాలు. ఇవి దైవసంపద కలవారిలో ఉంటాయి అని భగవద్గీతలో భగవానుడు వివరించాడు.

ఈ సుగుణాలన్నీ ఉన్నవాడు స్వయంగా దేవుడే అవుతాడు. వీటిలో ఏ ఒకటి, రెండు గుణాలున్నా అతడు ఉత్తముడనిపించుకుంటాడు.

పై గుణాలలో కొన్ని పుట్టుకతోనే శర్మగారిలో అంకురించాయి. తమ జీవన యానంలో మరికొన్ని సద్గుణాలను అలవరుచుకొని ఉత్తమోత్తముడనిపించుకున్నారు శర్మగారు. ఆయన సుగుణపరంపరను స్థూలంగా పరిశీలిద్దాం.

**అ). నిత్య తృప్తుడు :** "తృప్తిం జెందని మనుజుడు సప్తద్వీపములనైన చక్కంబడునే'[2] అనే వాక్యంలో తృప్తియొక్క ప్రాధాన్యం వివరించాడు పోతనమహాకవి. మానవుడు లభించినదానితో సంతోషంగా జీవితం గడపడమే తృప్తి. తృప్తిగల మనిషికి ఇదిలేదు, అది లేదనే బాధ ఉండదు.

విశ్వనాథశర్మగారు 'తృప్తి'తో జీవితం సాగించారు. అరణ్యంలో తమకు

లభించిన ఆదాయంతో తృప్తిగా ఆశ్రమాన్ని నడుపుతూ నిత్యతృప్తునిగా జీవించారు. "లభించిన వస్తువును భగవత్ప్రసాదముగా భావించుము"[3] అని బోధించడమే కాక ఆయనా అలాగే భావించారు. అందుకే ఆయన తృప్తిమంతుడు.

**ఆ). నిర్భయస్థుడు :** భయం లేకుండా ఉండడం ఆధ్యాత్మిక జ్ఞానం కలవారి లక్షణం. శర్మగారు ఎప్పుడూ దేనికీ భయపడలేదు.

రజాకార్ల దురంతాలు సాగుతున్న సమయంలో ఒకరోజు ఎనమిది మంది రజాకార్లు ఒంటరిగా వస్తున్న శర్మగారిని చుట్టుముట్టారు. తుపాకులతో కాలుస్తామని బెదిరించారు. 'మీకు ధైర్యముంటే కాల్చండి' అని శర్మగారు గర్జించారు. వారు ఈయన గుండెధైర్యాన్ని చూసి ఆశ్చర్యపడి, 'మీరు వెళ్లండి' అంటూ వెళ్ళిపోయారు. ధైర్యంగల శర్మగారిని నమ్మి ప్రజలు అరణ్యాన్ని (ఆశ్రమం) కూడా అయోధ్యలాగా భావించారు.

**ఇ). సత్యవాక్కు :** "సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాన్న - బ్రూయాత్సత్యమప్రియమ్

ప్రియంచ నానృతం బ్రూయా దేష ధర్మస్సనాతనః[4]

"సత్యం వద, ధర్మంచర"[5] అని మనకు వేదాలు, ఉపనిషత్తులు చెబుతున్నాయి. సత్యవాక్పాలన ఎంత కష్టమో, హరిశ్చంద్ర కథ మనకు తెలుపుతుంది.

విశ్వనాథశర్మగారు ఎప్పుడూ అసత్యం పలికి ఎరుగరు. ఏ సందర్భంలోనైనా ఆయన చెప్పబోయే నిజం ఎదుటివారికి బాధ కలిగించేదైతే మౌనంగా ఉండేవారు. అంతేగాని అబద్ధం ఆడేవారుకాదు.

1992 సెప్టెంబర్ 11వ తేదీన ఆశ్రమంలో దొంగలు పడ్డారు. అందరిని బెదిరించి కొంత డబ్బు, బంగారం లాగుకున్నారు. 'శర్మగారి దగ్గరికి వచ్చి బ్యాగులో ఏమున్నాయి? అని ప్రశ్నించారు. శర్మగారు రూపాయలు ఉన్నాయని సమాధానమిచ్చారు. ఆ దొంగలు డబ్బు అడగలేదు, తీసుకోనూలేదు. శర్మగారు అలానే కూర్చుని ఉన్నారు. వారు వెళ్ళి పోయారు. ఈ సంఘటన ఆయన 'సత్యవాక్కు' అనే విషయాన్ని తెలుపుతుంది.

"వీలయినంత తక్కువగా మాట్లాడాలి. మాట్లాడితే సత్యాన్నే మాట్లాడు. నీ

ఆలోచనలను సద్గుణాలపైనే ఉంచు. అప్పుడు నీవు ఏదనుకుంటే అదే అవుతుంది."[6] అంటారు శర్మగారు.

**ఈ). నిస్స్వార్థపరుడు :** 'నాది', 'నాకోసం' అనే భావం లేకుండా ఉండడమే నిస్స్వార్థం. నిస్స్వార్థబుద్ధితో ఆశ్రమాన్ని నడిపారు శర్మగారు.

చిన్ననాటి నుండి 'ఇది నాకు కావాలి' అనిగాని, 'ఇది నాది' అనే భావంగాని ఆయనకు లేదు.

భోజనాదుల సమయంలో వచ్చిన అతిథి (అభ్యాగతి) ఏది తింటున్నాడో, ఆయనా అదే తినేవారు. తనకోసం ఎవరైనా ప్రత్యేకంగా ఏదైనా పెట్టినా ఇష్టపడే వారుకాదు. తన వారుకూడా స్వార్థబుద్ధితో ఉంటే వారిని మందలించేవారు.

శర్మగారి తండ్రి – నిరాధారులు, బీదవారైన బ్రాహ్మణులకు కుటుంబ పోషణార్థం భూములను, పౌరోహిత్య గ్రామాలను దానం చేసేవారు. సంతోషంగా శర్మగారు కూడా ఆ పుణ్య కార్యంలో పాలుపంచుకొనేవారేకాని తన తండ్రి ఆస్తి తనకు కాకుండా పోతుందని ఎప్పుడూ భావించలేదు.

**ఉ). దాత :** ఎవ్వరేది అడిగినా లేదనకుండా, కాదనకుండా ఇచ్చేవారు. దీనికి ఆశ్రమంలో జరుగుతున్న అనేక కార్యక్రమాలే దృష్టాంతం. నిస్స్వార్థపరుడైన శర్మగారికి దానగుణం జన్మతో వచ్చింది. తన దగ్గరున్న ఏవస్తువైనా అందరికీ ఉపయోగపడాలి అనేది ఆయన జీవిత ధ్యేయం.

"సృష్టిలోగల ప్రతి వస్తువు విలువైనదే. ఎంత చిన్న వస్తువైనా సరే. అవసరము వచ్చినప్పుడే దాని విలువ తెలుస్తుంది. నీకు అవసరము లేని వస్తువును అలక్ష్యము చేయవద్దు. అది మరొకరికి ఉపయోగపడుతుందని మరచిపోవద్దు"[7] అనేది శర్మగారి మాట.

యజ్ఞయాగాదులు చేయించి బ్రాహ్మణులకు తృప్తిగా దానాలు చేశారు. అదే సమయంలో చుట్టుప్రక్కల గ్రామప్రజలకు అన్నదానంతో తృప్తిపరచేవారు.

ప్రతి సంవత్సరం 'గోదానం' చేసేవారు. ఆయన 74 సంవత్సరాలు జీవిస్తే 74 గోవులను దానంచేశారు.

పేద ప్రజలు నివసించటానికి కొంత స్థలాన్ని వారికి దానంగా ఇచ్చారు.

రానురాను అది 'భావానందపుర'మనే పేర ఒక చిన్న గ్రామంగా ఏర్పడింది.

**ఊ). భూతదయాపరుడు :** ఎండాకాలంలో తన ప్రాంగణంలో నీటిని అందు బాటులో ఉంచేవారు. పక్షులకు, జంతువులకు కూడా తొట్లలో నీళ్ళుపెట్టి ఉంచేవారు. పక్షులకు గింజలను కూడ వేసేవారు.

'ప్రతి హృదయం దైవస్వరూపం, భగవంతునికి నివేదన ఎంత ముఖ్యమో, అంతకన్న ప్రతిప్రాణికి భోజనం పెట్టడం అంతే ముఖ్యం' అని శర్మగారి భావన. దీనివల్ల ఆయనకున్న భూతదయ వ్యక్తమవుతుంది.

**ఋ). అహింసామూర్తి :** "అహింసా పరమోధర్మః"[8] ధర్మాలలో పరమ ధర్మం అహింస. తెలిసికాని, తెలియకకాని చీమకు కూడా కీడు చేయరాదనేది శర్మగారి సిద్ధాంతం.

విషసర్పాలు ఆశ్రమప్రాంతంలో నిత్యం దర్శనమిచ్చేవి. వాటిని ఏమాత్రం హింసించ కుండా పెద్ద చెక్క పట్టుకారుతో పట్టుకుని వాటి స్థావరమైన పుట్టలో వదలి వచ్చేవారు.

**ౠ). సహనశీలి :** వ్యక్తి అభిప్రాయాలు నచ్చనట్లైతే ఎదురుపడి వాదించడంకంటే మౌనంగా ఉండడం మేలని సలహా ఇచ్చేవారు. వారూ సహనాన్ని పాటించేవారు.

"ప్రతి వ్యక్తి యందు మంచి చెడులుండును. మనకవసరమయ్యే మంచినే గ్రహించి చెడును గురించి తలంపు చేయకుండుటయే ఉత్తమ వ్యక్తిత్వము"[9] అని ఆయన చెప్పారు. ఇంతటి సహనం ఉన్నందువల్లనే అంతా ఆయనను గౌరవించారు.

**). శాంతిదూత :** ఆశ్రమాన్ని 'శాంతి నిలయం'గా మార్చడానికి ఆయన తగినంత శ్రమించారు. ఎందరి హృదయాలలోనో అశాంతి, అలజడిని తొలగించి 'శాంతిదూత'గా నిలిచారు. పౌరుల రాజకీయ కలహాలను, కుటుంబ కలహాలను తీర్చి వారికి చిత్తశాంతి కలిగించేవారు. ఆయనది శాంత స్వభావం కాబట్టి ఎదుటివారిని శాంతపరచగలిగేవారు.

**). ఉత్తమ అధ్యేత :** కాలం విలువ శర్మగారు బాగా గుర్తించారు. క్షణకాలం కూడా ఆయన వృధాచేయక జ్ఞానసముపార్జన కోసం ప్రయత్నించారు. ఆ

ప్రయత్నంలోని భాగమే పుస్తకపఠనం. తీరిక సమయాలలో మంచి పుస్తకాలు చదివేవారు. శర్మగారు ఎక్కువగా హిందీ "కల్యాణ్ పత్రిక"[10]లను చదివేవారు.

వేదాంత గ్రంథాలు, మనుస్మృతి, ఉపనిషత్తులు, అధ్యాత్మ రామాయణం, వాల్మీకి రామాయణం, శ్రీమద్ భాగవతం, శ్రీమదాంధ్ర భాగవతం, భగవద్గీత, తెలుగులో వచ్చిన రామాయణాలు, పురాణాలు, భక్తుల చరిత్రలు మొదలైన గ్రంథాలెన్నో చదివారు.

ఇవేగాక అప్పకవీయం, ఛందస్సు, అలంకారాలకు సంబంధించిన గ్రంథాలు, నిఘంటువులు కూడా అధ్యయనం చేశారు.

ఆయన గ్రంథాలయంలో సహస్రాధిక గ్రంథాలున్నాయి. తాను చదివిన గ్రంథాలన్నింటికి పుటలు (కవర్) వేసి, సంఖ్యలు వ్రాసి ఒక పద్ధతిగా అమర్చి పెద్ద పెద్ద బీరువాలలో భద్రపరచారు. వాటన్నింటిని గూర్చి ఒక కేటలాగు కూడా తయారు చేశారు.

**ఎ). సూక్ష్మగ్రాహి :** కళల విషయంలో సూక్ష్మాతి సూక్ష్మ విషయాలను ఇట్టే పసిగట్టగల నిష్ణాతులు శర్మగారు. సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం, నాట్యాల లోని లోతుపాతులను తెలిసిన ప్రజ్ఞాశాలి. వాస్తుబద్ధంగా గృహాలయ నిర్మాణానుకూల పథకాలను రూపకల్పన చేశారు.

సప్తతాళాలతో కూడిన తాళమాలిక. 5 రాగాలతో కూడిన రాగమాలికలు రచించారు. చిత్ర, బంధ కవిత్వాలలోని మెళకువలు గ్రహించారు. కవిత్వంలోని లోతుపాతులను, సూక్ష్మాలను గ్రహించి చక్కటి స్తోత్రాలను, శతకాలను తెలుగు లోను, సంస్కృతంలోను చక్కగా రచించారు.

ఒకరోజు శర్మగారి నాన్నగారు

**శ్లో॥ "వరమిమ ముపదేశమాద్రియధ్వం**
**నిగమ వనేషు నితాంత చారఖిన్నాః**
**విచినుత భవనేషు వల్లవీనాం**
**ఉపనిషదర్థములూఖలే నిబద్ధమ్"[11]**

అనే భాగవతశ్లోక భావాన్ని పాటగా వ్రాయమన్నారు.

వెంటనే శర్మగారు

**"వేదాటవిలో - వెదకెదవేల - వెదకి వెదకి వేసారు బుధులార**
**వినుడీ శ్వేతల యిళ్ళకు జనుడీ - వెదకిన యచ్చుటి వీధులే వెదకండి**
**ఘన యశోద శ్రీకృష్ణ రూపమును కట్టి వైచెరోటన్ చిద్ఘనమును."**

అని చక్కగా రచించారు. ఇది విన్న ఆయన తండ్రి అమితానందం పొందారు. అని త్రిగుళ్ళ ప్రభాకరశర్మగారు వివరించారు.

పై విషయాలు ఆధారంగా శర్మగారు 'సూక్ష్మగ్రాహి' అని ఘంటాపథంగా చెప్పవచ్చు.

**ఏ). పరోపకారి :** శర్మగారు చిన్న చిన్న చిట్కాలను, ఆధి, వ్యాధి పీడితులైన అస్వస్థులకు వివరించేవారు. వారు వాటినుపయోగించి ఆరోగ్యవంతులయ్యేవారు.

ఆయన భగవంతునిపై భారంవేసి అనారోగ్య పీడితులకు దైవ తీర్థాన్ని ఇచ్చేవారు. అలా తీర్థం ఇవ్వటం వల్లనే పాముకాటుకు గురైన ఒక వ్యక్తి తాను బ్రతికానని చల్లూరు గ్రామనివాసియైన నరసింహారెడ్డిగారు వివరించారు. ప్రజల నుండి ఏమి ఆశించకుండా వారికి శర్మగారు ఇలాంటి ఉపకారాలు అనేకం చేసేవారు. భోజనం పెట్టడం, స్థలాలివ్వడం సరేసరి.

ఇలాంటి సంఘటనలు జరిగాయని ఆశ్రమవాసులు, అనుభవజ్ఞులు ప్రత్యక్ష సాక్షులు చెబుతుంటారు.

**ఐ). సమాజ సేవకుడు :** "సమాజాన్ని గూర్చి పట్టించుకోని వ్యక్తి సమాజానికి సేవచేయని వ్యక్తి ఎన్ని పూజలు, పుణ్యాలు చేసినా వృథా"[12] అని శర్మగారి భావన.

పండితులు, జ్ఞానులు అయినవారు సంఘంలోని దురాచారాలను అజ్ఞానాన్ని తొలగించడానికి ప్రయత్నిస్తారు. విశ్వనాథశర్మగారు సమాజాభ్యున్నతికి తన మాటలనే మంత్రాలుగా ఉపయోగించారు. వాటిద్వారా సామాజికుల అజ్ఞానాన్ని, దురాచారాలను తొలగించారు. మానవులలోని హృదయ దౌర్బల్యం, ఆత్మన్యూనతా భావం తొలగించడానికి శతథా ప్రయత్నించారు.

శర్మగారు బాధపడే ప్రజలను ఓదార్చి, కష్టాలను ఎదుర్కొనే ధైర్యాన్ని నూరిపోసేవారు.

వారికి 'విశ్వన్న' దగ్గరికి వెళితే మా బాధలు ఇట్టే పోతాయి అనే విశ్వాసం కుదిరింది.

మానసికంగా మరీ బలహీనంగా ఉన్నవారిని ఆశ్రమంలోనే ఉండి స్వామిని అర్చిస్తూ, భజన చేయమని చెప్పేవారు. వారు అలా ఉండగా వారికి మంచి మాటలు చెప్పి వారి ఆలోచనా దృక్పథాన్ని మార్చేవారు. దానితో వారు అభద్రతా భావాన్ని పోగొట్టుకొని నూతనోత్సాహం పొంది వెళ్ళేవారు.

గ్రామాల్లోని వారందరినీ ఒకే తాటిమీదకు తీసుకురావాలని, వారిలోని భేద భావాలు పోగొట్టాలని భావించి 'రుద్రపరిషత్' ఏర్పాటుజేసి, దానిద్వారా ఊరూరా రుద్రాభిషేకం చేయించారు. ప్రజలంతా సాత్త్విక భావాలు పెంపొందించుకోవాలనే భావనను ఆశ్రమం చుట్టుప్రక్కల గ్రామాలన్నింటిలోనూ ప్రచారం చేశారు.

వ్యక్తి, సంఘం బలంగా ఉండడానికి తగిన కృషి చేశారు. మానవసేవనే మాధవసేవగా భావించి ఆచరించిన ధన్యజీవి శర్మగారు.

నేటికీ ఈ ప్రాంత ప్రజలు శర్మగారి రచనలను చదువుతూ, భగవంతుని స్తుతిస్తూ ఆయన మంచి మాటలను మననంచేస్తూ, దానధర్మాలను ఆచరిస్తూ దైనందిన జీవితాన్ని సుఖమయంగా గడుపుతున్నారు.

హరినామ సంకీర్తన, అన్నదానం జరిగేచోట రాళ్ళవర్షం కురవకపోవడం, క్షామం ఏర్పడ్డప్పుడు శర్మగారు రచించిన "ఆవేదన" (27 పద్యాలు) అనే గంగా స్తుతిని ఆశ్రమ వాసులచే పఠింపజేయడం వల్ల వర్షాలు కురిసి క్షామం తొలగి పోవడం లాంటి సంఘటన లనేకం జరిగాయని ప్రత్యక్షసాక్షులు చెప్పడం శర్మగారి సంకల్పబలాన్ని, ప్రజలకు ఆయనపైగల విశ్వాసాన్ని విశదపరుస్తున్నాయి.

**ఒ). పితృభక్తి పరాయణుడు :** తండ్రి ఆజ్ఞను శర్మగారు పాటించడమే కాదు, నిరంతరం తండ్రికి కష్టం కలగకుండా సేవచేశారు.

శారీరక అనారోగ్యంతో బాధపడుతున్న తండ్రికి అనేక సౌకర్యాలు కలిగించి, ఎలాంటి శ్రమ కలుగకుండా చూస్తూనే, తండ్రికి పురాణాలు, వేదాంత గ్రంథాలు చదివి వినిపించేవారు. ఏదైనా సమస్య వస్తే తండ్రి బాధపడతారని ఆయనకు తెలియకుండా జాగ్రత్తపడేవారు.

ఆయన తల్లి సహనమూర్తి. ఆమెకు ఉబ్బసవ్యాధి ఉండేది. తల్లిని కంటిపాపలా కాపాడుకున్నారు శర్మగారు. కాని ఆమె 1953లోనే మరణించింది.

తండ్రిని గురువుగా భావించేవారు. ఉదయాన్నే లేస్తూ

**"శ్రీకృష్ణాద్వైత సిద్ధాన్త స్థాపినం యతిశేఖరం**
**భావనా బల సంపన్నం భావానంద గురుంభజే"**

అనే శ్లోకం చదువుతూ తండ్రికి నమస్కరించేవారు. 'ఒకనాడు తండ్రి శర్మగారి తలపైన చేయిపెట్టి ఒక అనిర్వచనీయ ఆనందానుభూతిని కలిగించారు' అని శర్మగారి కుమారుడు అప్పాల సత్యనారాయణశర్మగారు వివరించారు. నాటినుండి శర్మగారు కృష్ణభక్తి సామ్రాజ్యానికి యువరాజైనారు. తండ్రిలోనే పాండురంగని, కృష్ణుని, శివుని దర్శించగలిగారు.

భావానందస్వామి వారి శతజయంత్యుత్సవాలను (21.10.1999 నుండి 27.10.1999 వరకు) శర్మగారు వారంరోజులు ఘనంగా నిర్వహించారు. 'భావానందం' అనే శతజయంతి ఉత్సవ ప్రత్యేక సంచికనూ వెలువరించారు.

స్వామివారి మరణానంతరం సమాధిని స్వయంగా శర్మగారే స్వహస్తాలతో నిర్మించారు. అంతటి పితృభక్తి పరాయణులు శర్మగారు.

**ఓ). నియమబద్ధ జీవనుడు :** శర్మగారు ఉదయం నాలుగుగంటలకే మేల్కొనేవారు. కాలకృత్యాదులు తీర్చుకుని 90 నిమిషాలు ధ్యానం చేసేవారు. తరువాత స్నానంచేసి పూజా కార్యక్రమాలు నిర్వహించేవారు. 9 గంటలకు వంటగది వైపు వెళ్ళి స్వామి నివేదన కోసం, అందరికోసం చేసే వంటకోసం ఏర్పాటుచూసి, కూరగాయలు చక్కగా తరిగి పెట్టేవారు.

మధ్యాహ్నం 12గంటలకు భగవన్నివేదనానంతరం భోజనాదికాలు ముగించుకొని, భుక్తాయాసం తీర్చుకుంటూనే గ్రంథపఠనంగాని, తండ్రిగారు చెప్పే వేదాంత ప్రవచన శ్రవణం గాని చేసేవారు.

సాయంత్రం నాలుగుగంటలకు వెళ్ళి పొలంపనులు చేసేవారు. దాదాపు 7గంటలకు తిరిగివచ్చి స్నానం చేసి మందిరంలో భజన, పూజాదికాలు ముగించు కొని రాత్రి 9గంటలకు విశ్రాంతి తీసుకొనేవారు. ఈవిధంగా 18 ఏళ్ళ వయసు వచ్చినప్పటి నుండి 40 ఏళ్ళ వయసు వచ్చే వరకూ జీవితాన్ని గడిపారు.

40 ఏళ్ళు దాటిన దాదిగా భోజనం మానుకుని కేవలం మూడు పిడికిళ్ళ అటుకులు మాత్రమే తడిపి తినేవారు. అయినా ఆయన కార్యక్రమాల్లో మార్పులేదు. కాని పొలంపనులు మాత్రం చేయడంమాని, కేవలం పర్యవేక్షించే వారు. పని భారం కొంత తగ్గించుకొని, పిల్లలకు అప్పగించారు.

ఆ సమయంలో సాహిత్య కృషి ప్రారంభించారు. 50 ఏళ్ళు పైబడిన తర్వాత సాయంత్రం వేళల్లో ఎవరైనా వస్తే పలకరించి, వారి సందేహాలు తీర్చేవారు. మనవలు, మనవరాళ్ళకు సంగీతం, హారతులు బోధించేవారు.

శరీరం ఎంతవరకు సహకరిస్తే అంతవరకు ఏదో ఒకపని చేస్తూనే ఉండేవారు. మనస్సు మాత్రం నిరంతరం దైవధ్యానంలో ఉండేది. ఇలా ఆయన నియమబద్ధమైన గార్హస్థ్య జీవితాన్ని గడిపారు.

**ఔ). భక్తవత్సలుడు :** భావానందస్వామి శిష్యుడు 'ఈశ్వరుడు' అనేపేరుగల వైశ్యుడు. శర్మగారికి అన్నిపనులలో చేదోడు, వాదోడుగా ఉండేవాడు. ఆ ఈశ్వరుడు మరణించగా శర్మగారు తండ్రి ఆజ్ఞతో తల్లి సమాధి పక్కనే అతని సమాధిని నిర్మింప జేశారు. ఆ వైశ్యుడు భక్తుడు, జ్ఞాని, వేదాంతి కావడంవల్ల అతనిని తల్లిదండ్రులతో సమానంగా భావించారు శర్మగారు. ఆయన భక్తవాత్సల్యం అలాంటిది.

**అం). భగవత్సాయుజ్యం పొందినవారు :** శర్మగారికి 65 సంవత్సరాలు వచ్చే వరకు ఎలాంటి అనారోగ్యమూలేదు. 65 సంవత్సరాల తరువాత మధుమేహం, రక్తపోటు ఆయన దేహాన్ని ఆశ్రయించాయి. గుండెజబ్బు నేనున్నానంది.

ఆ బాధతో పడుకోవడం కష్టంగా వుండడంవల్ల ఎప్పుడూ పడకకుర్చీలో కూర్చొని భగవన్నామ స్మరణంచేస్తూ అందరిని పలకరిస్తూ ఉండేవారు.

విక్రమనామ సంవత్సర ఆశ్వయుజ మాసం కృష్ణపక్షంలో వ్యాధి తీవ్రతరమై పట్టణంలోని ఆసుపత్రికి చికిత్సకోసం తీసుకువచ్చారు.

చివరికి విక్రమనామసంవత్సర కార్తీక పౌర్ణమినాడు బ్రాహ్మీ ముహూర్తంలో ఆసుపత్రి నుండి మరల ఆశ్రమానికి తీసుకువచ్చిన తరువాత సూర్యుడు ఉదయిస్తుం డగా ఆయన 10.11.2000 సం॥లో అస్తమించారు. ఆయన ప్రాణాలు అనంత వాయువులలో లీనమయ్యాయి. అనంత భక్తజన సందోహం శోకసాగరంలో మునిగిపోయింది.

అః). **మహాత్ముడైన మనీషి 'విశ్వన్న' :** జిజ్ఞాసువుకు జ్ఞానదృష్టిని కలిగించి అంతటా వ్యాపించిన పరమాత్మ స్వరూపాన్ని దర్శింపచేసేవాడే సద్గురువు. అలాంటి గురువు సాక్షాత్తు దైవస్వరూపుడే. అలాంటి గురువు దగ్గర శ్రద్ధ, వినయం, విధేయత కలిగి శిష్యుడు మిక్కిలి బుద్ధికుశలతతో ఆత్మజ్ఞానాన్ని గ్రహించాలి. ఆత్మజ్ఞానం (సూపర్‌లేటివ్ పవర్) ధనంవల్ల, గ్రంథాలవల్ల లభించేది కాదు. పరిపక్వ హృదయంతో సద్గురు ఉపదేశం పొందడంవల్ల, త్రికరణశుద్ధితో గురువాజ్ఞను పాలించడంవల్ల మాత్రమే ఆత్మజ్ఞానం కలుగుతుంది.

ఆత్మజ్ఞానాన్ని పొందినవారికే శాశ్వతమైన పరమానందానుభూతి సిద్ధిస్తుంది. అలాంటి ఆత్మజ్ఞానం అందించటానికి తండ్రే సద్గురువై విశ్వనాథశర్మగారికి చక్కటి మార్గదర్శనం చేశారు. తండ్రి బోధవల్ల భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు శర్మగారికి దృఢంగా అలవడ్డాయి.

'పనులు చేయడం కర్మ, సంస్మరించడం భక్తి, ద్వేషం లేకుండా అందరిని సమానంగా చూడడం జ్ఞానం. నిష్కామ కర్మద్వారా భక్తి, భక్తి ద్వారా జ్ఞానం కలుగుతుంది. కర్మ, భక్తి, జ్ఞాన సమన్వయ సారమే గీతాసందేశం.'

భగవంతుని చేరడానికి సగుణోపాసన, నిర్గుణోపాసన అనే రెండు మార్గాలున్నాయి. కాని చంచలమైన మనసుకు ఒక ఆధారం కావాలి. ఏదో ఒక రూపాన్ని భావిస్తూ, ధ్యానిస్తూ ప్రయత్నిస్తే మనసు నిలకడగా, నిలిచే అవకాశం ఉంది. 'విగ్రహం నిగ్రహం కొరకే' అందువల్ల సగుణోపాసన సర్వసామాన్య జనులకు సులభ సాధ్యమైనది.

సగుణోపాసన చేసేవారు విగ్రహారాధనతోపాటు 'నామస్మరణం' కాని మంత్రజపాన్నిగాని చేస్తారు.

**శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే**
**అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధిసాత్త్వికమ్.**[13]

జ్ఞాని అయిన మానవుడు స్థావరజంగమాత్మకమైన ఈ సమస్త ప్రపంచం ఆత్మతత్త్వమే తప్ప వేరుకాదని తలుస్తాడు.

దీనినే "ఋతంభరా తత్ర ప్రజ్ఞా"[14] అనే సూత్రంలో పతంజలి మహర్షి,

నిర్బీజ సమాధిలో కలిగే ప్రజ్ఞ 'ఋతంభరా' అని వర్ణించారు. 'ఋతం'చే నిండినది అని అర్థం. 'ఋతం' అంటే విశ్వజనీనమైన ధర్మమే (యూనివర్సల్ లా). ఇది తెలిసిన జ్ఞానులను పరిశీలిస్తే ఈ మూడు లక్షణాలు గోచరమవుతాయి.

1. "సర్వ భూత హితే రతాః" "మహాత్ములు సమస్త జీవుల మంచిని కోరతారు. అందరూ బాగుపడాలని ఆశిస్తారు. వారు చేసే పనులు అందరికీ హితకరంగా పరిణమిస్తాయి.
2. వారి సాన్నిధ్యంలో అంటే ఆత్మజ్ఞాని సాన్నిధ్యంలో ఇతరులకు కూడా శాంతి కలుగుతుంది.
3. వీరి సమక్షంలో మన ఆలోచనావిధానము సరళము, ప్రేమ పూర్వకము, భక్తి భావ సమన్వితం అవుతుంది. తాను పొందిన దివ్యానుభూతిని పదిమందికి ఉపయోగపడేలా చేసేవారే మహాత్ములు."[15]

ఈ కోవకు చెందినవారే మహాత్మ శ్రీ విశ్వనాథశర్మగారు. ఆయన నడవడి, చెప్పిన సూక్తులు, పాటించిన నియమాలు, రచనలు వీటన్నింటిని గమనిస్తే ఈ విషయం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

సద్గుణ సంపత్తి కలవారు కాబట్టే ప్రతిపత్రికలోను ఆయన పేరు వేయవలసి వచ్చినపుడు "మహాత్మ శ్రీ అప్పాల విశ్వనాథశర్మగారు" అని ముద్రించేవారు పత్రికా నిర్వాహకులు.

ఎంత కృషి చేసినా సమకాలంవారు మెచ్చుకోవడం అరుదు. శర్మగారు సమకాలీనుల ప్రశంసలకు పాత్రులై వారిచే నిర్ద్వంద్వంగా గౌరవించబడ్డారు.

సమదృష్టి, దయ, సహనం అనే గుణాలు కలవారే మహాత్ములు. ఈ మూడు గుణాలు ఆయనలో అణువణువునా కనిపిస్తాయి. అందుకే ఆయన 'మహాత్మ'గా సంబోధింపబడ్డారు.

# జ్ఞాపికలు

1. శ్రీమద్భగవద్గీత : దైవాసుర సంపద్విభాగ యోగము శ్లో. 1,2,3, పుట. 189

2. శ్రీమదాంధ్రభాగవతం : పోతన, బమ్మెర, అష్టమస్కంధం పద్యం 573, పుట. 61

3. దినచర్య (అముద్రితం) : విశ్వనాథశర్మ, అప్పాల

4. మనుధర్మ శాస్త్రము : నాలుగవ అధ్యాయం శ్లో. 138, పుట. 200

5. ఉపనిషద్దర్శనము : తైత్తిరీయోపనిషత్తు, శ్రీనాథ వేంకట సోమయాజులు, నోరి. శీక్షావలీ (మొదటిభాగము) అనువాకం - 11, పుట 24.

6. దినచర్య (అముద్రితం) : విశ్వనాథశర్మ, అప్పాల

7. దినచర్య (అముద్రితం) : విశ్వనాథశర్మ, అప్పాల

8. ఋషిపీఠం మాసపత్రిక : సర్వధర్మాల సారం - మహాభారతం (వ్యాసం), అక్టోబర్ 2001 - డా॥ వెంకటశాస్త్రి, గోడా. పుట. 24

9. దినచర్య (అముద్రితం) : విశ్వనాథశర్మ, అప్పాల

10. కల్యాణ్ పత్రిక : గీతాప్రెస్, గోరఖ్‌పూర్ నుండి వెలువడే మాసపత్రిక

11. శ్రీ కృష్ణకర్ణామృతమ్ : బిల్వమంగళ - రెండవ ఆశ్వాసము, శ్లో. 28, పుట. 26

12. దినచర్య (అముద్రితం) : విశ్వనాథశర్మ, అప్పాల

13. శ్రీమద్భగవద్గీత : మోక్షసన్న్యాస యోగము, శ్లో. 20, పుట. 205

14. శ్రీ పాతంజల యోగదర్శనము : పతంజలి. సమాధిపాదః, సూత్రం -48, పుట. 11.

15. జీవిత పరమార్థము - వేదాంత శాస్త్రము : నాగమణి కొండూరు, చతుర్థ అధ్యాయము, పుట. 247, 248

# 3. శ్రీ పాండురంగాశ్రమ విశిష్టత - పితాపుత్రుల వరివస్య

## 1అ). శ్రీ పాండురంగాశ్రమం - ప్రశాంతతకు నిలయం.

క్రీ.శ. 1932లో తెలంగాణాలోని మెదక్‌జిల్లా మరుకూకు గ్రామంలో వెలసిన ధార్మికసంస్థ ఈ పాండురంగాశ్రమం.

ఈ ఆశ్రమ ప్రాంతమంతా సుందర రమణీయ నందనవనం. ఎత్తైన పచ్చటి చెట్లతో పొదలతో నిండి, ప్రశాంతతను ప్రసాదించే నిర్మలమైన ప్రదేశం. మధ్యలో కనులకు పసందైన శ్రీ రుక్మిణీ పాండురంగస్వామి ఆలయం. చుట్టూరా కమనీయ మైన పవిత్ర ఆధ్యాత్మిక భావ పరంపరలను విరజిమ్మే ఆశ్రమభవనం. శృతికింపైన సన్నని తాళాల సవ్వడి, నిరంతరం ఆహ్లాదభరితంగా ప్రతిధ్వనించే భగవన్నామ స్మరణ నాదం. ప్రకృతి దృశ్యాలకు, ఆధ్యాత్మిక భావాలకు, పారమార్థిక చింతనకు, మానసిక ప్రశాంతతకు ఆటపట్టు ఈ పాండురంగాశ్రమం.

ఈ సంస్థ ప్రారంభించేనాటికి తెలంగాణా ప్రాంతం నిజాం నవాబుల నిరంకుశ (పరిపాలనా) పదఘట్టనల క్రింద నలిగిపోతూ స్వేచ్ఛలేకుండా 'బాంచెన్ కాల్మొక్తా' అంటూ మిక్కిలి దీనంగా, దినదిన గండంగా బానిస బతుకులను ఈడుస్తున్న రోజులు. అలాంటి పరిస్థితులలో ధార్మిక, ఆధ్యాత్మిక చింతనలు అడుగంటిపోయి పొట్టకూటికోసం కష్టపడడమే జీవిత పరమార్థంగా జీవిస్తున్న ప్రజానీకాన్ని వెన్నుతట్టి, మేల్కొల్పి వారి అజ్ఞానాన్ని దూరం చేయడానికి ప్రేమతో ఆధ్యాత్మిక, ధార్మిక భావాలను తనదైన శైలిలో శ్రీ భావానందస్వామి ప్రచార మొనర్చారు.

సత్యనారాయణ బాబాగారి (శ్రీ భావానందస్వామి) మంచితనానికి, పరోపకారానికి, ఉపదేశాలకు ముగ్ధులైన వారు కొందరు బాబాగారిని ఆశ్రయించి ఆశ్రమంలోనే ఉండేవారు. వారు తమ గురువును వదలక అక్కడ వారితోపాటు కందమూలాలు తింటూ జీవించేవారు.

బాబాగారి ఆలోచనా సరళినిబట్టి ఆశ్రమాన్ని అభివృద్ధి చేశారు. అందరూ

కలిసి, శ్రమించి చిన్నచిన్న కుటీరాలను తొలగించి, ఎంతమంది వచ్చినా ఉండడానికి వీలుగా పెద్ద ప్రాంగణంతో, పెద్ద వసారాలతో ఆశ్రమం నిర్మించారు.

**ఆ). భౌతిక, ఆధ్యాత్మికతల ఉన్నతికి పెన్నిధి - బాబాగారి సన్నిధి**

ధార్మిక సంస్థగా వెలసిన ఈ ఆశ్రమం నిరుపేదలకు, ఆర్తులకు, నిరాధారులకు ఆశ్రయమైంది. ఆశ్రమానికి చెందిన పొలాలను సేద్యం చేసేవారు. అక్కడ పండిన ధాన్యంతో వచ్చిన అతిథులను పరమాత్మ స్వరూపులుగా భావించి భోజనం పెట్టేవారు. అనంతరం వారి కష్టసుఖాలను గూర్చి ఆత్మీయంగా ప్రశ్నించి తెలుసుకుని, వారి సమస్యలకు తగిన తరుణోపాయాలను తెలుపుతూ, భగవన్నామం స్మరించాలని, ప్రతిశ్వాసలో ఈశ్వరునిపై విశ్వాసాన్ని కల్గి ఉండాలని, దృఢమైన సంకల్పంతో ముందుకు సాగితే భగవంతుని అనుగ్రహం మనపై ఉంటుందని బాబాగారు ప్రవచించేవారు.

ఆయన గ్రామాలలో విస్తృతంగా పర్యటించి పండితులను, పామరులను, ఆస్తికులను, నాస్తికులను అవ్యాజమైన ప్రేమతో, మృదువైన వాక్కులతో పలకరించి, వారిలో ఆధ్యాత్మిక భావబీజాలను నాటేవారు. ఇలా ధార్మిక, ఆధ్యాత్మిక భావ విప్లవాన్ని శ్రీ పాండురంగాశ్రమం కేంద్రంగా వ్యాపింపజేశారు.

ఈ ఆశ్రమం ఆప్రాంత ప్రజల దృష్టిలో ఒక వైద్యాలయం, దేవాలయం, పెళ్ళిమంటపం, ప్రశాంతి నిలయం. నిరుపేదల పిల్లల వివాహాలు జరగడానికి ఈ ఆశ్రమం చేయూత నిచ్చింది. ఇక్కడ యాభై(50)కి పైగా పెళ్ళిళ్ళు జరిగాయి.

ఆ చుట్టుపక్కల గ్రామాలలో బాబాగారి మాట వేదవాక్కు. లౌకిక విషయాల్లో కూడా ఆయన ప్రజలకు సహకరించేవారు. ప్రజల కుటుంబాల్లోని గొడవలు, ఆస్తుల తగాదాలు విని చక్కటి తీర్పులిచ్చేవారు. ఇలా ఆయన అక్కడి ప్రజల భౌతిక, ఆధ్యాత్మిక ఉన్నతికి దోహదం చేశారు.

ప్రతి సంవత్సరం ఆషాఢ శుద్ధ ఏకాదశి సమయంలో ఆషాఢ ఉత్సవాలకు దాదాపుగా నాలుగైదువేల మంది వచ్చేవారు. వారంతా అఖండనామ సంకీర్తన (మూడురోజులు) చేసేవారు. తడకలతో విశాలమైన పందిళ్ళు వేసి వాటిలో భక్తులు ఉండేవారు. అన్ని వర్ణాలవారు ఈ ఉత్సవాలకు వచ్చేవారు. ఈ మూడురోజులు ప్రజలు ఒకే కుటుంబంలా కలిసి జీవించేవారు. ఒకరికొకరు సహాయ సహకారాలు అందించుకొనేవారు. దీనివల్ల అక్కడి ప్రజలలో సంఘీభావం ఏర్పడింది.

కుల, మత, ధనిక, పేద మొదలగు భేదభావాలు మచ్చుకైనా అక్కడ కనిపించేవికావు. మానవులంతా ఒక్కటే అనే భావన ఉండేది.

ఆ భావనతో సమసమాజాన్ని నిర్మించడానికి బాబాగారు తమవంతు కృషిచేశారు. అందరిలో నిద్రాణమైన మానవత్వాన్ని, ధార్మికతను మేల్కొలిపే ప్రయత్నం చేశారు.

## ఇ). నాటి చారిత్రక సామాజిక స్థితిగతులు - ప్రజలకు ఆశ్రమం అండదండలు

భారతదేశానికి స్వాతంత్ర్యం రావడంతో దేశమంతటా స్వేచ్ఛా వాయువులు వీస్తుండటాన్ని చూసిన ఏడో నిజాం గుండె దడదడలాడిపోయి తన నైజాం రాష్ట్రాన్ని స్వతంత్ర దేశంగా, ప్రకటించుకున్నాడు. తత్ఫలితంగా లాయక్ అలీ (ఏడో నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ ప్రధానమంత్రి) సైగతో ఇత్తేహదుల్ ముస్లీమీన్ సంస్థలోని మతఛాందసులైన మ్లేచ్ఛులు ఒకవైపు, ఖాసిం రజ్వీ సిద్ధపరచిన రజాకార్లు వేరొకవైపు విజృంభించి తెలంగాణా గ్రామాలపై విరుచుకుపడి, మానవత్వాన్ని మంటగలిపి, కరడుగట్టిన రాక్షసత్వంతో విచ్చుకత్తులు ఝళిపించి, అమాయకులైన ఆడవారిని, పసిపిల్లలను, యువకులను, వృద్ధులను, వారు వీరు అనే విచక్షణ లేకుండా కుత్తుకలను కత్తిరించసాగారు. మరొకవైపు జాగీర్దారులు, దొరలు, దేశాయిలు (దేశ్‌ముఖ్‌లు) నైజాంతో కుమ్మక్కై ఆత్మాభిమానాన్ని చంపుకుని గ్రామప్రజలపై దాడులు చేయించి అరాచకాలను సృష్టించారు. వీరి ఆగడాలను మట్టుపెట్టి, తెలుగు వారికి స్వాతంత్ర్య భావాలు నూరిపోయాలనే సత్సంకల్పంతో విప్లవవీరులై కమ్యూనిస్టులు ఆయుధాలు చేబూని కదనరంగంలోకి దిగారు. రజాకార్లను, పెత్తం దార్లను మట్టికరిపించాలని, రైతులకు న్యాయం చేకూర్చాలని, ప్రజలను రక్షించా లని వీరు కూడా గ్రామాలపైకే దాడులు జరిపారు.

ఆనాడు ఒక్కొక్క రాత్రిని మహాయుగంగా, దినదిన గండంగా, ప్రాణం అరచేతిలో పట్టుకుని, బిక్కు బిక్కుమంటూ తెలంగాణాలోని ప్రతివ్యక్తి ప్రతిక్షణం గడిపాడు. ఈ పరిస్థితిని గమనించిన భావానందస్వామి ప్రజలందరికి “ఈగడ్డు కాలమును క్షేమముగా దాటిపోవుటకు భగవన్నామము ఒకటే దిక్కు”ని[1] హెచ్చరిక చేశారు. దాన్ని నిజమని విశ్వసించి తమను తాము రక్షించుకోవడానికి తండోప తండాలుగా జనం ఆశ్రమానికి రాసాగారు. స్వామివారు తనను ఆశ్రయించిన

ప్రతివ్యక్తికి అన్నపానాదులను సమకూర్చి, భగవన్నామం అనే ఆయుధం ఇచ్చి వారిలో విశ్వాసాన్ని పాదుకొల్పారు.

మధ్య తెలంగాణా ఆకాశవీధిలో జేగీయమానంగా రెపరెపలాడుతున్న శ్రీ భావానందస్వామి వారి కీర్తిపతాకాలను కాంచి, గిట్టనివారు కొందరు అసూయ చెంది, లేనిపోనివి కల్పించి శ్రీపాండురంగాశ్రమంపై దాడి సలుపుడని రజాకార్లను ఉసిగొల్పగా, మరికొందరు కమ్యూ నిస్టులను రెచ్చగొట్టారు. వీరిరువురూ ఎంతో వైర భావంతో ఆశ్రమానికి వచ్చి, ఆ ప్రాంతాన్ని, స్వామివారిని చూసి చక్కగా మాట్లాడి భోజనం చేసి వెళ్ళేవారు. లేదా 'నిమిలెట్' (నిమ్మరసంతో తయారుచేసేది) అనే పానీయాన్ని తాగి వెళ్ళేవారు. ఒక్కోమారు ఉభయపక్షాలవారు ఎదురైకూడా సహపంక్తి భోజనం చేసి వెళ్ళారేకాని ద్వేషభావంతో గొడవలు సృష్టించలేదు. స్వామివారి ప్రేమ, వాత్సల్యాలు అలా వారిని ముగ్ధులను చేశాయి.

ఈవిషయం తెలిసిన ప్రజలు రజాకార్ల బారినుండి తప్పించుకోవడానికి ఈ ఆశ్రమ ప్రాంతంలో కొన్ని కుటీరాలు వేసుకొని ప్రశాంతంగా తమ తమ కుటుంబా లతో తలదాచు కున్నారు. అందరికి ఆశ్రమంలో బాబాగారు చక్కటి సదుపాయా లను కల్పించారు. ఈ సంఘటనతో ప్రజలకు మరింత చేరువైందీ ఆశ్రమం.

ఈ ఆశ్రమంతో సంబంధంగల ప్రాంతాలు మెదక్‌జిల్లాలోని గజ్వేల్, జగదేవ్ పూర్, త్రిగుళ్ళ, సిద్ధిపేట, దొంతి, నాచారం, తూప్రాన్, శివంపేట్ మండలాలు. రంగారెడ్డిజిల్లాలోని మేడ్చెల్, షామీర్‌పేట, కీసర మండలాలు. నల్గొండ జిల్లాలోని భువనగిరి, ఆలేరు మండలాలు. వరంగల్ జిల్లాలోని చేర్యాల, ఆకునూరు మండలాలు మొదలైనవి.

## 2. భజన సంప్రదాయం - భక్తితత్త్వం

"సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా"[2] (భగవంతుని యెడల అనన్యప్రేమ కుదురుకొనుటయే భక్తి). భక్తి, జ్ఞాన, వైరాగ్యాలలో భక్తియే మోక్షానికి సులభమార్గం.

భక్తి మార్గాన్ననుసరించి గమ్యం చేరినవారిలో అగ్రగణ్యులు నారద, ప్రహ్లాద, పుండరీక, ధృవ, అంబరీషులు లాంటివారు ఎందరో మహనీయులున్నారు.

భగవద్భక్తులు, భగవంతుని లీలలగూర్చి భాగవతం వివరిచింది. భక్తియొక్క

లక్షణాలు భాగవతం, భగవద్గీత, నారదభక్తి సూత్రాలు, భక్తుల కథల పుస్తకాలు వెల్లడిచేస్తున్నాయి.

**శ్లో॥ అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే**

**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥**[3]

అని స్వయంగా శ్రీకృష్ణుడే వివరించారు. ఇది తెలిసిన భక్తులు స్వామినే శరణుకోరారు. స్వామిని చేరిన భక్తుల మార్గాలు అనేకరకాలు.

**"కామోత్కంఠత గోపికల్, భయమునం గంసుండు, వైరక్రియా**

**సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్, సంబంధులై వృష్ణులున్,**

**ప్రేమన్ మీరలు, భక్తి నేము, నిదె చక్రిం గంటి మెట్లైనను**

**ద్దామ ధ్యానగరిష్ఠుడైన హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా!"**[4]

ఈవిధంగా స్వామిని ఒక్కొక్క పద్ధతిలో సేవించి వారు తరించారు. ముఖ్యంగా భాగవతం భక్తిని తొమ్మిది విధాలుగా వివరించింది.

**"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం**

**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్"**[5]

దీనిలో ఏది ఆశ్రయించినా భగవంతుని పొందవచ్చని, భాగవత కథలు నిరూపిస్తున్నాయి. ఇదే భక్తిని నారదభక్తి సూత్రాలలో పదకొండుగా పేర్కొన్నారు. అవి "గుణ మాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, కాంతాసక్తి, వాత్సల్యాసక్త్యాత్మ నివేదనాసక్తి తన్మయతాసక్తి పరమ విరహాసక్తి రూపా ఏకధాప్యేకాదశధా భవతి"[6] దీనిలోని ఏ మార్గం అనుసరించినా అది పరాకాష్ఠకు చేరితేనే భక్తి సఫలం అవుతుంది.

భక్తి తత్త్వంలోని ఒక అంశం 'భజన' దీనిని స్మరణం, కీర్తనం రెండిటిలోకి అనువర్తింప చేయవచ్చును. భజ్ (భజించుట) ధాతువునుండి ఏర్పడినది.

ఆరాధ్యదైవం పైన గల పూర్ణభక్తితో ఆ దైవాన్ని భజించడం భజన యొక్క లక్షణం. వాగ్గేయకారులగు అన్నమయ్య, త్యాగయ్య, రామదాసు, పురందరదాసు మొదలైన వారి రచనలను సంకీర్తన రూపంలో పాడుకోవడం దక్షిణాది సంప్రదాయం. మహారాష్ట్రకు చెందిన తుకారాం, నామదేవు, పండరీ భక్తులది

‘వార్కరి’ సంప్రదాయ భజన. ఉత్తరాదిన సూరదాసు, కబీరు, మీరా మొదలైనవారు ఎన్నో భజనలు చేశారు. తత్ పరంపరాగతమైన భజన సంఘాలు నేటికి నిలిచి ఉన్నాయి. ప్రాక్ దిశయందుగల ‘చైతన్య మహాప్రభు’ భజన సంప్రదాయానికే మకుటాయమానుడై ఆదర్శ పూర్ణుడై నిలిచారు.

చైతన్యుడు (గౌరాంగ) సంకీర్తన చేస్తూ వెళుతుంటే పండిత పామరజనులేగాక, క్రూర మృగాలు సైతం పరవశించి భజించేవట. దీనిద్వారా భజన యొక్క శక్తి అవగతమవుతున్నది.

మరుకూకు ఆశ్రమంలో నారాయణబాబాగారు సర్వజనులచే అఖండనామ సంకీర్తన చేయించేవారు. తానూ చేసేవారు. ఆ భజనలలో కొన్ని

**క). ఏకాంత భజన :** స్వయంగా తనకు తాను ఇష్టదైవాన్ని ప్రశాంత వాతావరణంలో నామ సంకీర్తనం చేస్తూ, భక్తిభావం ఉద్దీపనమయ్యేటట్లు భజన చేస్తూ ధ్యాననిమగ్నుడై ఆనందానుభూతిని పొందడం ఏకాంతభజన.

**ఖ). సామూహిక భజన :**స్వామి సన్నిధిలో మేళతాళాలతో రాగలయాత్మకంగా కీర్తనగాని, ఏకనామంగాని ఒకరు చెప్పగా తక్కినవారు అనుసరించటం ద్వారా మంద్ర మధ్య తారాస్థాయిలలో భగవన్నామ స్మరణం. త్రికరణశుద్ధిగా చేస్తూ భక్తి పారవశ్యంలో తేలుతూ, ప్రాపంచిక దశను మరచి సగుణ, సాకార మూర్తిలో లీనం కావడం సామూహిక భజన.

**గ). చక్రిభజన :** ఒకే వయసుగల పిల్లలకు శిక్షణనిచ్చి, అలంకరించి భాగవత, రామాయణ ఘట్టాలకు సంబంధించిన ఒక అంశాన్ని గ్రహించి, నృత్యం చేస్తూ, కోలాట మాడుతూ, హావభావాదులతో, అభినయంతో, సంగీత బద్ధంగా చక్రిని భజిస్తూ చక్రాకారంలో తిరుగుతూ చేయునది చక్రిభజన.

**ఘ). పహరా భజన (అఖండ భజన) :** పహరాకు ఒకరు చొప్పున 24గంటలు నిర్విరామంగా చేసే భజన ఇది. ఒకరోజైతే ఏకాహం అని, ఏడురోజులైతే సప్తప్రహరం (సప్తాహం) అని భజనలు (ఉత్సవాలలో) నిర్వహించటం ఇక్కడి సంప్రదాయం.

## 3). బాధ్యతా స్వీకారం - భారనిర్వహణం

1932లో ఈ ఆశ్రమాన్ని విశ్వనాథశర్మగారి తండ్రి ప్రారంభించారు. ఈ ఆశ్రమ లక్ష్యం నాదం, సాదం. నాదం అంటే నిరంతర భగవన్నామ భజనం. నాదం చేసినవారికి సాదం ప్రసాదంగా లభిస్తుంది. దీన్ని నారాయణబాబాగారు గృహస్థులుగా ఉన్నంతకాలం నడిపి, సన్యాసాశ్రమం స్వీకరించాక దాన్ని పుత్రునికి అప్పగించారు.

తండ్రి నుండి వారసత్వంగా వచ్చిన బాధ్యతను స్వీకరించి, తన గురువుగా శ్రీ భావానంద స్వామిని ఎంచుకుని, వారి ఆదర్శాలను తు.చ తప్పకుండా ఆచరిస్తూ, మిక్కిలి నిరాడంబరంగా తనదైన శైలిలో పాండురంగాశ్రమాన్ని చక్కగా, ఆదర్శవంతంగా నిర్వహించిన మహాత్ములు శర్మగారు.

విశ్వనాథశర్మగారి పదహారవయేటనే ఆయన తండ్రి నారాయణబాబా గారు (6.5.1943న) సన్యాసాశ్రమం స్వీకరించడానికి సిద్ధమయ్యారు. ఆ సమయంలో తన కుమారుని పిలిచి "నేటి నుండి ఈ ఆశ్రమ బాధ్యతలన్నింటిని నీవు నిర్వహించాలి. పాండురంగస్వామి సేవ మరువకూడదు"[7] అని చెప్పారు. భగవద్గీత, అధ్యాత్మరామాయణం కొన్ని మహామంత్రా లుపదేశించి, ఇవే నీకు నేను ఇస్తున్న ఆస్తిపాస్తులంటూ ఆశ్రమ బాధ్యతలను అప్పగించారు.

ఆ సమయంలో ఆశ్రమం ఆర్థికంగా చాలా సమస్యలను ఎదుర్కొంటూ ఉంది. వీటన్నింటిని గమనించిన శర్మగారు "ఎవరిని అప్పుగా ధనాన్ని అడుగ కూడదు, తీసుకో కూడదు. ఒకరిముందు చేయిచాచ రాదు" అని భీష్మ ప్రతిజ్ఞ చేసి ముందుకు నడిచారు.

తాను చేసిన ప్రతిజ్ఞకు బద్ధుడై నడుచుకున్నారు. జీవించినంతకాలం ఎన్నడూ ఎవరినీ చందాలు అడగడంగాని అప్పుతీసుకోవడంగాని చేయలేదు.

**"అకర్తవ్యం నకర్తవ్యం, ప్రాణైః కంఠ గతైరపి**
**కర్తవ్యమేవ కర్తవ్యం ప్రాణైః కంఠ గతైరపి॥**[8]

కర్తవ్యాలు తన ప్రాణాలు పోయినా సరే చేసి తీరాలి. అలాగే చేయకూడని పనులు ప్రాణాలు పోయినాసరే చేయకూడదు అనే భావంతో ఉండేవారు శర్మగారు.

తన కర్తవ్యాన్ని నిస్సంకోచంగా, నిక్కచ్చిగా, నిజాయితీగా ఆచరించి చూపిన వ్యక్తి శర్మగారు.

ఒకవైపు వ్యవసాయం, మరోవైపు శ్రీ పాండురంగని సేవ, ఇంకోవైపు అతిథిసేవ, గురుసేవ అన్నింటినీ చక్కగా నిర్వహించారు.

పశువులను అసంఖ్యాకంగా పెంచారు. దొడ్డినిండా ఆవులు, గేదెలుండేవి. ఆశ్రమ వాసులందరికి సరిపడా పాడి వాటిద్వారా లభించేది.

అతిథిసేవలో భాగంగా స్వయంగా వచ్చినవారికి తను వండి, వడ్డించేవారు. రోగంతో బాధపడుతున్న వారికి దగ్గరుండి పరిచర్యలు చేసేవారు. ఆశ్రమ ప్రాంగణంలో తాగడానికి నీరు అందుబాటులో వుండాలని పెద్ద పెద్ద కుండలలో నీరు నింపి అక్కడక్కడా పెట్టేవారు.

బీదవారు, వృద్ధులు వస్తే వారికి ఏవిధమైన అసౌకర్యం కలుగకుండా సపర్యలు చేసేవారు.

పండించిన పంటంతా అన్నదానానికే ఉపయోగించేవారు. నిస్స్వార్థసేవకోసం తపన పడేవారు. తమ పిల్లలను కూడా ఆశ్రమ సభ్యులని భావించి వారి బాగోగులు చూశారు. తనవారు, పరవారు అనే భేదభావం ఆయనలో ఉండేది కాదు.

పళ్ళచెట్లను, పూలచెట్లను ఆశ్రమం చుట్టూపెంచి, వాటికి తీగలల్లి ఎంతో ప్రేమగా పెంచారు. వాటిపూలను, పండ్లను వచ్చినవారికి ఆత్మీయతతో అందించారు.

సోమరితనం, అశ్రద్ధ అంటే తనకు ఇష్టముండదని చెప్పడం కాకుండా ఆచరణలో చూపేవారు. తాను పనిచేస్తూ, ఇతరులకు చెప్పేవారు. ఎవరినీ బాధ్యతలు తీసుకొమ్మని చెప్పలేదు. తనను అనుసరించి చేసేవారిని కాదనలేదు.

ఎక్కడి వస్తువులు అక్కడ పెట్టాలనేది వారి కాంక్ష. దానికి విరుద్ధంగా జరిగితే కొంత నొచ్చుకుని తిరిగి మళ్ళీ అదే స్థలంలో పెట్టేవారు. కారణం ఒక చిన్నవస్తువు కోసం ఎంతో సమయం వెదకడానికి వృధా అవుతుంది. ఒక వస్తువు ఆ స్థలంలో ఉంటుందనే విషయం అందరికీ తెలిసినట్లైతే చీకట్లోనైన యిట్టే పట్టుకురాగలరని, ముఖ్యంగా పెద్దప్రాంగణం కావడంవల్ల, జనాలు చాలా మంది

వుండడం, రావడం వల్ల అందరికి అసౌకర్యం, అలసట ఉండకూడదని భావించేవారు.

ఆశ్రమంలోని ప్రతి వస్తువుపైనా 'శ్రీపాండురంగ' అని వ్రాయించేవారు. ఆ వస్తువు నుపయోగించేవారు. ప్రతిదీ పాండురంగ స్వామికి చెందినదనే భావనతో ఉండాలని వారి ఉద్దేశం.

ఆషాఢ ఉత్సవాలు పెద్ద ఎత్తున జరిపించేవారు. ఆ ఉత్సవాలకు తగినట్టుగా పెద్దపెద్ద వంటపాత్రలు వడ్డన సామాగ్రి తయారుచేయించి భద్రపరిచారు. ఆశ్రమంలో నేటికీ వాటినే ఉపయోగిస్తున్నారు.

వచ్చిన ప్రతివారు 'భోజనం చాలా బాగుంది' అనే విధంగా ప్రేమగా అందించాలనే ధ్యేయంతో నిరంతరం శ్రమించేవారు. శ్రమను, శ్రామికులను గౌరవించేవారు.

ఆశ్రమ ప్రాంగణంలో గోడలపైన భగవన్నామం, సూక్తులు వ్రాయించారు. రోజుకొక మారు అయినా వాటిపై దృష్టిపడితే అది మనసున నాటుకుంటుందనేది వారి భావన.

'సాదం'నకు ఎంత ప్రాముఖ్యాన్నిచ్చారో నాదానికి అంత ప్రాముఖ్యం యిచ్చారు. శర్మగారు రోజూ వేలకొలది భగవన్నామం జపించేవారు. ఇంట్లోని వారందరి చేత భగవన్నామ జపం చేయించేవారు. అక్కడికి వచ్చిన వారంతా అలా చేసేవారు. అక్కడొక పుస్తకంలో రోజు ఎంత నామజపం చేసింది వ్రాయాలి. అది నియమం. ఆశ్రమంలో చిన్నపిల్లవాడి దగ్గరినుండి పండు ముదుసలి వరకు తీరిక సమయంలో జపమాలతోనే కన్పిస్తారు. ఈ దృశ్యాన్ని నేటికీ మనం ప్రత్యక్షంగా చూడవచ్చు. "సమయము వృథా చేయక భగవన్నామము చేయుము" అని మాటిమాటికి శర్మగారు వివరించేవారని ఆశ్రమవాసులు చెబుతారు. ఆశ్రమ కార్యక్రమాలలో అంతా కలిసి కూరగాయలు తరుగుతున్నప్పుడు, చిమ్ముతున్నప్పుడు, వంట జేస్తున్నప్పుడు, వడ్డనచేస్తున్నప్పుడు భోజనానికి ముందు, భోజనం చేస్తూ, ఇలా ఏపని చేస్తున్నా నిరంతరం 'హరేరామ' నామాన్ని గట్టిగా వల్లించేవారు.

ఆశ్రమంలో ఉన్న నాలుగు ఘడియలు నామజపంతో ఇలా గడపడంవల్ల ఒక వింత అనుభూతి కలుగుతుంది.

భక్తులు ఆశ్రమంలో తండ్రిగారి కాలంలో లాగానే, శర్మగారి సమయం లోనూ (దాదాపు 1988 సంవత్సరం వరకు) బంగారం దాచుకునేవారు. ఏ రక్షణ లేని ఆశ్రమంలో ఒక గదిలో బంగారం ఎవరిది వారికి చీటి వ్రాసి చిన్నచిన్న డబ్బాలలో దాచేవారు. వారు ఎప్పుడు అడిగితే అప్పుడు ఇచ్చేవారు. భక్తజనం ఆశ్రమాన్ని ఒక బ్యాంకులాకరులా వాడుకునేవారు. కారణం శర్మగారిపైన, ఆ సంస్థపైన వారికున్న అపార విశ్వాసం.

శర్మగారిని అంతా 'విశ్వన్న' అని భక్తితో పిలిచేవారు. ప్రతి వారికి 'అన్నయ్య' అనేభావన. అందరినోట అదే పిలుపు. వారు ఎలాంటి సమస్యనయినా విశ్వన్నకు చెప్పుకునేవారు. వారి సమస్యలను ఓర్పుతో వినేవారు. వారికి తగిన సూచనలు ఇచ్చేవారు. దానితో వారి మానసిక వేదన తగ్గి, ప్రశాంతంగా తిరిగి వెళ్ళేవారు.

భక్తుల ఇళ్ళలో ఏ శుభకార్యమైనా మొదటి శుభపత్రికను ఆశ్రమానికి అందించేవారు. అది వారికి కొండంత తృప్తినిచ్చేది.

భక్తులు తమ పిల్లలకు శర్మగారు చెప్పిన పేర్లే పెట్టుకునేవారు. ఆయన చెప్పిన పేర్లలో ఎక్కువగా విష్ణుప్రియ, కృష్ణప్రియ, రాధ, రుక్మిణి, భావానంద, చిత్కళ, మానస, లాస్య మొదలైన అర్థవంతమైన, అందమైన పేర్లు కనబడుతాయి. బంధువులకే కాదు తన పొలంలో పనిచేసే వారి పిల్లలకు కూడా శర్మగారే పేర్లు పెట్టేవారు. శర్మగారు చెప్పిన పేరుతో పిలిస్తే మాకు 'తృప్తి'యని వారు వివరించారు. దీన్ని బట్టి ఇంటిపెద్దకు యిచ్చిన గౌరవాన్ని స్వామివారికి వారు యిస్తున్నారని గ్రహించవచ్చు.

ఎవరు ఏ సహాయం చేయమని వచ్చినా కాదనకుండా శాయశక్తులా చేసేవారు.

ఉత్సవాలలో భాగంగా శర్మగారు భజనలు చేయించేవారు. నృత్యభజన, చక్రిభజన, సప్తప్రహర భజన, అఖండ నామ భజన మొదలగు వాటిని తండ్రి చెప్పిన విషయాలనే కాక మరికొన్నింటిని చేర్చి భక్తులకు అందించటానికి ప్రయత్నించారు.

పూజాకార్యక్రమాలలో తాను స్వయంగా రచించిన మంగళహారతులు, గొంతెత్తి

మధురంగా గానం చేసేవారు. వాటిని విని అందరూ తన్మయులై ఆనందించేవారు. భజన చెప్పి చేయించేవారు. వారికి విశ్వన్న యేది చెప్పినా వేదమే, ఆనందమే.

ఈవిధంగా ఆశ్రమ భారాన్ని బాధ్యతగానే కాకుండా భక్తిగా నిర్వహించారు. ఆయన నిర్వహించిన కాలమంతా నిత్యకల్యాణం, పచ్చతోరణంలా సాగింది. వస్తు సమృద్ధి. ధాన్య సమృద్ధి, ధన సమృద్ధి కలిగి ఏలోటూ లేకుండా ఉండేది.

**అ). నిరంతర కార్యక్రమ రూపశిల్పి - నిష్కామ కర్మయోగి.**

వసంత నవరాత్రులు, శ్రీ కృష్ణాష్టమి, శరన్నవరాత్రులు, శివరాత్రి, భావానంద స్వామి జన్మదినం, తల్లిదండ్రుల ఆరాధన మొదలైన కార్యక్రమాలను శర్మగారు ప్రతి సంవత్సరం భక్తి శ్రద్ధలతో జరిపించేవారు. అన్నింటికంటే పెద్ద ఎత్తున ఆషాఢ ఉత్సవాలు జరిపించేవారు.

**ఆ). ఆషాఢ ఉత్సవాలు**

1932 సంవత్సర ప్రాంతం నుండి ఆషాఢ ఉత్సవాలను మరుకూకు గ్రామం శివార్లలో ఉన్న శ్రీ పాండురంగాశ్రమంలో శర్మగారి తండ్రి ప్రారంభించారు. తండ్రి తర్వాత శర్మగారు 1960 నుండి 2000 వరకు ఈ ఉత్సవాలకు 40 ఏళ్ళు చక్కగా జరిపించారు.

ప్రతి ఆషాఢమాసంలో శుద్ధ దశమి, ఏకాదశి, ద్వాదశి - తిథులలో మూడురోజులు ఘనంగా (త్రిరాత్ర్యుత్సవాలు) జరుపుతారు. ఈ మూడు రోజులు అఖండనామ సంకీర్తన, చక్రిభజన, పహారాభజనాదులు, రామాయణ గానం, హరికథలు, సంగీత, సాహిత్య గోష్ఠులు ఆశ్రమ కార్యక్రమాలలో చోటుచేసు కుంటాయి.

దశమినాటి వరకు ఆశ్రమానికి అందరూ చేరుకుని ఏకాదశినాడు ఉపవసించి, ద్వాదశి నాటి ఉదయం 7గం॥ల నుండి అన్నదాన కార్యక్రమం నిర్వహిస్తారు.

“1932లో ఈ ఉత్సవం ప్రారంభించిన మొదటి సంవత్సరమే చుట్టుపక్కల గ్రామాలలోని ప్రజలు 3, 4 వేల మంది హిందువులు, ముస్లిములు అనే భేదం లేకుండా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. క్రమక్రమంగా ఆ సంఖ్య పెరిగి 1994లో జరిగిన ఆషాఢ ఉత్సవానికి దాదాపుగా 10వేల మందిపైగా వచ్చారు.”[9]

"1995లో జరిగిన ఆషాఢ ఉత్సవానికి అప్పటి పంచాయతిరాజ్ శాఖామాత్యులు శ్రీ కరణం రామచందర్‌రావుగారు విచ్చేసి, ఆశ్రమానికి తగిన వసతులు కల్పించి, తమవంతు బాధ్యతను నెరవేరుస్తామని తమ ఉపన్యాసంలో తెలిపారు."[10]

ఆషాఢ ఉత్సవాల సందర్భంగా హైదరాబాద్, కరీంనగర్, మెదక్, రంగారెడ్డి, నల్గొండ, వరంగల్ జిల్లాలనుండి భక్తులు తరలివస్తారు. వారి సౌకర్యార్థం ప్రత్యేకబస్సు సౌకర్యాన్ని ఆర్.టి.సి. వారు కల్పించారు.

1994 నుండి 2004 వరకు ప్రతి సంవత్సరం జరిగే ఈ ఉత్సవ విశేషాలను ప్రసిద్ధమైన పత్రికలన్నీ ప్రకటించాయి.

ఈ ఉత్సవాలు జరిగేది వర్షాకాలంలో కాబట్టి వచ్చిన వారందరికి ఎలాంటి అసౌకర్యం కలుగకూడదని విశ్వనాథశర్మగారి ఆధ్వర్యంలో విశాల ప్రాంగణం, వసారాలతో దాదాపు ఒకేసారి వేయిమందికి పైగా భక్తులు కూర్చునేవిధంగా పెద్ద భవనం కట్టించారు. ఇవేగాక తడకలతో ఆలయానికి ఎటుచూసినా రెండు మూడు కిలోమీటర్ల మేర పందిళ్ళు వేయిస్తారు. దానితో ఎంత జడివాన వచ్చినా భక్తులు ఇబ్బంది పడకుండా ఉండేటట్లు చేస్తారు.

ఈ ఉత్సవాలలో జరిగే అన్నదాన కార్యక్రమానికి సరిపడా వస్తుసామగ్రి శాశ్వత ప్రాతిపదికన శర్మగారు తయారుచేయించిపెట్టారు. ప్రతి సంవత్సరం 6 నెలల ముందు నుండి ఆహారధాన్యాలు, సంభారాలు సేకరించి పెట్టేవారు.

విశ్వనాథ శర్మగారి తండ్రికాలంలో "ధర్మం పెట్టెలు" (విరాళ సేకరణ హుండీలు) ఊరూరా తిరిగేవి. అందులో ప్రతి భక్తుని కుటుంబం వారు రోజుకు ఒకపైస చొప్పున సంవత్సరానికి రూ. 3.65 పైసలు ఉత్సవానికి అందించాలనే నియమాన్ని పెట్టుకున్నారు.

దాతలు దాదాపుగా ఇప్పటికీ అదే ఐదు, పదిరూపాయల సహాయం అందిస్తున్నారు. శర్మగారు మాత్రం ఎవరినీ అర్థించలేదు. ఎవరైనా వారంతట వారు ముందుకు వచ్చి సహాయం చేస్తే కాదనలేదు.

ఈ ఉత్సవాల ద్వారా చక్కటి ఆధ్యాత్మిక వాతావరణం ఏర్పడింది. సామాన్య జనులు ఈ ఉత్సవాలను 'తిరునాళ్ళ'గా భావించి ఆనందించారు.

శర్మగారు తాను స్వయంగా కార్యక్రమాలు నిర్వహించడమే కాక ఎవరైనా ఉత్సవాలకు, కార్యక్రమాలకు ఆహ్వానిస్తే ముఖ్యఅతిథిగా వెళ్లి పాల్గొనేవారు. తమ దివ్య సందేశాన్నందించి, భక్తులను ప్రభావితులను చేసేవారు.

రుద్రపరిషత్‌లు, నవరాత్రులు, దేవతాప్రతిష్ఠ కార్యక్రమాలు, వార్షికోత్సవాలు మొదలైన కార్యక్రమాలకు ఆయన వెళ్ళేవారు. ఇలా ఆయన ఆధ్యాత్మిక భావ ప్రచారాన్ని సాగిస్తూ సమాజోన్నతికి దోహదం చేశారు.

## జ్ఞాపికలు


1. శ్రీ యతివర భావానందస్వామి (జీవితచరిత్రము) : రఘురామశాస్త్రి, గౌరీభట్ల పుట - 397
2. నారదభక్తి సూత్రములు (ప్రేమదర్శనము) : సూత్రం -2, పుట - 24
3. శ్రీమద్భగవద్గీత : రాజవిద్యా రాజగుహ్య యోగము, శ్లో.22, పుట. 118
4. శ్రీమదాంధ్ర భాగవతము : పోతన, బమ్మెర, సప్తమస్కంధము, పద్యం -18 పుట.500
5. శ్రీ భాగవతమ్ : శ్రీ వేదవ్యాస కృతం - సప్తమస్కంధం, శ్లో. 23, పుట. 91
6. నారదభక్తి సూత్రములు (ప్రేమదర్శనము) : హిందీమూలము - హనుమాన్ ప్రసాద్, పోద్దార్. తెలుగు మూలము - ఉదయభాస్కరమ్, బులుసు. సూ.82, పుట. 220
7. శ్రీ యతివర భావానందస్వామి (జీవితచరిత్రము) : రఘురామశాస్త్రి, గౌరీభట్ల పుట. 201
8. శ్రీ పార్థివ నామసంవత్సర పంచాంగమ్ : శ్రీ యాదగిరిదేవస్థానం ముద్రణ, పుట.61
9. ఈనాడు దినపత్రిక : జూన్ 17, 1994.
10. ఈనాడు దినపత్రిక : జూలై 10, 1995

# 4. శ్రీ పాండురంగ శతకం - పరమార్థ వివేచనం

కవిత్వం ఒక విశిష్టమైన కళ. ఈ కవితా జగత్తులో ఎందరెందరో కవి చంద్రులు కవితా చంద్రికలను వ్యాపింపజేస్తున్నారు. ఆదికవి నన్నయ్య నాటినుండి నేటివరకు ఈ కవితా సంపద శతాబ్దులు గడచిన కొలది కొత్తకొత్త హంగులతో అక్షరమై దినదినాభివృద్ధి చెందుతున్నది.

సృష్టికి ప్రతిసృష్టి చేసే శక్తిగల కవులు ఈ కవిత్వాన్ని దేవతలను స్తుతించటానికి, ప్రకృతిని ఆరాధించటానికి, ఆవేదనను తెలపటానికి, అధర్మాన్ని అడ్డుకోవటానికి ఉపయోగిస్తు న్నారు.

ఇవేగాక సంఘంలోని దురాచారాలను ఖండించటానికి, మతవిశ్వాసాలు వ్యక్తపరచడానికి దీనిని వాడుకున్నారు. ఆత్మానందానుభూతిని పొందారు. తమ కవిత్వం ద్వారా దైవాన్ని రప్పించుకున్నారు. తమ ప్రతిభను చాటుకున్నారు. విజ్ఞానాన్ని తరువాత తరాలవారికి ఈ కవిత్వం ద్వారా అందించారు.

ఇలాంటి ఈ కావ్యజగత్తులో ఎందరెందరో మహానుభావులు తమకంటూ ఒకస్థానాన్ని ఏర్పరచుకున్నారు. అలాంటి వారిలో శ్రీ అప్పాల విశ్వనాథశర్మగారు ఒకరు. విశ్వనాథశర్మగారు తన కవితాఝరిని తెలుగులోను, సంస్కృతంలోను ప్రవహింపజేశారు. తెలుగులో శతకాలు, నీరాజనాలు, బంధాలు మొదలైన వాటిని రసవత్తరంగా అందించారు.

శర్మగారు పరమభక్తులు. మొదట ఒకటి రెండు మంగళహారతులు రచించారు. తల్లి మరణం వల్ల కలిగిన వేదనతో 'మాతృకట్నం' అనేపేర 16 పద్యాలు 'పరమ కరుణాంతరంగ శ్రీ పాండురంగ' అనే మకుటంతో రచించారు. ఈ పద్యాలు "యశోదమాత" అనే పుస్తకంలో 1954లో ముద్రించారు.

తరువాత కొద్దిరోజులకు ఆయన తండ్రి నారాయణబాబాగారు "అదే మకుటంతో మన ఆరాధ్యమైన పాండురంగనిపైన శతకం వ్రాయుము"[1] అని ఆదేశించారు. ఆ ఆదేశం ప్రకారం పాండురంగ శతకాన్ని రచించారు. తర్వాత

మిగిలిన రచనలు నిరాటంకంగా రచించారు. భక్తి, వేదాంత భావభరితంగా సాగిన శర్మగారి రచనలన్నింటిలో లాలిత్యం, సరళమైన పదజాలం కనబడుతుంది.

## 1. పాండురంగ శతకం - తత్త్వానుశీలనం

శర్మగారు 'పరమకరుణాంతరంగ శ్రీపాండురంగ' అనే మకుటంతో శ్రీపాండు రంగ శతకాన్ని సరళశైలిలో రచించారు. ఇది మూడు ముద్రణలకు నోచుకుంది.

'శ్రీరుక్మిణీసతీ' అంటూ మొట్టమొదటి పద్యాన్ని ప్రారంభించారు. ఈ పద్యంలోని 'శ్రీ'ని ప్రతిపాదాదిలో నిక్షిప్తంచేసి, చివరన 'పాండురంగ' అని ముగించారు.

**సీ॥ శ్రీ రుక్మిణీ సతీ! చిత్త నీరజభంగ!**
**భవభంగ! సదపాంగ! పాండురంగ**
**శ్రీ రాధికాధార! శ్రితజనమందార!**
**ప్రణతార్తిహరణ! శ్రీ పాండురంగ**
**శ్రీ గోపికాబృంద సేవ్య పాదద్వంద్వ**
**భక్త హృద్విహరణ! పాండురంగ**
**శ్రీ నందతనయ! బ్రహ్మానంద సాగర**
**పుండరీక వరద! పాండురంగ**
**గీ॥ నీల కోమలవర కమనీయ వేష**
**దేవ! మృదుభాష! చిన్మయ! దీనలోక**
**వరద! పాండురంగాశ్రమ భాసమాన!**
**పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ!**[2]

రుక్మిణీదేవి హృదయకమలానికి భృంగమైనవాడు. జన్మరాహిత్యం చేసేవాడు. సత్యదృష్టి కలవాడు, రాధికకు ఆధారమైనవాడు, ఆశ్రితులకు కల్పవృక్షం లాంటి వాడు. నమస్కరించిన వారి ఆర్తిని తొలగించేవాడు, గోపికలచే సేవింపబడే పాదాలు గలవాడు, భక్తుల హృదయాలలో విహరించేవాడు, నందుని కుమారుడు, బ్రహ్మా నందానికి సాగరంలాంటివాడు, (బ్రహ్మానంద స్వరూపుడు) పుండరీకుడనే భక్తునికి వరాలిచ్చినవాడు, నీలమైన కోమలమైన శ్రేష్ఠమైన మనోహరమైన వేషం (మూర్తి) కలవాడు, దివ్యమైనవాడు, మృదువచనుడు, జ్ఞానస్వరూపుడు, దీనులైనవారికి

వరాలిచ్చేవాడు. పాండురంగాశ్రమంలో ప్రకాశిస్తూ ఉండేవాడు. లేదా పాండు రంగాశ్రమాన్ని తన ఉనికిచే ప్రకాశింపజేసేవాడు, గొప్ప దయార్ద్రహృద యుడు అయిన పాండురంగడని ప్రారంభ పద్యంలోనే ఆయన భగవంతుని గుణాలు స్ఫురించేటట్లుగా కీర్తించాడు.

ఈ ప్రారంభపద్యంలో భగవంతుని షడ్గుణైశ్వర్యాలు చిత్రించబడ్డాయి. మాహాత్మ్యం, ధైర్యం, యశస్సు, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం అనేవి షడ్గుణైశ్వర్యాలు. భవభంగ, శ్రితజనమందార, భక్త హృద్విహరణ మొదలైన విశేషణాలు ఆయన మాహాత్మ్యాన్ని వ్యంజింపజేస్తున్నాయి. ప్రణతార్తి హరణ, పుండరీకవరద, దీనలోక వరద అనే విశేషణాలు ఆయన ధైర్యగుణాన్ని ధ్వనింప జేస్తున్నాయి. బ్రహ్మానంద సాగర, గోపికాబృంద సేవ్యపాదద్వంద్వ అనే విశేషణాలు ఆయన 'యశస్సు'ను ప్రతిఫలింపజేస్తున్నాయి. శ్రీరుక్మిణీసతీ చిత్త నీరజభృంగ, శ్రీరాధికాధార అనేవి ఆయన 'శ్రీ' అనే గుణాన్ని, చిన్మయ, పాండురంగాశ్రమభాసమాన అనేవి ఆయన జ్ఞానగుణాన్ని, పరమకరుణాంతరంగ అనే విశేషణం 'వైరాగ్యం' అనే గుణాన్ని స్ఫురింపజేస్తూ ఉండడంవల్ల ఈ పద్యం భగవంతుని షడ్గుణైశ్వర్యాలను ప్రతిపాదించిందని చెప్పవచ్చు.

పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీ భావానందస్వామి వారి ఆదేశంమేరకు జరుగుతున్న రచన ఈ శతకం. ఆయన శర్మగారికి గురువు. పూర్వాశ్రమంలో తండ్రి. అందువల్ల పాండురంగస్వామికి ఆయనకు అభేదాన్ని సూచిస్తూ రెండోపద్యం రూపుదిద్దుకుంది.

**సీ॥ శ్రీదేవి యురముపై శ్రీవత్సచిహ్నమై**
**దేవభావము చాటి తెలుపుచుండ**
**కాంచన చేలమ్ము కాషాయవస్త్రమై**
**రెట్టింపు శోభలనుట్టిపడగ**
**మురళియే కరమున వరదండరాజమై**
**పదిరెట్లు గౌరవభావమొంద**
**జీవ కల్యాణమ్ము సేయ భావానంద**
**భారతీయతి పూజ్యపాదులనగ**

గీ॥ **అవతరించిన నారాయణాఖ్య కృష్ణ!**
**లలితదరహాస ముఖ! కమండలు విభూష!**
**విశ్వనిర్మాణ కారణ! వేణుధరణ!**
**పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ!**[3]

అంటూ తండ్రికి, దైవంతో అభేదం కల్పించి, చక్కటి సమన్వయంతో చిత్రించారు. లోకంలో సహజంగా దైవాన్ని తండ్రిగా భావించటం కన్పిస్తుంది. కాని ఇక్కడ తండ్రిని దైవంగా భావించి రచించడం విశేషం.

## 2. అద్వైత తత్త్వ ప్రతిపాదనం

శర్మగారు అద్వైతి. ఆయన శివకేశవులలో ఒకే భగవత్తత్వాన్ని దర్శించారు. ఈ శతకంలో పాండురంగస్వామిని శ్రీకృష్ణునిలోను, శ్రీరామునిలోను, శివునిలోను దర్శించారు.

సీ॥ **అందాలు గల చిన్న చందమామను దెచ్చి**
**పూవుగా జటలోన ముడిచి తీర్చి**
**శిరముపై వరగంగ ఝరులు జిమ్ముచునుండ**
**ముద్దుగా నొసట విభూతి మెరయ**
**తనువెల్ల పాముల తావళమ్ములు జుట్టి**
**దట్టమౌ పులితోలు బట్టగట్టి**
**ప్రమథగణమ్ములు ప్రస్తుతించుచునుండ**
**దండిగా నా వెండి కొండపైన**

గీ॥ **ముంగిటను గొల్వగా నంది భృంగిరిటులు**
**శూలడమరు కపాలాలు కైలబూని**
**సతము వెలుగొందు పార్వతీపతివి నీవె**
**పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ!**[4]

అని శివకేశవులకు అభేదం పాటించడంలో తిక్కన హరిహరాద్వైత తత్త్వం స్ఫురింప జేశారు.

పాండురంగశతకంలో ఒక్కసారి కాదు పలుమార్లు

**"భవుడవీవౌదు వపర్ణరాధ"[5]**

**"అగజతో కైలాస నగమున వసియించి**

**సంహారలీలలు సలుపుదీవె"[6]**

**"శ్రీ శివా! యని నిన్ను చింతించునొక్కడు"[7]**

**"శివశివా! యెట్టి భ్రమగల్గె చిత్తమునకు"[8]**

**"శివశివా! నిరతము శ్రీకృష్ణదర్శన**

**భాగ్యము గల్గుటెబ్భంగి నాకు"**

**"హరహరా! యెట్లు బ్రహ్మానందమయ సౌఖ్య**

**సంపన్నమౌ చిత్తశాంతి నాకు"[9]**

ఇలా శివుని, కేశవుని సమభావనతో కీర్తించారు.

### 3. పాండురంగనిలో అవతార తత్త్వప్రదర్శనం

దశావతారాలలో శ్రీరామావతారం ఒకటి. శ్రీరాముని సాకేతరామునిగా, కల్యాణ రామునిగా, పురుషోత్తమునిగ వర్ణించారు. ఒకేపద్యంలో శ్రీరామ పట్టాభిషేక సన్నివేశాన్ని కనులకు గట్టినట్లుగా, రామపట్టాభిషేక చిత్రాన్ని మనముందుంచినట్లుగా చిత్రించారు.

**సీ॥ సరయూనదీతీర సాకేతపుర దివ్య**

**హర్మ్యస్థ రత్నసింహాసనమున**

**వామాంకమున సీత వరలగా లక్ష్మణ**

**భరత శతృఘ్నులు భక్తిగొలువ**

**రామనామామృత రసపాన సంతృప్త**

**చిత్తుడౌ మారుతి సేవజేయ**

**కపివీర వందిమాగధ భక్తిబృందాలు**

**కేల్మోడ్చి నిల్చి సత్కీర్తిబాడ**

**గీ॥ రావణాదుల కడదేర్చి రాముడనగ**

**పురుషమోహన సౌందర్యమూర్తివగుచు**

**సతము వెలుగొందు జానకీపతివి నీవె**

**పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ![10]**

కొన్ని పద్యాలలో

**"శ్రీరాముడవు నీవు, సీత రాధాదేవి"[11]**

**"అరి సోదరునకైన శరణన్న మాత్రాన**

**నభయ మొసంగిన ప్రభుత నరయ"[12]**

**"పండ్లు సాపడి మోక్షపదము శబరికీయ**

**నెంగిలిలో నేమి రంగుగలదో"[13]**

**"రాముగా గోలోకధాముగా హరి! పరం**

**ధాముగా స్మరియింతు ధర్మరూప"[14]**

అంటూ శ్రీరామునిగా పాండురంగస్వామిని వర్ణించారు. అంతా విష్ణు మయంగా భావించే భక్తుడు ఎవరైనా ఈవిధంగా వర్ణించటం పరిపాటి.

శ్రీకృష్ణుని వర్ణించటంలో ఏ ఘట్టాన్ని వదలలేదు. బాలకృష్ణుని, యశోదా కృష్ణుని, రాధాకృష్ణుని, మురళీకృష్ణుని, గోపాలకృష్ణుని, మధురాకృష్ణుని, రుక్మిణీ కృష్ణుని చక్కగా వర్ణించారు. ముఖ్యంగా పాండురంగని కృష్ణునిగా, కృష్ణుని పాండురంగనిగా స్తుతించారు.

**"నల్ల నల్లనివాడు నగుమోము గలవాడు**

**చల్లని చూపు రంజిల్లువాడు**

**ఘల్లుగజ్జెలవాడు కాళీయుపైనాడు**

**పిల్లడు రాధికా వల్లభుండు"[15]**

**"గొల్లవారిండ్లలోనెల్ల వెన్నలు మెక్కి**

**నిగనిగలాడెడు నీలి వెలుగు"[16]**

**"కాంచగా మురళి మ్రోగించగా నన్ను పా**

**లించగా నెంచుమా మించు కరుణ"[17]**

అంటూ ఆయా పద్యాలలో గోపాల, గోవర్ధనోద్ధార, బాలగోపాల అనే నామాలతో శ్రీకృష్ణుని వర్ణించారు. దాదాపు దశమస్కంధంలోని సారాంశం అంతా ఈ పద్యాలలో కన్పిస్తుంది. ఒక పద్యంలో శ్రీకృష్ణుని అష్టభార్యలను చిత్రించటం అద్భుతంగా ఉంది.

ఇక్కడ అష్టభార్యలు అష్టసిద్ధులలాంటివారు. వీటిచే లోకం ఆకర్షింప

బడుతుంది. కాని భగవంతుడవైన నీవు కాదు. కాబట్టి ఆ ఆకర్షణనుంచి బయట పడి 'ద్వారక'ను వీడి (ద్వారక – నవద్వార నిర్మితమైన శరీరానికి ప్రతీక) అంటే మానవ స్వభావాన్ని వీడి భక్తుడనైన నా దగ్గరకు రమ్మని కవి నిగూఢంగా భగవంతునాదేశించాడు. అంతేకాదు. ఆ అష్టభార్యలు అష్టశక్తులకు (అష్టశక్తులు – సరసిజాలయ, సావిత్రి, సర్వభద్ర, విమల, పద్మ, మహాదేవి, విలసదీశి, జాహ్నవి) ప్రతీకలు. భగవంతుడు 'భక్తి'కి లొంగేవాడే కాని 'శక్తి'కి లొంగేవాడు కాదు. అందువల్ల అష్టశక్తులను వీడి 'భక్తుని' చేరరావాలని కవి నిశ్చితాభిప్రాయం.

అంతేకాదు అష్టభార్యలను వదలి తనవద్దకు 'రమ్ము' అని స్వామిని ఆదేశించడం భక్తుని గడుసుదనాన్ని, భక్తితత్పరతను తెలుపుతూంది.

**సీ॥ శ్రీరుక్మిణీమాత చిత్తము దోచెనో**
**సత్యకోపముదీర్చ సాగినావొ**
**జాంబవతీదేవి జాలిగ జూచెనో**
**విడకుండ లక్షణ వేడుకొనెనొ**
**మిత్రవిందాదేవి మైత్రికి లొంగి తొ**
**నాగ్నజితి గృహాన మగ్నమయితొ**
**భద్రదెందమ్మున బంధింపబడితివొ**
**కాళింది నెడబాసి కదలలేవొ**

**గీ॥ ఏల రావేల? వేణుగోపాల బాల!**
**కరుణతో గూడి, ద్వారకాపురము వీడి**
**రమ్ము వసియించు నాలోన రాధతోడ**
**పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ!**[18]

రాధతో గూడా పాండురంగని రమ్మని కోరడం వల్ల లక్ష్మీసహితుడైన విష్ణువును తన హృదయంలో నివసించమని కోరాడు కవి. ఆయన పరమ కరుణాంతరంగుడు కాబట్టి తన కోరిక తీరుతుందని కవియొక్క దృఢనిశ్చయం.

## 4. ఆత్మ పరమాత్మ తత్త్వ చిత్రణం

**శ్రీరాముడవు నీవు – సీత రాధాదేవి**
**భవుడవీ వౌదు వపర్ణరాధ**

..................................

చతురాననుడ వీవు చదువుల సతిరాధ

.................................

..................................

పుంవాచకమ్మెల్ల భువన మోహన! నీవు

స్త్రీ వాచకము దయాసింధు రాధ

గీ॥ రంగడవు నీవు రుక్మిణీ రమణిరాధ
నీవె రాధవు రాధయే నీవు స్వామి
నిఖిలమును నీవె శ్రీకృష్ణ నేను నీవె
పరమ కరుణాంతరంగ శ్రీ పాండురంగ[19]

స్త్రీ, పుం వాచక భేదమే తప్ప దైవంలో స్త్రీ, పురుష భేదం లేదని 'నీవె రాధవు రాధయే నీవు స్వామి' అంటూ పరమాత్మ తత్త్వాన్ని ప్రతిపాదించారు. అంతేకాదు ఇంకో అడుగు ముందుకేసి 'నిఖిలమును నీవె శ్రీకృష్ణ నేను నీవె' అంటూ పరమాత్మ జీవాత్మలు వేరుగా కనబడుతున్నా వాటికి భేదంలేదని "సోహం బ్రహ్మ" తత్త్వాన్ని ప్రతిపాదించి, అద్వైత సిద్ధాంతాన్ని అతి సులువుగా విశదీకరించారు. ఆత్మ, పరమాత్మలు భిన్నం కావని వాటిలో పరమాత్మ బింబం కాగా ఆత్మ ప్రతిబింబంలాంటిదని ధ్వనింపజేశారు. ఇలా తన పద్యంలో రెండు వాక్యాలలో ఆత్మ, పరమాత్మల తత్త్వాన్ని చక్కగా చిత్రించారు.

## 5. పాండురంగని దయాతత్త్వం

'పరమ కరుణాంతరంగ శ్రీ పాండురంగ' అనే మకుటంలో స్వామి, దయతో నిండిన మనసుగల వాడని వాచ్యంగా చెప్పడమే గాక ఆ దయను భక్తులపై ప్రదర్శించిన సన్నివేశాలను, సందర్భాలను చిత్రించారు కింది పద్యంలో.

సీ.॥ ఏకనాథునియింట పాకాది కార్యముల్

జేసి కావడినీళ్ళు మోసిమోసి

ప్రేమన్ జనాబాయి పిలిచిన నటకేగి

వేడుకతో పిండి విసిరి విసిరి

శ్వేతవాహనుపైన ప్రీతితో రణమున
లీలగా రథమును తోలి తోలి
ఆర్తజిజ్ఞాసువు లర్థార్థులెందరో
మొరలిడ వారికై తిరిగి తిరిగి

గీ॥ ఎంత శ్రమనొంది యుంటివో యేమొరమ్మ
దాచుకొందును హృదయాన తాల్మితోడ
విశ్రమింపుము క్షణమైన విమలచరిత
పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ[20]

ఏకనాథుడు, జనాబాయి, అర్జునుడు అనే భక్తులు ఆయన దయకు పాత్రులయ్యారు. వారేకాక ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు ఎందరిపైననో ఆయన తనదయను ప్రసరింప జేశారు. నిరంతర భక్త రక్షకుడు, ఆర్తత్రాణ పరాయణుని విశ్రమించమని కవి కోరడంలో వాత్సల్య భక్తి కనిపిస్తుంది. భగవంతుని లాగానే ఈ భక్తకవి గూడా కరుణాంతరంగుడే.

## 6. బ్రహ్మసత్యం జగన్మిథ్య

"బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యేవం రూపో వినిశ్చయః
సోఽయం నిత్యానిత్యవస్తు వివేక స్సముదాహృతః"[21]

(బ్రహ్మ, సత్యం, శాశ్వతమయినది. జగత్తు మిథ్య అయినది. అనే నిశ్చయ బుద్ధి కలగటం నిత్యానిత్య వస్తు వివేకం అంటారు.)

"సత్సమృద్ధం స్వతస్సిద్ధం శుద్ధం బుద్ధమనీదృశమ్
ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నా నాస్తి కించన"[22]

(సత్యమై, వైభవసంపన్నమై, స్వతస్సిద్ధమై, శుద్ధమై, జ్ఞానస్వరూపమై, ఉపమాన రహితమై ఒప్పే ఒకే ఒక అద్వితీయ బ్రహ్మం ఉంది. అదే సత్యమైనది. దానిలో నానాపదార్థ సము దాయం ఏదీ లేదు.)

శ్రీ ఆదిశంకరాచార్యులవారు 'బ్రహ్మసత్యం – జగన్మిథ్య' అని ప్రతిపాదించిన విషయాన్ని పాండురంగ శతకంలో శర్మగారు తనదైన శైలిలో వివరించారు.

సీ॥ తలిదండ్రులెవ్వరు? తనయులు తనయలు
భార్యలు చుట్టాలు భర్తలెవరు?
అన్నలుందమ్ములు నక్కసెల్లెండ్రును
శత్రువు లెవ్వరు? మిత్రులెవరు?
యెవ్వరు నా వారలెవ్వరు? పెరవారు?
యెవరౌదు రిలలోన నెవరికెవరు?
యెవరిండ్లు వాకిళ్ళు? భువి? భోగభాగ్యమ్ము
లెవరికనుభవమ్మొ? యెవరికెరుక?

గీ॥ నాది నా వారలని యెంత మోదుకొనిన
వెడలిపోయిన నాడేల? వెంటరారు?
శివశివా। యెట్టి భ్రమగల్గె చిత్తమునకు
పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ.[23]

'ఆత్మీయులు, బంధువులు, మిత్రులు, శత్రువులు, నావారు, పరవారు అనే ఈబంధాలు శాశ్వతంకాదు. ఇల్లు, వాకిలి, భోగభాగ్యాలు అన్ని ఎప్పుడూ మనం అనుభవిస్తామనే మాట శాశ్వతం కాదు. మరణించే వేళ 'నాది, నావారలు' అనేవారు ఎవరూ వెంటరారు. ఇలాంటి అశాశ్వతమైనది 'శాశ్వతం' అనే భ్రమ చిత్తానికి ఏలకలిగిందో స్వామీ! అంటూ వేదన చెందారు.

మరో పద్యంలో

సీ॥ ప్రేమతో పోషించి పెంచిన నీదేహ
మగ్గిలో నెన్నడో బుగ్గియగును
రాగమెంతగ నున్న భోగభాగ్యములన్ని
విడిపోవునేకాని తడయవెపుడు
ధనధాన్యరాసులు ఘనమైన సంపదల్
క్షణములో పొంగుచు సమయుచుండు
పోవునపుడు వెంటపూచిక పుల్లయు
మచ్చుకైనను రానిమాట నిజము

గీ॥ **అచ్చముగ పుట్టునొక్కడే చచ్చునొకడె**
**పాప పుణ్యాల ఫలము సొపడునొకండె**
**దేవ। తోడెవ్వడునురాడు నీవుదప్ప**
**పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ।**[24]

'ఈ శరీరాన్ని ఎంత ప్రేమగా పెంచినా నశించిపోయేదే, భోగభాగ్యాలన్నీ దూరమయ్యేవే, ధనధాన్యరాసులు ఒకసారి వృద్ధి అవుతూ, క్షీణిస్తూ ఉంటాయి. మరణించేవేళ పూచికపుల్ల కూడా వెంటరాదు. మనిషి పుట్టిననాడు, చనిపోయిన నాడు ఒక్కడే, తోడెవ్వడురాడు. ఆ ఒక్కడే పాపపుణ్యాల ఫలితం అనుభవించాలి. పాపపుణ్యాల ఫలితం తప్ప మిగిలినవన్నీ అశాశ్వతం. ఈ సమయంలో స్వామీ! నీవు ఒక్కనివే రక్షకుడవు', అంటూ ప్రపంచమంతా ఒక నాటకం అని సూత్రధారి ఆడించినటుల ఆడుతుందని ఈ రంగుల ప్రపంచం ఎన్నడో సమసిపోతుందని "భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢానిమాయయా... "[25] అనే గీతాశ్లోక భావం స్ఫురించే విధంగా వివరించారు.

సీ॥ **"కానున్నదెట్లైన కాకమానదుగదా?**
**కానిదేనాటికిగాదు నిజము**
**కనులు గాంచునదెద్ది కలకాలముండదు**
**కనరాని దొక్కటే కలదు సతము**
**కోటి సొమ్మిచ్చిన దాటిపోయిననాటి**
**యరనిమేషమ్మైన మరలిరాదు**
**కలిమిలేములు రెండు కావడికుండలై**
**మంచిచెడ్డల వెంట మసలుచుండు**

గీ॥ **కాలునకు సుంతయైనను జాలిలేదు**
**తోడనేయుండు మృత్యువు నీడవోలె**
**తలచుకొన ఝల్లుమని గుండెతల్లడిలును**
**పరమ కరుణాంతరంగ। శ్రీపాండురంగ"**[26]

'ఏది జరగవలసి ఉందో అదే జరుగుతుంది. కనిపిస్తున్నదేది కలకాలం ఉండదు. కనిపించని సత్యమైన పదార్థం వేరే ఉంది. కోటి రూపాయలు ఇచ్చినా గడచిన కాలం ఒక నిముషం కూడా తిరిగి రాదు. కలిమి, లేములు కావడి

కుండలుగా, మంచి చెడులతో కలిసి ఉంటాయి. కాలునికి కొంచెమైనా దయలేదు. మృత్యువు నీడలాగా వెన్నంటి ఉంటుంది. ఈ విషయం తలచుకొన్నప్పుడల్లా గుండె తల్లడిల్లుతుంది. అవి జరామరణ దుఃఖాన్ని, కాల స్వరూపాన్ని, నిత్య సత్యాన్ని వివరించారు.

**సీ॥ "ఒకనాటి మంచి యింకొక నాటికింజెడ్డ**
**రోసినదొకనాడు రాసికెక్కు**

**.................................................**
**................................**

**ప్రతి వస్తువులలోన పరివర్తనముగల్గు**
**సరట రంగులు మార్చుకరణి నెపుడు**

**గీ॥ లేదు సంతృప్తి జగమునలేదు సుఖము**
**లేదు నిత్యత సత్యత లేదు శాంతి**
**నిన్ను భజియించకున్నచో నెన్నడైన**
**పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ"[27]**

ఒకనాటి మంచి, ఒకనాటికి చెడు అవుతుంది. అలాగే ఒకనాటి చెడు మరో నాటికి మంచి అవుతుంది. ప్రతి వస్తువులోను మార్పు కలుగుతుంది. ఈవిధంగా మార్పు చెందే ప్రపంచంలో నిన్ను శరణువేడుకుంటే సుఖం, సంతృప్తి, శాంతి కలుగుతుంది. లేదా అవి శూన్యం అంటూ పుట్టటం, పెరగటం నశించటం ఇవి ప్రతి వస్తువులోను కనిపిస్తాయి. మన కనుకూలమైన మార్పువస్తే సంతోషం, కానప్పుడు దుఃఖం కలుగుతుంది అంటూ భవసాగరపు బాధలు వర్ణించారు. ఇదే విషయాన్ని వివేకచూడామణిలో శంకరాచార్యులు

**"పరిపూర్ణమనాద్యంతమప్రమేయ మవిక్రియమ్**
**ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానాఽస్తికించన"[28]**

(నిజం విచారిస్తే సర్వత్రా – పరిపూర్ణం, ఆద్యంత రహితం, అప్రమేయం, వికారరహితం, ఏకం, అద్వితీయమైన, బ్రహ్మమే నిండి ఉంది. దానిలో వేరుగా నానాపదార్థ జాతం ఏదీలేదు). మార్పు చెందేది, పుట్టటం, గిట్టటం మొదలైనవి ఏవీలేని బ్రహ్మం ఒక్కటే శాశ్వతం, మార్పు చెందే ప్రపంచం అశాశ్వతం అనే

విషయాన్ని శర్మగారు, శంకరాచార్యులవారి సిద్ధాంతంతో ఏకీభవిస్తూ పై పద్యంలో వివరించారు.

**గీ॥ "అఖిల జగమును కణకణ మరసిచూడ**
**మాయచే వేరుగా దోచు మదికిగాని**
**సత్యమునకీవె దేవ। నిస్సంశయముగ**
**పరమకరుణాంతరంగ। శ్రీపాండురంగ॥"[29]**

ఈ సమస్త ప్రపంచాన్ని అణువణువూ పరిశీలిస్తే మాయవల్ల ఇది వేరుగా కన్పిస్తుంది. కాని సత్యశోధన చేస్తే ఇదంతా బ్రహ్మస్వరూపమని విశదమవుతుంది. కాబట్టి స్వామిని భజిస్తూ, కీర్తిస్తూ శాశ్వతమైన మోక్షం సాధించాలని శర్మగారు ఉద్బోధించారు.

## 7. నవవిధ భక్తులు - నామస్మరణం

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం॥[30]**

ఈ తొమ్మిది విధాలైన భక్తి మార్గాలలో నామ'స్మరణా'నికి విశ్వనాథ శర్మగారు ఈశతకంలో ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. హరినామ స్మరణ విశిష్టతను మాటిమాటికి తన పద్యాలలో వివరించారు.

**"హరినామ పీయూషమాను జిహ్వాలకెట్లు**
**రుచియించు లోకపురుచులగములు?**
**హరికథా మృతపాన పరవశమ్మున సొక్కు**
**వీనులకెందుకు వెట్టి కతలు?"[31]**

అనే ఈపద్యం ప్రహ్లాదుని స్ఫురింపజేస్తుంది, స్మరింపజేస్తుంది. ప్రహ్లాదుడు "మందార – మకరంద మాధుర్యమును గ్రోలు, మధుపంబు బోవునే మదనము లకు"[32] అనే పద్యంలో హరినామ మహిమను వివరించాడు. అలాగే విశ్వనాథ శర్మగారు హరినామ విశిష్టతను పైపద్యంలోనేకాదు ఇంకా అనేక పద్యాలలో వివరించారు.

**"కలిలోన తరియించు సులభసాధనమేది?**

**కేశవనామ సంకీర్తనమ్ము"[33]**

**"చిత్తమా! శ్రీకృష్ణ చింతించు మెప్పుడు**

**నాలుకా! చవిజూడు నామ సుధల"[34]**

**"సంపద జగమందు సంపదయేకాదు**

**నిజమైన సంపద నీ స్మరణము"[35]**

**"జీవుల సంసార సింధువున్ దాటింప**

**దేవ। నీ నామమే దివ్యనౌక**

**అజ్ఞాన తిమిరమ్ము నపనయిపంగ రమా**

**కాంత। నీ నామమే కాంతిరాశి"[36]**

అంటూ నామస్మరణ వైశిష్ట్యాన్ని వివరించారు. "సంకీర్త్య నారాయణ శబ్ద మాత్రం విముక్త దుఃఖాః సుఖినోభవన్తి"[37] అని విష్ణు సహస్రనామాలలో ఫలశ్రుతిగా వివరించారు. 'రామ' నామాన్ని జపించి తరించిన 'ఆంజనేయుడు' మనకు గొప్ప ఉదాహరణ. నామస్మరణచే తరించిన వారిలో నారదుడు, సనక సనందనాదులు నాటి వారయితే, నేటి మీరాబాయి, సక్కుబాయి, తుకారాం మొదలైన భక్తులు కోకొల్లలు. నామము యొక్క విశిష్టత తెలియచేయడానికి స్వయంగా శంకరాచార్యులు త్రిశతి, విష్ణుసహస్ర నామాలకు భాష్యాలు వ్రాశారు. అంతటి విశిష్టమైన నామస్మరణగూర్చి శర్మగారు చెప్పడమే గాదు నిరంతరం తాను ఆచరించేవారు. తనవారితోనూ చేయించేవారు.

ఈశతకంలో 'స్మరణం'తోపాటు మిగిలిన భక్తులు కూడా చిత్రించబడ్డాయి.

**"వీనులార! వినుడు విష్ణుకథలు"[38]**

**"గ్రంథమెట్టిదియైన గ్రంథమే కాదు నీ**

**ముచ్చట లేకున్న మోయఘనము"[39]**

**"హరికథా మృత పాన పరవశమ్మున సొక్కు**

**వీనులకెందుకు వెట్టికతలు"[40]**

అంటూ విష్ణుకథా 'శ్రవణం'యొక్క ప్రాధాన్యాన్ని వివరించారు.

**"ఆర్తి రక్షణ నీ నామ కీర్తనమ్ము**

**విశ్వజీవన సారము శాశ్వతమ్ము"[41]**

**"కరము నీనామకీర్తన పరులకెందు**

**కొరతయనునది లేదిహ పరములందు**

**జీవుడే నామ మహిమచే దేవుడగును"[42]**

స్వామిని 'కీర్తించడం'వల్ల కలిగే ప్రయోజనాలను వివరించారు.

**"చేరదీయుము నన్ను నింజేరునటుల**

**కారణము లేక గల్గనీ కరుణజూపి**

**నీదు పదపద్మములె నాకు నిల్వనెలవు"[43]**

గీ॥ **"ఆత్మ సుఖమును వీడి నీయాట కొరకు**

**పాత్రపోషణ జేసితి సూత్రధారి**

**విశ్రమించెద నీ పాదమాశ్రయించి**

**పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ॥"[44]**

అంటూ స్వామి పాదాల నాశ్రయించటంలో "పాదసేవనం" అనే భక్తిని స్ఫురింపజేశారు.

సీ॥ **"బుద్ధిరాధిక, నిత్య శుద్ధ। నీ వాత్మవు**

**ప్రాణాలు సహచర పటలినీకు**

**విషయభోగ మనుభవించుట పూజ,**

**దేహము నీవుండు దేవళమ్ము,**

**నిద్రయే నీ యోగనిద్రగా బరగును**

**గమనము నీ పరిభ్రమణమగును.**

**మాటలు స్తోత్రాలు మాధవా! సతమునే**

**జేసినవెల్ల నీ సేవలగును**

గీ॥ **ఏది మిగులును వేరుగ నాదియనగ**

**నీవె నేనైన జగమున నిక్కమరయ**

**సచ్చిదానందమయ నిత్యసత్య రూప**

**పరమ కరుణాంతరంగ। శ్రీపాండురంగ॥"[45]**

ఈ పై పద్యంలో అర్చనం, దాస్యం అనే భక్తులు స్ఫురిస్తున్నాయి.

సీ॥ "గోపబాలురతోడ గోవులమేపగా
చిరము బృందావనిం దిరుగువేళ
వ్రేతల యిండ్లలో వెన్న పాల్మీగడల్
దోచి నేస్తాల దిన్పించువేళ
దేవరాజల్గిన గోవర్ధనమ్మెత్తి
వ్రజపుర జనుల గాపాడువేళ
యమున యొడ్డున జేరి యమునలోపలదూరి
జలరాసలీలలు సలుపువేళ

గీ॥ చూచుభాగ్యమ్ము గల్గగా నోచనైతి
నాడురాదయ్యె జన్మము నేడుగల్గె
హరిహరీ! యెట్లు దర్శింతునయ్య నిన్ను
పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ॥"[46]

గోపబాలురతో బృందావనంలో తిరిగేవేళ, నేస్తాలకు దొంగిలించిన పాలు మీగడలు తినిపించే సమయంలో, గోవర్ధన పర్వతమెత్తి పురజనులను కాపాడే సమయంలోను యమునా తీరంలో రాసలీలలు జరిపిన సమయంలోను నేను పుట్టలేదే, మిమ్ములను చూసే భాగ్యానికి నోచలేదే అని చింతించారు. గోప బాలురు, స్నేహితుల 'సఖ్యత'ను గూర్చి వివరించి, 'సఖ్య భక్తి' పొందినవారి అదృష్టాన్ని స్మరించుకున్నారు.

గీ॥ "వెన్నదొంగను నోరార వేడుకొందు
నల్లనయ్యను మనసార నమ్మియుందు
వంగిమ్రొక్కెద చేతులారంగ నీకు
పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ!"[47]

గీ॥ "నా తరముగాదు మాధవ। పీతవసన।
చేతులారంగ సతతము జోతసేతు
ప్రీతి రక్షించి దరికినన్ బిలుచుకొనుము
పరమ కరుణాంతరంగ। శ్రీపాండురంగ॥"[48]

నల్లనయ్యా! నిన్నే మనసారా నమ్ముతాను, వేడుకుంటాను, చేతులారంగ నమస్కరిస్తాను. స్వామీ! ప్రీతితో రక్షించి, దగ్గరికి పిలుచుకొమ్మని 'వందన' భక్తిని వెల్లడించారు.

**సీ॥ "కటకటా! యొకసారి కలనైన నీరూపు**
**గననైతి కన్నుల కరవుదీర**
**యదుపతీ! యెపుడు నీ మృదు వేణుగానమ్ము**
**విననైతి వీనుల విందుగాక**
**శ్రీపాద! యెన్నడు నీపాదములసేవ**
**జేయనైతి నితర సేతలుడిగి**
**హరిహరీ। నీ దరహాసమ్ము దిలకించు**
**నోము లేనాడైన నోచనైతి**

**గీ॥ ఏమి సేయుదునయ్య నేనెందుబోదు**
**నీదె భారమ్ము నన్ను మున్నీటనైన**
**పాలనైనను ముంచు గోపాలదేవ**
**పరమ కరుణాంతరంగ। శ్రీపాండురంగ॥"[49]**

"స్వామీ! కలలోనైన నీరూపు చూడలేదే, ఒక్కసారైన నీవేణు గానం వినలేదే, నీ పాదసేవ అయినా చేయలేదే, నీ దరహాసాన్ని చూసే భాగ్యంలేదే, ఏమి చేసేది, ఎందు బోయేది, నీట ముంచినా, పాలముంచినా నీదే భారం" అంటూ "ఆత్మ నివేదనం" గావించారు శర్మగారు.

ఈవిధంగా నవవిధ భక్తి మార్గాలను తమ పాండురంగ శతకంలో సందర్భోచితంగా పొందుపరచారు.

తాను నమ్మిన దైవాన్ని తనలో, ప్రపంచంలో, ప్రతి దైవంలో కవి దర్శించారు. ప్రతిక్షణం దైవాన్ని స్మరించమని, నమ్మినవారికి "కోటిస్వర్గ సుఖాల కన్న మిన్న ఆనందాలు పాద సన్నిధిలో గలుగుతాయని"[50] భాగవతోత్తముడుగా విశ్వసించారు. "త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ"[51] మూడు సత్యాలలో అంటే కర్మ, భక్తి, జ్ఞాన మార్గాలలో కాని, వర్తమాన, భూత, భవిష్యత్కాలాలలోకాని జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలలోకాని భక్తి మార్గమే గొప్పది, శ్రేష్ఠతమమైనది. ఈ భక్తిలో మొదటి భక్తుడు, నేను పరమాత్మకు సంబంధించిన వాడను' అనుకోవడం, తర్వాత 'స్వామి తనకు చేరువయ్యాడ'ని అనుకోవడం మధ్యస్థాయి, అయితే చివరగా భక్తి పరాకాష్ఠ స్థితికి చేరినప్పుడు "నీవే నేను" అనుకోవడం ఉంటుంది. ఈ లక్షణాలన్నీ ఈశతకంలో గోచరిస్తున్నాయి.

గీ॥ **"కన్నబిడ్డను నీవుగాకున్న నెవరు**
**సాకువారలు భువిని నీసాటివారు**
**నీవెగనకున్న నాగతి నిండుసున్న**
**పరమ కరుణాంతరంగ। శ్రీపాండురంగ!"[52]**

నేను ఆ పరమాత్మకు సంబంధించిన వాడను అనే ప్రాథమిక దశ ఈపద్యంలో కన్పిస్తుంది.

గీ॥ **"నాస్తికులతోడ నేస్తమేనాడు వలదు**
**రక్షకుడవుండ నాకొండు రక్షవలదు**
**వలదు వలదేది నీకన్న వలదు వేఱు**
**పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ॥"[53]**

"విశ్రమింపుము నా హృదిన్ విమలచరిత" నేను నీవాడను అనే భావనలో భక్తుడు, భగవంతునికి మరికొంత చేరువకావటం ఈదశలో కన్పిస్తుంది.

**"నిఖిలమును నీవె శ్రీకృష్ణ! నేను నీవె"[55]**
**"నీవె నేనైన జగమున నిక్కమరయ**
**సచ్చిదానందమయ నిత్య సత్య రూప"[56]**

నీవే నేను అనే భావన భక్తి యొక్క తృతీయదశ – ఇక్కడ జీవాత్మ పరమాత్మల ఐక్యత జరుగుతుంది. 'భక్తి' మార్గాన్నే మోక్ష సామ్రాజ్యానికి రాజమార్గంగా ఎన్నుకొని ఈ శతకరచన చేశారు శర్మగారు.

## 8. పూర్వకవుల సంప్రదాయాన్ని పాటించడం

శర్మగారు 'పరమ కరుణాంతరంగ శ్రీపాండురంగ' అనే మకుటంతో శ్రీపాండురంగ శతకాన్ని 'శ్రీ రుక్మిణీసతీ' అంటూ మొట్టమొదటి పద్యాన్ని ప్రారంభించారు.

సీ॥ **"శ్రీ రుక్మిణీసతీ చిత్తనీరజ భృంగ**
**భవభంగ। సదపాంగ। పాండురంగ**
**శ్రీ రాధికాధార। శ్రితజన మందార।**
**ప్రణతార్తిహరణ। శ్రీపాండురంగ**

**శ్రీ గోపికా బృంద సేవ్య పాదద్వంద్వ**

**భక్తహృద్విహరణ। శ్రీ పాండురంగ**

**శ్రీ నందతనయ। బ్రహ్మానంద సాగర**

**పుండరీక వరద। పాండురంగ॥"**[57]

'శ్రీ'ని ప్రతిపాదంలో నిక్షిప్తం చేసి, చివరన 'పాండురంగ' అని ముగించారు. 'శ్రీ'తో కావ్యం ప్రారంభించడం మన సాహిత్య సంప్రదాయం మన ప్రాచీన కవులంతా నడిచిన మార్గమిది.

**సీ॥ "ప్రతియేట సమయాన పర్జన్యదేవుడు**

**కరుణించి వానలు గురియుగాక**

**పాడిపంటలతోడ గూడి భూదేవత**

**నిరతాన్నపూర్ణయై వరలుగాక**

**చీకు చింతలు లేక లోక జాలమునందు**

**చల్లని శాంతి వర్ధిల్లుగాక**

**పూర్ణాయురారోగ్యములు గల్గి జనులందు**

**హరిభక్తి కరమలరారుగాక**

**గీ॥ భావి మంగళదాయియై బరగుగాక**

**సౌఖ్యయుతమైన బ్రతుకులు సాగుగాక**

**రాధికానాథ। నీయనుగ్రహమువలన**

**పరమ కరుణాంతరంగ। శ్రీపాండురంగ॥"**[58]

అనే పద్యంతో చతుర్దశ భువనాలకు చల్లనిశాంతి వర్ధిల్లాలనే ఆకాంక్షతో శతకం ముగించారు. 'శ్రీ'తో ఆరంభించి మంగళంతో ముగించారు. ఈపద్యం నాటకాల్లోని భరత వాక్యంలాగా ఉంది.

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని'అనే ఆలంకారిక సంప్రదాయాన్ని కవి పాటించారు.

ఈశతకం ద్వారా కవిలో భక్తిభావం, వైయక్తిక మోక్షకాంక్షా భావమే కాక లోకహితకాంక్షా భావం ప్రస్ఫుటంగా ఉన్నట్లు చివరిపద్యం ద్వారా చెప్పవచ్చు.

భక్త్యా వేశంలో, భావజాలంతో, పదగుంఫనంలో, ధారాశుద్ధిలో, రచనా రామణీయకతలో, 'శ్రీపాండురంగ' శతకం పోతన భాగవతాన్ని చాలా వరకు,

ఆత్మభావ నివేదనలో ధూర్జటి శతకాన్ని కొంతవరకు పోలి ఉండడం కవియొక్క పూర్వకావ్య పరిజ్ఞానానికి, పాండిత్యానికి నిదర్శనం.

శర్మగారు ఈశతకంలో మకుటం, సంఖ్యానియమం, ఛందశ్శాస్త్ర నియమాలన్నీ పాటించారు. పూర్వ శతక లక్షణ సంప్రదాయాలన్నీ చక్కగా పాటించారు.

## 9. సాహిత్య తత్త్వం - ఆధ్యాత్మిక నేపథ్యం

విశ్వనాథ శర్మగారు ఈ శతకంలో నిత్యవాడుకలో ఉన్న సత్యాలను చక్కగా యిమిడ్చారు. "రోసినదొకనాడు రాసికెక్కు" "కలిమికి వెనువెంట గలదు లేమి", "బుద్ధిలో వింతలు బుట్టనపుడె", 'కాలుని గుండెలో జాలిలేదు', 'కన్నతల్లియె దయ్యమై యున్నయెడల డోల నమరించనెచ్చట వీలులేదు' 'పోయినపుడు వెంట పూచిక పుల్లయు, మచ్చుకైనను రానిమాట నిజము' 'అబ్బ వర్ణించగా నెవనబ్బ తరము' 'వెలుగు లేకున్నచో తొలగదు చీకటి, చీకటిలో వెల్గు చేరబోదు' అంటూ ఈవిధంగా ఎన్నో నిత్యసత్యాలను, నానుడులను పొందుపరచి పద్యాలకు నిండుదనాన్ని చేకూర్చారు.

చదివి అర్థం చేసుకొని ఆనందించటమే కాదు. చదువుతూ వుంటే మళ్ళీ మళ్ళీ చదవాలనే విధంగా పదప్రయోగం చేసి పఠితలను ఆనందింపజేయటం శర్మగారి రచనా విశిష్టతకు నిదర్శనం.

**సీ॥ "వాతగాదది బొగ్గుగీతగాదది చిక్కు**
**పోతగాదది నాదురాత దేవ!**
**కోతిగాదది సుప్పనాతిగాదది వేశ్య**
**మాతగాదది నాదు మనము స్వామి**
**రోతగాదది దాని తాతగాదది కాలు**
**దూతగాదది నాదు సేత తండ్రి**
**మోతగాదది గుండెకోతగాదది గొప్ప**
**ఘాతగాదది నాదు కామమభవ**

**గీ॥ నా తరముగాదు మాధవ। పీతవసన।**
**చేతులారంగ సతతము జోతసేతు**
**ప్రీతి రక్షించి దరికినన్ బిలుచుకొనుము**

**పరమ కరుణాంతరంగ। శ్రీపాండురంగ!"[59]**

ఈపద్యం మొత్తంలో ఇరవైనాలుగుసార్లు 'త'కారాన్ని ముప్పైరెండుమార్లు 'ద'కారాన్ని, పందొమ్మిది మార్లు 'గ'కారాన్ని ప్రయోగించారు. 'త'కారం వాయు బీజాక్షరం. ఇది వ్యాపకత్వాన్ని తెలుపుతుంది. 'ద'కార 'గ'కారాలు భూమి బీజాక్షరాలు. భూమి మీదుండే జీవులను సూచిస్తాయి. వ్యాపకత్వం భగవంతుని లక్షణం అంటే పరమాత్మ లక్షణం. భూలోకంలో ఉండడం జీవుని లక్షణం. ఈ భూమి మీదుండే జీవాత్మ పరమాత్మను చేరడానికి పరితపిస్తుంది. వేదన పడుతుంది. ఆ జీవుని వేదన ఈ పద్యంలో మనోహరంగా చిత్రించబడింది. "ప్రీతిరక్షించి దరికినన్ బిలుచు కొనుము" అని శర్మగారు పాండురంగని వేడుకోవడంలో "జీవుని వేదన" ప్రతిఫలిస్తూంది.

సాహిత్యపరంగా త,ద,గ అనే అక్షరాలు అనేకమార్లు ఆవృత్తి కావడంవల్ల ఈపద్యంలో 'అక్షర రమ్యత' చోటుచేసుకుంది. అక్షర రమ్యత సంగీత గుణం. అది శ్రవణ సుభగత్వాన్ని కలిగిస్తుంది. పద్యానికి శ్రుతి, లయలు కలిగించి మాటిమాటికి చదువాలనే కాంక్షను కలిగిస్తుంది. ఈ లక్షణాలన్నీ శర్మగారు రచించిన అనేక పద్యాలలో మనం గమనించవచ్చు.

**"విశ్వమోహన రూప। విశ్వవందిత పాద।**
**విశ్వార్తి హర। సర్వ విశ్వనాథ।"[60]**

ఈపద్యంలో 'విశ్వ' అనేపదాన్ని ఇరవై రెండుసార్లు ప్రయోగించి భగవంతుని సర్వవ్యాపకత్వాన్ని స్థిరీకరించారు. ఇలాంటి చమత్కారాలన్నీ భక్తి చోదకాలై, మోక్షసాధనకోసం శర్మగారు చేసిన 'అక్షర' తపస్సుగా మనం నిష్కర్షగా చెప్పవచ్చు.

'విశ్వనాథశర్మణా కృతిమిదం' అనే వాక్యంలోని ప్రతి అక్షరాన్ని క్రమంగా ప్రతిపాదం రెండవ అక్షరంగా సీసంలోను, మొదటి అక్షరంగా గీతంలోను ఇమిడ్చి పద్యరచన చేయడం మరో రచనా చమత్కారం.

**సీ॥ భా వి యెట్లున్నదో భావానికందదు**
**వి శ్వ మందున లేదు శాశ్వతమ్ము**
**శ్రీ నా థ నీపాద చింతన మొక్కటే**

వ్య థ ల బోకార్చు దివ్యానుభవము
ఆ శ కంతేలేదు హరిహరీ ప్రారబ్ధ
క ర్మ ము గుడువక కరిగిపోదు
ప్రా ణా లు సతతము భార్యాదులాపరు
సు కృ మే వెన్నంటి సుఖదమగును.

గీ॥ త గి న సమయము గడిచిన మిగులకుండ
మి తి యు దరిజేరె కృష్ణ! నాగతివినీవె
దం డ నెప్పుడు విడనాడకుండుమయ్య
పరమ కరుణాంతరంగ శ్రీ పాండురంగ[61]

విశ్వనాథుని స్మరణమనే యజ్ఞం చేయడం కోసం ఈశతకం రచింపబడిందని దీనిలోని అంతరార్థాన్ని బట్టి మనం గ్రహించవచ్చు.

మొత్తంమీద ఈశతకం వేదాంతభావనలు, వైరాగ్యభావనలు కలిగి ఉన్నా, భక్తికే అధిక ప్రాధాన్యం ఇవ్వటం వల్ల దీన్ని భక్తి శతకంగానే భావించవచ్చు. సరళ భాషా ప్రయోగంతో ద్రాక్షాపాకంలో సాగిన ఈ రచనలో అలంకారాలు రసోత్పత్తికి దోహదంగా నిలిచాయి.

సీ॥ ఆకలిబాధచే నార్చెడు వానికి
కూటిపై నుండెడు కూర్మిపగిది
పెరచోటికేగిన ప్రియుని రాకను గూర్చి
వేదనలొందెడు వెలదిభంగి
జలధరమ్ముల జూచి జలకణమ్ములనాన
కలవరపడు చాతకమ్ము రీతి
వెన్నలలంద్రావు వేడ్క వెన్నలరేని
రాకజూచెడు చకోరమ్ము మాడ్కి

గీ॥ కలవరించుచు నినుజూడ కలలుగనెడు
దీను నెడబాయ దగదయ్య దీననాథ
విడువకుండుము। నాదు హృద్వీథి నెపుడు
పరమ కరుణాంతరంగ! శ్రీపాండురంగ![62]

దయార్ద్ర హృదయుడవైన ఓ పాండురంగా! ఆకలిబాధతో ఉన్నవారికి అన్నం మీది ప్రేమలాగా, బయటకు వెళ్ళిన ప్రియునికోసం ఎదురుచూస్తూ, బాధపడే స్త్రీలాగా, మేఘాలను చూసి నీటిబిందువులను గ్రహించడానికి కలవరపడే చాతక పక్షిలాగా, చంద్రికలను తాగే చకోరం చంద్రుని రాకకోసం చూసే మాదిరిగా, నీదర్శనం కోసం కలవరించే ఈ దీనుని వదిలిపెట్టడం తగదు. నా మనోవీధిని వదలిపెట్టవద్దు.

భగవంతుని దర్శనం కోసం పరితపించే భక్తకవి అయిన శర్మగారు తన వేదనను సువ్యక్తం చేయడానికి నాలుగు ఉపమానాలను గ్రహించారు. వాటిలో మొదటి ఉపమానం అన్నంకోసం తపించే క్షుత్పీడితుడు. రెండోది తన ప్రియుని రాకకోసం మనోవేదన చెందే భార్య, మూడోది తన ప్రాణాలను నిలుపుకోవడం కోసం మేఘాలవైపు చూస్తూ వాన చినుకుల కోసం కలవరపడే చాతకపక్షి (వానకోయిల), నాలుగోది వెన్నెలను తాగడం కోసం చంద్రుని రాకకోసం ఎదురుచూసే చకోరపక్షి (వెన్నెలపురుగు).

ఈపద్యాన్ని, దీనిలో కవివాడిన ఉపమానాలను, ఆ ఉపమానాలలోని వస్తువును పరిశీలిస్తే 'భృగువల్లి' (తైత్తిరీయోపనిషత్తు)లోని వృత్తాంతం మనకు స్ఫురిస్తుంది. మొదటి ఉపమానంలో 'అన్నం' కోసం ఆరాటం, రెండోదానిలో 'మనో' వేదన, మూడోదానిలో 'ప్రాణం' నిలుపు కోవడం కోసం వానకోయిల తపన, నాలుగో దానిలో 'వెలుతురు'ను (జ్ఞానం) ఆస్వాదించడం కోసం వెన్నెల పురుగు వేదన – అనే వస్తువులు కనిపిస్తున్నాయి.

జీవుడు భగవంతుని దర్శనంకోసం ఒక్కొక్క మెట్టును అధిగమిస్తూ భగవత్స్వ రూప దర్శనానుభూతిని పొందడం 'భృగువల్లి'లోని వృత్తాంతం. పై పద్యంలో ఆ క్రమం స్పష్టంగా కనిపిస్తుంది. మొదట జీవులకు అన్నమే ప్రధానం కావున అదే భగవత్స్వరూపంగా భావింపబడింది. "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" మానవుని సంకల్ప వికల్పాలన్నిటికీ మనస్సే మూలకారణం మనస్సే జీవులకు ప్రధానం కాబట్టి అదే భగవత్స్వరూపంగా భావింపబడింది" "మనో బ్రహ్మేతి వ్యజానాత్"[64] అలాగే ప్రాణాలు "ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్"[65] తర్వాత "విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్"[66] భగవంతునిగా భావించబడ్డాయి. చివరగా "ఆనందో బ్రహ్మేతి

వ్యజానాత్"[67] ఆనందమే బ్రహ్మగా చెప్పబడింది. కవీశ్వరుడు ఆ భగవంతుని కోసమే తపిస్తున్నానని ఈపద్యంలో చెప్పుకున్నారు.

**"కలవరించుచు నినుజూడ కలలుగనెడు**
**దీనునెడబాయదగునయ్య దీననాథ!"**

ఇలా కవివాడిన ఉపమానాల్లో ఉపనిషత్సారాన్ని ప్రతిఫలింపచేస్తూ రచించడంవల్ల ఆయన రచనల ప్రామాణికతను మరింత పెంచాయి.

**సీ॥ "భక్తితో నొసగిన పత్రమైనను గొని**
**తినలేదె? ద్రుపదుని తనయకొరకు,**
**ఆర్తితో కుసుమమ్ము నర్పించి మొరలిడ**
**రాలేదె? వే కరిరాజు కొరకు,**
**పండు దినుటెగాదు పై పొట్టు సైతము**
**మ్రింగలేదే? విదురాంగన కయి,**
**నోరూర బుడిశెడు నీరమున్ గైకొని**
**త్రావలేదే? రంతిదేవు కొరకు,**

**గీ॥ ఏమిగని యారగించితో శ్యామలాంగ**
**అట్టి ప్రేమను భిక్షగా బెట్టుమయ్య**
**జోలెసాచితి నీముందు జాలితోడ**
**పరమ కరుణాంతరంగ! శ్రీపాండురంగ!"[68]**

స్వామికి, ప్రేమతో పత్రం, పుష్పం, ఫలం, తోయం ఏది ఇచ్చినా స్వీకరిస్తాడని భగవద్గీతలో

**శ్లో॥ "పత్రం పుష్పం ఫలం తోయం। యో మే భక్త్యా ప్రయచ్ఛతి।**
**తదహం భక్త్యుపహృతం। అశ్నామి ప్రయతాత్మనః॥"[69]**

ఈ శ్లోకంలో శ్రీకృష్ణపరమాత్మ వివరించారు.

భాగవత కథలలో భక్తులదగ్గర స్వీకరించి నిరూపించాడు. ఆ భావాన్ని శర్మగారు ప్రతిపాదంలా ఒక కథాంశాన్ని జోడించి, భగవంతుని ప్రేమతత్త్వాన్ని వివరించాడు.

**సీ॥ "కరము జీవుల ముఖ్య కర్తవ్య మెయ్యది?**
**మానవాళికి మంచి మార్గమేది?**
**విడువక దయతోడ వెంట వచ్చునదేది?**
**సతతము మారని సౌఖ్యమేది?**
**మధురాతి మధురము మంగళకరమేది?**
**వేదసారమ్మైన వేద్యమేది?**
**సాధువులెప్పుడు చాటిచెప్పునదేది?**
**భావనానంద సద్భావమేది?**

**గీ॥ కృష్ణ భజనము, ధ్యానము, కృష్ణభక్తి**
**కృష్ణ సౌఖ్యము, కృష్ణుడు, కృష్ణమహిమ**
**కృష్ణనామము, జగమంత కృష్ణమయము**
**పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ।"[70]**

మానవాళికి ముఖ్యకర్తవ్యం మంచిమార్గం, వెంటవచ్చేది, శాశ్వతసుఖం, మధురం మంగళకరం, వేద్యం (తెలియదగినది), సాధువులు చాటిచెప్పేది, సద్భావం ఏది అని ప్రశ్నించుకొని దానికి సమాధానంగా క్రమంగా కృష్ణభజనం, ధ్యానం కృష్ణభక్తి, కృష్ణసౌఖ్యం, కృష్ణుడు, కృష్ణమహిమ, కృష్ణనామం, జగమంతా కృష్ణమయం అనే వాటిని చెప్పారు కవి. క్రమాలంకారంలో ఈపద్యం ఉంది. ప్రశ్నలు, సమాధానాల క్రమంలో భక్తి తత్త్వం యొక్క ఉత్తరోత్తరాధిక్యం సూచింప బడింది. భక్తి పరాకాష్ఠ క్రమపద్ధతిలో చిత్రింపబడింది. కృష్ణ భజనంతో ప్రారంభ మైన భగవద్భక్తి జగమంతా కృష్ణమయం అనే భావం దృఢపడడంతో పరాకాష్ఠ నందింది.

**సీ॥ "కోటి స్వర్గాలైన కొరగావు నీపాద**
**సన్నిధిలోగల సౌఖ్యమునకు,**
**శరదిందు శతకోటి చంద్రికల్ గూడిన**
**సమమె? నీ దరహాస సరణికెపుడు,**
**మల్లెగులాబీలు మొల్లలు జాలవు**
**కొల్లలైనను నీదు కోమలతకు,**

**ప్రేమలన్నియు గూర్చి పేర్చిన హేయముల్**
**నీభక్త వాత్సల్యనిధికి ముందు,**
**గీ॥ స్వామి! నీదివ్య మహిమాతిశయము బొగడ**
**ధాతయైనను జాలడు నా తరంబె?**
**తత్పదార్థ స్వరూప। రాధా సహాయ।**
**పరమ కరుణాంతరంగ। శ్రీ పాండురంగ!"[71]**

స్వామివారి పాదసన్నిధి కోటి స్వర్గాలకన్న మిన్న అని, అతని నవ్వుకు శరత్కాల చంద్రికలు శతకోటి అయినా సమానం కావని, కోమలతలో మల్లె గులాబీ, మొల్లలు సాటిరావంటూ ఈ పద్యంలో ప్రకృతి పురుషులను చిత్రించి పురుషునివల్ల ఏర్పడ్డ ప్రకృతి అతనితో సమానంకాదనీ, ప్రకృతిలోని గుణాలన్నీ పరమాత్మ ప్రసాదించినవేయని ధ్వనింప జేస్తూ "తత్పదార్థ స్వరూప రాధా సహాయ" అని ప్రకృతి పురుషతత్త్వాన్ని విశదీకరించారు.

ఈ శతకంలో ఆధ్యాత్మిక నేపథ్యం కలిగిన అనేక అలంకారాలను కవి ప్రయోగించారు. వాటిలో ఆయన సాహిత్య తత్త్వం గోచరిస్తుంది. పైన వివరించి నవి కాక మిగిలిన అలంకారాలు : రూపకం (53ప), ఉల్లేఖ (23ప, 40ప, 45ప, 63ప, 82ప), క్రమ (24ప, 25ప), వ్యతిరేక (17ప, 22ప), పర్యాయోక్తి (6ప, 21ప), సందేహ (34ప, 36ప), లోకోక్తి (60ప, 71ప, 77ప), ఉదాత్త (31ప), కారణమాల (26ప, 28ప, 49ప), సారా (94ప), స్మృతి (2ప, 55ప, 56ప).

ఇందులో అర్థాలంకారాలకు ఎంత ప్రాధాన్యమిచ్చారో, శబ్దాలంకారాలకూ అంతే ప్రాధాన్యం ఇచ్చారు. అనుప్రాసాలంకారంలోని వృత్త్యనుప్రాస, అంత్యాను ప్రాస మొదలగునవి ఉపయోగించటంవల్ల పద్యం మాటిమాటికి చదవాలనే ఆసక్తి కలుగుతుంది.

## 10. ఫల పుష్ప సమర్పణం :

పాండురంగనికి తన పద్యమాలికలలో పుష్పాలను ఫలాలను సమర్పించారు శర్మగారు. 'పత్రం, పుష్పం, ఫలం, తోయం, ఇందులో ఏదైనా ప్రేమతో సమర్పిస్తే నాకు అత్యంత ప్రీతిపాత్రమని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ స్వయంగా చెప్పారు. దాన్ని యథాతథంగా ఆచరించారు శర్మగారు.

"శత పుష్పార్చన (నామ)లో సహజంగా భక్తులు ఒకేరకం పూలతో అర్చన చేస్తారు. కాని శర్మగారు ఒక్కొక్క నామానికి ఒక్కక్కరకం పువ్వును ఎంచుకొని వాటిని మాలగా చేసి స్వామికి సీసపద్యమాలికగా"[72] అర్పించారు.

ప్రకృతంతా పరమాత్మ స్వరూపం. ఈ ప్రకృతిలో ఉన్న పదార్థాలన్నీ ఆ పాండురంగనివే. కాబట్టి అన్నీ అతనికే చెందాలని కవి కాంక్ష.

సీసపద్యమాలికలో 100 పూలపేర్లున్నాయి. హృదయాన్ని శతపద్మంగా భావించారేమొ! ఇందులో విష్ణుక్రాంత, సీమతురాయిలు, పట్టుపూలు, పంచపాండవులపూలు, శ్రీరామ గుచ్ఛాలు, నందిమల్లెలు, కొండగోగులు మొదలైన పుష్పాలతోపాటు చివరలో "భావ పుష్పము గలిగి పారిజాతము తోడ నూరుపూలు'' అంటూ పద్యం ముగించారు. అన్ని పూవులను కూర్చి పాండురంగనికి అర్పించారు.

**గీ॥ "దీనమందార ప్రేమ భావానముంచి**
**పూజకై కూర్చి తెచ్చితి - పూలమాల**
**ముదముతో - నందుకోవయ్య - సదయహృదయ**
**పరమ కరుణాంతరంగ - శ్రీ పాండురంగ"[73]**

ఇక్కడ పూలను కోసి తెచ్చి సమర్పించాను అని కవి అనలేదు. ఎందుకంటే అన్నిపూలు ఒకే దగ్గర దొరకడం అసాధ్యం. మరి సమర్పించానని భగవంతునికి అబద్ధం చెప్పకూడదు. కాబట్టి "ప్రేమ భావాన ముంచి పూజకై కూర్చితెచ్చి" అని చెప్పుకున్నారు. భావనకు అందని పూవు లేదు. కావున స్వామి పాదాల చెంత నూరు పూవులు చేరినట్టే.

''ఫలాలను సమర్పించేటప్పుడు సీసం (ఏడు) వరుసల గీతంలో అందించారు. ఇందులో ముప్పైమూడు పండ్లను పేర్కొన్నారు."[74] అందులో ఖర్జూర, సపోట, బొప్పాయి, దోసపండు, కమల, అనాస మొదలైన పళ్ళను, ప్రేమ భావంతో అర్పిస్తున్నాను. ప్రేమవిందు ఆరగించమని వేడుకున్నారు. ప్రేమగా ఏమి ఇచ్చినా భగవంతుడు స్వీకరించి, సంతోషిస్తాడు. కాబట్టి భక్తి భావంతో, ప్రేమభావంతో పాండురంగనికి ప్రేమవిందు ఇచ్చారు కవి.

ఇలా భక్తి, ఆధ్యాత్మిక పరిమళాలు కలిగిన పద్య సుమాలతో భగవంతుని అర్చించి ఆయన అనుగ్రహానికి పాత్రులయ్యారు శర్మగారు. ఆయన భౌతికంగా చేసిన మానవసేవతో పాటు కవిగా చేసిన సాహిత్య సేవకూడా మాధవుని సేవకు తోడ్పడి ఆయన ఇహ పరాలు ఫలవంతమై ధన్యజీవి అయ్యారు. జీవుడు భగవంతుని చేరడానికి, ఆత్మ పరమాత్మలో లీనం కావడానికి పడిన వేదనంతా పాండురంగ శతకంగా రూపొంది, మానవ జీవన గమ్యాన్ని సూచించింది. ఇదే పాండురంగ శతకంలోని పరమార్థం.

## జ్ఞాపికలు

1. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల తృతీయముద్రణ పీఠిక
2. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 1,2 - పుట 1
3. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 1,2 - పుట 1
4. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 55 - పుట 28
5. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం57,58 - పుట 29
6. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 57,58- పుట 29
7. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 63 - పుట 32
8. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 74 - పుట 37
9. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 91 - పుట 46
10. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 56 - పుట 28
11. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 57 - పుట 29
12. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 40 - పుట 20
13. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 36 - పుట 18
14. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 66 - పుట 33
15. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 94 - పుట 47
16. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 31 - పుట 16
17. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 65 - పుట 33
18. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 90 - పుట 45

19. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 57 - పుట 29
20. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 82 - పుట 41
21. వివేకచూడామణి : ఆదిశంకరాచార్య శ్లో 20 - పుట 19
22. వివేకచూడామణి : ఆదిశంకరాచార్య శ్లో 471 - పుట 173
23. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 74 - పుట 37
24. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 69 - పుట 35
25. శ్రీమద్భగవద్గీత : మోక్షసన్న్యాసయోగము శ్లో 61 - పుట 216
26. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 71 - పుట 36
27. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 77 - పుట 39
28. వివేకచూడామణి : ఆదిశంకరాచార్య శ్లో 465 - పుట 171
29. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 73 - పుట 37
30. శ్రీ భాగవతమ్ : వేదవ్యాసకృతం శ్లో 23 - పుట 91
31. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 79 - పుట 40
32. శ్రీ మదాంధ్రభాగవతము : పోతన, బమ్మెర, సప్తమస్కంధము -
పద్యం 150 - పుట 515
33. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 24 - పుట 12
34. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 21 - పుట 11
35. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 52 - పుట 26
36. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 80 - పుట 40
37. శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రం : ఫలశ్రుతి శ్లో 32 - పుట 32
38. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 24 - పుట 12
39. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 52 - పుట 26
40. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 79 - పుట 40
41. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 30 - పుట 15
42. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 80 - పుట 40
43. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 44 - పుట 22
44. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 26 - పుట 13
45. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 20 - పుట 10
46. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 14 - పుట 7
47. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 67,68- పుట 34
48. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 67,68- పుట 34
49. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 47 - పుట 24

50. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 17 - పుట 19
51. నారదభక్తి సూత్రములు : హిందీమూలము - హనుమాన్ ప్రసాద్ పోద్దార్, ఆంధ్రానువాదము - ఉదయభాస్కరమ్, బులుసు సూ.81 - పుట 218
52. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 43 - పుట 22
53. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 75 - పుట 38
54. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 82 - పుట 41
55. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 57 - పుట 29
56. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 20 - పుట 10
57. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 1 - పుట 1
58. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 100 - పుట 50
59. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 67 - పుట 34
60. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 85 - పుట 43
61. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 99 - పుట 50
62. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 42 - పుట 21
63. ఉపనిషద్దర్శనము : తైత్తిరీయోపనిషత్, భృగువల్లి - అనువాకం 2, పుట 55
64. ఉపనిషద్దర్శనము : తైత్తిరీయోపనిషత్, భృగువల్లి - అనువాకం 4, పుట 57
65. ఉపనిషద్దర్శనము : తైత్తిరీయోపనిషత్, భృగువల్లి - అనువాకం 3, పుట 56
66. ఉపనిషద్దర్శనము : తైత్తిరీయోపనిషత్, భృగువల్లి - అనువాకం 5, పుట 58
67. ఉపనిషద్దర్శనము : తైత్తిరీయోపనిషత్, భృగువల్లి - అనువాకం 6, పుట 59
68. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 45 - పుట 23
69. శ్రీమద్భగవద్గీత : రాజవిద్యా రాజగుహ్యయోగము-శ్లో26, పుట 119
70. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 25 - పుట 13
71. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల పద్యం 19 - పుట 9
72. శ్రీ పాండురంగ శతకము (వ్రాతపతి) - విశ్వనాథశర్మ, అప్పాల - 100 పూలపేర్లతో వ్రాసిన పద్యం
73. శ్రీ పాండురంగ శతకము (వ్రాతపతి) - విశ్వనాథశర్మ, అప్పాల - 100 పూలపేర్లతో వ్రాసిన పద్యం
74. శ్రీ పాండురంగ శతకము (వ్రాతపతి) - విశ్వనాథశర్మ, అప్పాల - పండ్లపేరుతో వ్రాసిన సీసపద్యం

# 5. శ్రీ శివలింగ విలాసాది శతకాలు - తత్త్వానుశీలనం

## 1. శ్రీ శివలింగ విలాసం - భక్తి ప్రచార కలాపం

'విలాసం' అనే పదానికి అర్థం – క్రీడ, ఆట, వినోదం. సచ్చిదానంద స్వరూపుడగు శివుడు అంతటా ఉన్నాడు. అడుగడుగునా భగవంతుడు ఉన్నాడు. ప్రతి హృదయంలో, ప్రతిచోటా శివుడున్నాడు. ఆయన సర్వాంతర్యామి అని, ఈ సృష్టి అతనికొక విలాసమని కవి ఈ శతకంలో వ్యక్తపరిచారు.

శ్రీ మదాంధ్ర భాగవతంలో "ఇందుగలడందులేదని ...."[1] అనే పద్యంలో భగవంతుడు అంతటా ఉన్నాడని వివరించాడు పోతన. ఇక్కడ కూడా దాన్ని అన్వయించుకుంటే మనమెక్కడ ఉంటే అదే కాశీక్షేత్రం, శివక్షేత్రమని భావించవచ్చు.

విశ్వనాథశర్మగారు కూడా తాను నమ్మిన దైవాన్ని అంతటా దర్శించారు. అందరికీ ఆ దైవాన్ని దర్శింపచేయడం కోసం ఒక ప్రయత్నంగా 'శతరుద్రం' అనే కార్యక్రమం చేపట్టి ఒక్కొక్క గ్రామంలో భక్తులతో అభిషేకం ఉచితంగా చేయించారు.

ఏ గృహంలో శతరుద్రాభిషేకం నిర్వహించారో ఆ గృహస్థునికి, ఆ ఊరికి మంచి జరగాలని ఆశీర్వదించి, శివునికోసం ఒక మంగళహారతిని, ఒక ఉత్పలమాల పద్యాన్ని రచించి ఆ స్వామికి తనవంతుగా శర్మగారు సమర్పించారు. ఈవిధంగా 105 పద్యాలను, 105 మంగళహారతులను ఆయన పూర్తి చేశారు.

పత్రం, పుష్పం, ఫలం, తోయం అనే ఈ నాలుగింటిలో భక్తులు తోయం, పత్రం, ఫలం అందిస్తే అక్షర ఉత్పలాలను కవీశ్వరుడు 'చంద్రశేఖరా' మకుటంతో అందించారు.

'మకుటం' 'చంద్రశేఖరా!" స్వీకరించిన ఛందం ఉత్పలమాల. చంద్రునికి – కలువకు దగ్గరి సంబంధం. చంద్రునికి శివునికి మరీ దగ్గర సంబంధం. శివుడు చంద్రుని ధరించి ఆనందిస్తుంటే ఆ చంద్రకిరణాలతో ఉత్పలాలు శివుని చేరి వాడకుండా ఉండి ఆనందిస్తాయి. ఎందుకంటే శివుని జటాజూటంలో చంద్రుడు

ఎల్లప్పుడు ఉంటాడు. ఈ ఉత్పలమాలకు కావలసినది చంద్రకాంతి. చంద్రకాంతి ఉన్నంతవరకు ఉత్పలం విచ్చుకొని వాడకుండా ఉంటుంది.' (శివలింగ విలాస పీఠికలో దోర్బల విశ్వనాథశాస్త్రి వివరణ) ఇంత అర్థం మనసులో ఉంచుకొని 'చంద్రశేఖరా!' అనే మకుటాన్ని గ్రహించారు కవి. శివా! అజా! అంటూ సహస్ర నామాలున్న శివునికి 'చంద్రశేఖరా!' అనే పదం మకుటంగా గ్రహించడంవల్ల చివర ర,వ గణాలు వస్తాయి. అది ఉత్పలం అవుతుంది. ఇలా ఉత్పలాన్ని శివుని అర్చనకు శర్మగారు ఉపయోగించుకున్నారు.

ఈ శివలింగ విలాసంలో ఊరిపేర్లను కూడా పద్యాలలో అర్థం చెడకుండా ఇమిడ్చి సమర్థతతో రచన చేశారు కవి.

**"ఎంతని విన్నవింతు కడుహేయపు - సంసృతి బాధలో శివా**
**చింతల తోడనెప్పుడును - చిత్తము తత్తరమొందుచుండు - ని**
**శ్చింతగ నీదు పాదముల చెంతకు చేరుట ఎప్పుడయ్య - మూ**
**డ్చింతల పల్లివాస - సురసేవ్య పదద్వయ చంద్రశేఖరా!"**[2]

ఈ పద్యంలో 'మూడుచింతలపల్లి' అనే పేరును - బిందు పూర్వక 'త'కార ప్రాసనువేసి అందంగా, భావయుక్తంగా రచించారు.

**అ). మత సామరస్యం**

**ఉ. "పాయకనైదుమార్లు తమ పద్ధతి తోడ నమాజు పేర - న**
**ల్లాయని యగ్బరంచు ఘనరాగముతో నెలుగెత్తి నిత్యమున్**
**మాయని దీక్షతో ముసలు మానులు గొల్చెడు దేవుడీవె య**
**ల్లాయగు నీకు మాటికి సలామొనరించెద చంద్రశేఖరా!"**[3]

'అల్లా హో అక్బరు' అని ముస్లిములు ప్రార్థిస్తారు. ఆ ప్రార్థనలో ఈశ్వరుని కవి దర్శించారు. ఏ రూపంలో కొల్చినా భగవంతుడు ఒక్కడే. అలాగే హిందూ ముస్లిములు అంతా ఒక్కటేనని భావాన్ని స్ఫురింపజేశారు. సర్వమత సమత్వ భావన ఈశతకంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. రామకృష్ణ పరమహంస లాంటి (సెక్యులరిస్ట్) భక్తుడు శర్మగారు.

## ఆ). అద్వైత భావ ప్రాధాన్యం

శర్మగారు అద్వైత తత్త్వాన్ని ఈశతకంలో చక్కగా ప్రతిపాదించారు. హరిహరులకు ఒక్కటిగా మనోహరంగా చిత్రించారు.

**“నామదిలోన కాపుర మనారతముండుము దివ్యచిద్ఘన**
**శ్యామ శరీరివై మురళి చల్లగ నూదుచు రాధికమ్మతో**
**మోమున మందహాస నవమోహిని కీడుగ నోరచూపుతో**
**శ్రీ మరుకూకు వాస ‘గుణశీల’ దయాకర। చంద్రశేఖరా!”[4]**

ఇందులో పాండురంగని శివునికి అభేదం కల్పించి వర్ణించారు. ఇలాగే శ్రీరాముని కూడా చంద్రశేఖరునిలో దర్శించారు చూడండి.

**“తారకరామ రూపమున తమ్ములు మారుతిగొల్వ సీతతో**
**కూరిమి నల్లివాదపురి కోవెలలో నివసించి హాయిగా।**
**కోరినతోడనే జనుల కోరిక దీర్తువనంగవింటి వే**
**సారక మాదు సేవలకు సంతస మొందుము చంద్రశేఖరా!”[5]**

అల్లివాదపురిలో శ్రీరామాలయంలోని రామునిలో శివుని దర్శిస్తూ స్తుతించారు. శివకేశవారాధన ఒకే కాలంలో చేయుడంవల్ల ఆయున హరిహరాద్వైతి. అద్వైతి.

## ఇ). శివతత్త్వ ప్రదర్శనం

శర్మగారు సరళశైలిలో చక్కటి ఉపమానాలతో, లోకోక్తులతో శివతత్త్వాన్ని శ్రీశివలింగ విలాసంలో అందించారు.

**“గోట దొలంగు దానికయి గొడ్డలితో పనిలేదు ప్రేమతో**
**సూటిగ నింపమైన మము జూచిన జాలును దీనబాంధవా**
**నేటుకు వచ్చి మాయెదుట నిత్యము దర్శనమిమ్ము కోపమా?**
**చాటుగ నుండ నేటికి కుశాయిగుడెమ్మున చంద్రశేఖరా!”[6]**

‘గోట పోయెడి దానికి గొడ్డలెందుకు’ అనే సామెతను గూర్చి కుశాయిగూడ చంద్రశేఖరుని వర్ణించారు పైపద్యంలో.

శివనామ స్మరణ విశిష్టతను వివరిస్తూ రచించినదీకింది పద్యం

**"పావనమైన నీ పతితపావన నామ సుధా ప్రవాహసం**
**సేవన మొక్కటే సకల జీవుల లీలగ నుద్ధరింపగా,**
**కేవల దివ్య సాధనము క్లేశహరమ్ము సుఖమ్ము కాననా**
**జీవనమంత నీ స్మరణ జేసి తరింతును చంద్రశేఖరా!"**[7]

శబ్దార్థాలలో శివ, కేశవులను ప్రదర్శించారు శర్మగారు. శబ్ద సంయోజనంలో రాముడు, అర్థంలో శివుడు స్ఫురించేటట్లుగా చక్కటి ప్రయోగం చేశారు.

**"రా। మదనాంతకా। తలపరా మముఁబ్రోవగ - దిక్కునీవె - రా**
**రా।మల బిడ్డతో నతి విరామము సేయక మౌని భావనా**
**రా।మ విహార కోరితినిరా-మ నసారగ - నిన్ను జేరగా**
**రా।మవరేశ। పావన కరా మద వారక - చంద్రశేఖరా!"**[8]

'రామ' అనే నామాన్ని ఎనిమిదిసార్లు శబ్దరూపంలో ప్రయోగించి, శివుని (రామశబ్దంతో మేళవించి) ఆర్తిగా రా - మదనాంతకా, రా - మ ముఁబ్రోవగ, రా - మలబిడ్డతో - గిరిజతో రమ్మని, విరామము లేక, మౌని భావనలో విశ్రాంతి తీసుకొనే శివా - రా మనసారగ రామవరేశ రా - మదవారక అంటూ స్వామిని భక్తితో ఆర్ద్రంగా ఆహ్వానించారు.

తెలుపు రంగు జ్ఞానానికి ప్రతీక. శివుడు శుద్ధ స్ఫటిక సంకాశుడు. ఆయన సుఖాన్ని, జ్ఞానాన్ని కలిగిస్తాడనే భావాన్నిచ్చే పదాలలో స్వామిని నుతించారు కవి.

**"తెల్లనివాడవీవు తెలతెల్లగ ఫాలమునందు భూతియున్**
**తెల్లని చందమామ కడుతెల్లని చల్లని గంగకొప్పునన్,**
**తెల్లని నందిపై దిరుగు దేవుడవీ విల తేటతెల్లమే**
**చల్లగ మమ్ముగావ గిరిజాహృదయేశ్వర! చంద్రశేఖరా!"**[9]

తెల్లని శివునికి తెలుపు వస్తువులను అలంకరించిన శర్మగారు గిరిజాహృదయేశ్వర! అనే సంబోధన పదంలో కూడా తెలుపును అంతరార్థముగా చెప్పారు. గిరి - హిమగిరి - తెల్లనిది. హిమగిరి పుత్రికను గిరిజా! అని సంబోధించారు. గిరిజా హృదయేశ్వరుడైన శివుని, శివతత్త్వాన్ని ఈపద్యంలో తేటతెల్లం చేశారు శర్మగారు.

"నమఃశివాయ" (శివుని కొరకు నమస్కరిస్తున్నాను) అనే దానిలో 'నమ' అనే రెండు అక్షరాలు గ్రహించి శివునికి ఉత్పలమాలను సమర్పించారు.

ఉ : **"నేమము నూనినాను మును నిన్ను మనమ్మున నమ్మినాను నీ**
**నామము నెన్ని నేను మననమ్మున నున్న ననన్న? మౌనమా?**
**నేమన నిన్ను మాని నినునేమన మిన్నున నున్న నామి। న**
**న్నోము మనన్న మానమున నోముము నెమ్మిని చంద్రశేఖరా!"[10]**

ఈవిధంగా 'న' 'మ'లతో 'ద్వ్యక్షరి'ని రచించి, చమత్కారంగా శివుని అర్చించారు.

ఈశతకంలో స్వామి రూప లావణ్యాదులను, గుణాలను, దయను, స్వామి పరివారాన్ని, మనోహరంగా చిత్రించారు. ఆ చిత్రణలలో సమాసాలు, పదాలు, ఊరిపేర్లు, శబ్దాలంకారాలు ఉత్పలంలోని రేకులైతే, కర్ణికలాగా భక్తిని కూర్చి శివుడికి అర్పించారు.

ఏ పద్యానికి ఆపద్యం విశిష్టంగా ఉంది. ఈ శతకంలో స్వామిని స్తుతిస్తూ, చక్కటి పలుకుబడులను, సామెతలను, వేదాంత సారాన్ని నిత్య సత్యాలను పొందుపరచారు.

ఈ శతకంలో శర్మగారు దుష్కరప్రాసను ఎక్కువగా ఉపయోగించారు.

**"అర్థుల నాదరించి సకలార్థములిత్తువు నిన్ను నమ్మి ని**
**స్వార్థత గొల్చువారలకు సర్వము నిత్తువు భక్తవత్సలా**
**పార్థుని సేవలందుకొని పాశుపతాస్త్రము నిచ్చినట్లు – శ్రీ**
**పార్థివ లింగరూప। భవపాశవిమోచక। చంద్రశేఖరా!"[11]**

'ర్థ' ప్రాసను కూర్చుకొని శ్రీ పార్థివ లింగరూపుడైన శివుని స్తుతించారు.

**"కర్తవు భోక్తవీవు భవకారణ కారణ మీవహో? జగ**
**ద్భర్తవు హర్తవీవు పరిపాలన శీలుడవీవు జీవ హృ**
**ద్వర్తివి నీకు మ్రొక్కెద నివారణ సేయుమఽ సద్భయమ్ము చే**
**వర్తి నివాస। భక్త వశ వర్తివి కావున చంద్రశేఖరా"[12]**

'ర్త' ప్రాసతో జీవహృదయాలలో నివసించేవాడివి, కర్తవు, భర్తవు, భోక్తవు, హర్తవు, చేవర్తి నివాస భక్తవశవర్తివి అని విశ్వనాథుని స్తుతించారు.

**"వర్ణము శుద్ధధావళ మపర్ణకు నచ్చిన రూపురేఖలున్**
**పర్ణమొ నీర మోయొసగి భక్తులు గొల్చిన ముక్తినిచ్చు నిన్**
**వర్ణన సేయ వేదములు పారముగాంచక మూగవోయె గో**
**కర్ణమయాఽఽత్మ లింగ! నినుగాంచుటె భాగ్యము చంద్రశేఖరా!"[13]**

'ర్ణ' ప్రాసతో వ్రాసిన ఈపద్యంలో వేదాలే శివుని వర్ణించలేక మూగవోయాయి అని శర్మగారు గోకర్ణేశ్వరుని వర్ణించారు.

ఈవిధంగా అనేక పద్యాలలో దుష్కర ప్రాసను వాడారు కవి. దుష్కర ప్రాస వాడినా పద్యధారలోగాని, భావప్రపంచంలోకాని ఎలాంటి క్లిష్టత కనిపించదు.

## 2. నామస్మరణ శతకం - ముక్తి గమ్య బోధకం

**"హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం**
**కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా"[14]**

కలియుగంలో హరినామ సంకీర్తనం కంటే తరుణోపాయం వేరొకటి లేదు. భగవద్భక్తి పరాయణులైన వారు ప్రతిక్షణం భగవన్నామాన్ని ఉచ్చరిస్తూ ఉంటారు.

నాదబ్రహ్మ త్యాగరాజు "తెలిసి రామచింతనతో నామము సేయవే ఓ మనసా"[15] అని కీర్తించాడు. భక్తిమార్గంలో ఇంద్రియ నిగ్రహం సులభంగా సాధ్య మౌతుంది. మనసులో భగవద్భక్తి వృద్ధిపొందిన కొద్దీ విషయ భోగాలు నిస్సారంగా తోస్తాయి.

నిరంతర భగవన్నామ స్మరణవల్ల సమస్త పాపాలు, కామ క్రోధాలు నిర్మూలమై, వాంఛలన్నీ అదృశ్యమైపోతాయి. భక్తితో స్మరణచేయాలి. భక్తులు 'నారద పాంచరాత్రాది' గ్రంథాలలో చెప్పబడిన విధంగా బిగ్గరగా (గట్టిగా) భగవన్నామ స్మరణం చేయడమే ఉత్తమ మార్గం.

**"సంసార సాగరమును దాటి స్వామిని చేరుటకు నామస్మరణమే నావ"[16]**

ఈ విషయాలన్నీ తెలిసిన విశ్వనాథశర్మగారు 'నామస్మరణ' మహిమను సరళమైన పదాలతో 'తేటగీతులలో తేటతెల్లం చేశారు.

**తే.	"కలినిషోడశ నామముల్ గలవు జనుల**
**నుద్ధరింపగ విధి దెల్పె నిద్ధరిత్రి**
**నోటనెవ్వడు సార్ధత్రికోటి జపము**
**సేయునో వాడు హరిని తాజేరునరుడ"[17]**

హరేరామ మంత్రం జపిస్తే హరిని జేరవచ్చని, 'నరుడ' అని సంబోధిస్తూ మానవాళికి విశదపరచారు. 'తరిగి పోయిన సమయము తిరిగి రాదు' అంటూ కాలమహిమను వివరించారు.

**తే.	"దైవ సదనము లేకున్న తావదేల?**
**మానవత్వము లేకున్న మనుజుడేల**
**దానధర్మాలు లేకున్న ధనమదేల**
**రామనామము రుచిలేని రసనయేల?"[18]**

దేవాలయం లేనిచోటు, మానవత్వంలేని మనిషి, దానధర్మాలకుపయోగపడని ధనం, రామ నామం రుచించని నాలుక వృథా అని కవి భావం.

**తే.	"తారకమ్ము మనశ్శుద్ధి కారకమ్ము**
**ఘోర సంసార జలధి సంతారకమ్ము**
**పాపతాపాది బాధా నివారకమ్ము**
**కరము సౌభాగ్య సంపూరకమ్ము నరుడ"[19]**

రెండు ఘడియల కాలంలో మృత్యువు పాలవుతానని తెలుసుకున్న 'ఖట్వాంగుడు' అనే మహారాజు తన సమస్తాన్ని, సర్వ సంపదలను, భార్యాపుత్రులను, బంధుమిత్రులను, త్యజించి, భగవంతుని ఆశ్రయించి, గోవిందనామ స్మరణం చేసుకుంటూ, రెండు ఘడియల కాలంలోనే కైవల్యం పొందగలిగాడు.[20] తారకమంత్రం మనస్సును శుద్ధిచేస్తుంది. భయంకరమైన సంసార సాగరాన్ని దాటిస్తుంది. పాపతాపాదులను తొలగిస్తుంది. సౌభాగ్యాన్నందిస్తుంది. కాబట్టి తారకమంత్ర స్మరణమే మానవ జీవన పరమావధి అని ఉద్బోధించారు.

**తే.	"భ్రమర కీటక న్యాయము పగిది నీవు**
**రసన హరినామ పీయూష రసము గ్రోల**
**మించి పరమాత్మనెపుడు భావించుచున్న**
**ఆత్మ పరమాత్ముడై వెల్గునయ్య నరుడ।"[21]**

భ్రమరం చుట్టూ తిరిగే కీటకం తాను కూడా భ్రమరమై పోయేటట్లు భగవంతుని సర్వదా స్మరించే భక్తుడు తాను కూడా భగవంతుడే అవుతాడు. సముద్రంలో కలవడం కోసం తహతహలాడుతూ ప్రవహించే నదిలోని పోటులాంటిది భక్తుని ప్రేమ.

ఇలా నవవిధ భక్తులలో ఒక్కటైన 'స్మరణం' గూర్చి '51' పద్యాలలో వివరించారు. శతక లక్షణాలతో కూడిన పద్యాలు కొన్ని వ్రాసినా దాన్ని శతకంగా గ్రహించవచ్చునని 'శతకవాఙ్మయ'[22] పరిశోధకులు భావించారు.

చివరి పద్యంలో

**తే.** **"మించు పాపములన్ని శమించుగాక**
**ప్రజలలో సుఖశాంతులు ప్రబలుగాక**
**జగతి శ్రీరామరాజ్యము సాగుగాక**
**మానవా! దివ్యహరినామ మహిమవలన"[23]**

హరినామ స్మరణవల్ల ప్రజల పాపాలు శమించి, సుఖశాంతులు పెరిగి, రామరాజ్యంగా భూలోకం విరాజిల్లాలని, ఆకాంక్షించడం కవిగారి దేశప్రేమకు, ప్రజాభిమానానికి నిదర్శనం.

ఆదిశంకరాచార్యులు కూడా "భజగోవిందం భజగోవిందం, గోవిందం భజ మూఢమతే"[24] అంటూ గోవింద నామమే మానవుని రక్షిస్తుంది. కాని వ్యాకరణాది పాండిత్యం రక్షించదని ఘంటాపథంగా చెప్పారు. అదేవిధంగా అన్నమాచార్యులు "చాలదా బ్రహ్మమిది సంకీర్తనం, మీకు జాలెల్ల నడగించు సంకీర్తనం"[25] అని స్మరణం యొక్క విశిష్టతను తెలిపారు. ఈవిధంగా భగవన్నామ స్మరణం చేసి తరించ మని ఎందరో మహనీయులు వివరించారు. వారి మార్గానుయాయి శర్మగారు.

## 3. శ్రీ పాండురంగ వర్ణమాల శతకం అనేక భావ వర్ణాల ద్యోతకం

వర్ణం అంటే రంగు, అక్షరం అని అర్థం. క్షరం కానిది అక్షరం. బీజమంత్రాలు కూడా అక్షరాలే. కాబట్టి మోక్షగవాక్షాలు అక్షరాలే అని భావించారు విశ్వనాథ శర్మగారు.

ఆదిశంకరాచార్యులు అక్షరాలతో "శ్రీసాంబసదాశివ సువర్ణమాలా స్తుతిః" అనే భజనమాల రచించారు. కాళిదాసు మహాకవి రచించిన "శ్రీమాతృకా

పుష్పమాలా స్తవః” అనే స్తోత్రంలో ‘అ’నుంచి ‘క్ష’ వరకు ఒక్కొక్క అక్షరంతో శార్దూల విక్రీడిత వృత్తంలోని నాలుగు పాదాలలో ఒకే అక్షరాన్ని మొదట నిక్షిప్తం చేసి ‘అంబ’ను స్తుతించాడు. పురాణకాలంలో మార్కండేయముని కూడా “మృత్యుంజయ అక్షర మాలా స్తోత్రం”లో శివుని స్తుతించాడు. ఈవిధంగా ఎందరో మహాకవులు, భక్తులు వర్ణమాల క్రమంలో పద్యాలు, స్తోత్రాలు, భజనలు రచించడం కనిపిస్తుంది.

శ్రీ విశ్వనాథశర్మగారు ‘వర్ణమాల’తో పద్యాలు తేటగీతి ఛందస్సులో వ్రాస్తూ ‘పరుగు పరుగున రావయ్య పాండురంగ’ అనే మకుట నియమాన్ని కూడా పాటించారు.

**తే.  “అలుకబూనకు నాపైన జలజ నయన**
**పాదముల నంటి సాష్టాంగపడుదు నీకు**
**ముద్దు ముద్దుగ ముంగురుల్ దిద్దుకొనుచు**
**పరుగు పరుగున రావయ్య! పాండురంగ!”[26]**

అంటూ మొదటి పద్యంలోనే స్వామిని ముంగురులు సవరించుకుంటూ రమ్మనటంలో వాత్సల్య భక్తిని స్ఫురింపజేశారు.

“భావనవనీత మిదుగొ సాపాటు జేసి”[27] అనే పద్యంలో భావాన్ని నవనీతంగా స్వీకరించ మని వేడుకోవడం, ఈషణత్రయాలలో చిక్కి బాధపడుతున్నాను, గట్టుకు జేర్చమని కోరడంలో జీవుని వేదన కనిపిస్తుంది.

లూత (సాలెపురుగు) యేమిచ్చి నిన్ను సంప్రీతునిచేసింది. అలాగే ఏ శక్తిలేని మాకు ఉన్న శక్తే భక్తి. దాన్ని చూసి ‘రావయ్య పాండురంగ’ అని వేడుకొంటూ ‘నాకు సర్వస్వం నీవే అని నమ్మాను స్వామి’ అని భక్తిభావంతో విన్నవించుకొన్న పద్యాలు కొన్ని అయితే, ఓ పరాత్పర! గోవింద! గోపవేష! రాధికాలోల, గోపాల, రాసలోల, బృందకానన సంచార, నందబాల, శ్రీ రాధికాద్వితీయ, గగన నిభగాత్ర, వికసిత కమలనేత్ర, ప్రణత జనపాల, మదన శతకోటి, సుందర, మంగళాంగ, ఇలా అనేక నామాలతో సంబోధించి, స్వామిని పిలిచి, ప్రశ్నించి, స్తుతించి కొన్ని పద్యాలను రచించారు.

ఙూ, లూ, అః, ఙ, ఞ, ఛ, ఝ, ఠ, ఢ, ణ, థ, ష, ళ అనే అక్షరాలతో కూడా భావానికి భంగం రాకుండా చక్కటి పద్యాలు రచించారు.

**"ఢక్క మ్రోగించి దిక్కులు పిక్కటిల్ల**
**తెల్పుచున్నాను దేవుడే దిక్కునాకు,**
**ఏదియెట్లైన నీవుండలేదు భయము**
**పరుగు పరుగున రావయ్య! పాండురంగ!"[28]**

54 పద్యాలతో సాగిన వర్ణమాలలో ఒక్కొక్క పద్యంలో ఒక్కొక్క వింతైన వర్ణం (రంగు) కనిపిస్తుంది. ఆ వర్ణాలలో ప్రేమ, భక్తి భావం, వినుతి, ప్రశ్న, తండ్రీబిడ్డలప్రేమ, రాధప్రేమ, మిత్రభావం మొదలైనవి మన కళ్ళకు మిరుమిట్లు గొలిపి, మనసును రంజింపజేస్తాయి.

**తే. "వాసుదేవుడు కరుణించి వర్ణమాల**
**విశ్వనాథుని నోరార విశదపరచె**
**ఎప్పుడైనను పుత్తము విప్పిచూడ**
**నొకరికైనను తప్పక నుపకరించు."[29]**

ఈ గ్రంథాన్ని విప్పిచూస్తే అది ఎవరికైనా ఉపకరిస్తుందని కవి భావించారు.

## 4. సద్భావలహరి శతకం - సంపూర్ణ వైరాగ్య భావ శోభితం

"భావమే బలము"[30] అని శర్మగారి తండ్రి నారాయణబాబాగారు తమ ఉపన్యాసాలలో, ప్రవచనాలలో వివరించేవారు.

ఒక్కొక్క సద్భావాన్ని ఒక్కొక్క ఉత్పలంలో పొదివి అందించడం వల్ల పాఠకుడు 'ఇహాముత్ర ఫలభోగ విరాగా'న్ని పొందుతూ ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ సంపూర్ణ వైరాగ్యాన్ని పొందేటట్టుగా ఈశతకం ద్వారా ప్రయత్నించారు కవి.

"శ్రీహరి పాదపద్మములు చిత్త సరోజమునందు జేర్చి"[31] అంటూ 'శ్రీ'కారంతో పద్యాన్ని ఆరంభించారు. "జిట్టెడు పొట్టకై పరులచెంత కరమ్మును సాచివేడగా"[32] అంటూ ఉదరపోషణార్థం పరులచెంత చేయిచాచడం కంటే హీనమైన పనిలేదని ఒక పద్యంలో వివరించారు. విశ్వనాథశర్మగారు కూడా ఎక్కడా ఉద్యోగం చేయలేదు. ఎవరినీ యాచించలేదు.

**"శ్రీహరియంశవీవగుచు చిత్కళనెట్టుల గోలుపోయి యీ**
**దేహపు బుద్ధితో సతము దిర్గుచు నుంటివి కష్టవార్థిలో**
**దేహము పాంచ భౌతికము దేవుడె జీవుడు సంశయింపకే**
**సోహమటం చెరుంగు మిక సొక్కెదవాత్మ సుఖాన జీవమా!"[33]**

అంటూ ఈ పద్యంలో 'సోऽహం బ్రహ్మ' తత్త్వాన్ని ప్రతిపాదించారు. "జీవమా! అనే సంబోధన వేదాంతార్థ ద్యోతకమైనది. సుఖ దుఃఖాలను అనుభవిస్తూ జన్మ పరంపరలను పొందేవాడు జీవుడు. కారణ శరీరాభిమానిని జీవుడని అంటాము. కారణ శరీరం అంటే అవిద్యా ఉపాధి కలిగియుండడం. అంటే "నేను బ్రహ్మమును" అని తెలియక పోవడమే ఉపాధిగా ఉండడం. సామాన్య జనులు కారణశరీరం, సూక్ష్మ శరీరం అనే భేదాన్ని గుర్తించలేరు.

అందువల్ల చనిపోయినప్పుడు శరీరాన్ని వదలి అన్య శరీరాన్ని ధరిస్తున్న సూక్ష్మశరీరాన్ని, దాని అభిమానిని కలిపి 'జీవుడు' అని వేదాంత తత్త్వంలో వివరించారు."[34]

'జీవమా' అనే సంబోధనకు మనం 'ఓ జీవుడా' అనే అర్థం చెప్పుకోవచ్చు. వేదాంత బోధకు, వైరాగ్య సాధనకు అనువైన సంబోధనను ఎన్నుకోవడం కవి ఉపజ్ఞకు చిహ్నం.

భక్తిమార్గంలో తల్లి, తండ్రి, సఖుడు అన్ని భగవంతుడే అని స్తుతిస్తారు కవి. వేదాంతం చెప్పి వైరాగ్యం కలిగించదలచిన శర్మగారు జీవుని ఇలా ఉద్బోధించారు.

**"తల్లియు తండ్రియున్ సఖులు దార సుతుల్ హితులాది గల్గువా**
**రెల్లరు కాలవేగమున నేగెడు వారలె యేటి నీటిలో**
**పుల్లలు నొక్కచోటునకు ప్రోగయి కొట్టుకపోయినట్టులీ**
**కల్ల జగంబు నిక్కమని గాంచుట దుఃఖముగాదె జీవమా!"**[35]

అనిత్యమైనది ఈ జీవితం బంధువులు, సంపదలు ఏవీ వెంటరావు. మిథ్యా జగత్తును నిక్కమని నమ్మడం దుఃఖహేతువు. 'బ్రహ్మ' మాత్రమే సత్యం.

వేదాంతపరమైన ఈ శతకంలో అనేక చక్కటి సూక్తులు కనిపిస్తాయి. ఈ సూక్తులన్నీ నిత్యసత్యాలే.

**'ఆశకు దాసుడెవ్వడు ఆతడె దాసుడె లోకమంత'**
**'కోపము నుంచరాదు ఘనకోవిదులైనను,**
**'సారము లేని ఘోర భవసాగరమందు మునుంగు వారలన్**
**తీరము జేర్ప 'రామ'నెడు తెప్పయె తప్పనికెద్ది లేదు'**
**'ఆయువు కోట్ల వెలబోసియునైన మరల్పరాదు'**

మానవుడు శాస్త్ర, సాంకేతిక రంగాలలో అభివృద్ధిని సాధించినా, ఆయువును పెంచుకోవటంగాని, ప్రాణాలు తిరిగి తీసుకురావటంగాని సాధ్యంకాలేదు. కాబట్టి ఉన్న కాలాన్ని సద్వినియోగం చేసుకొమ్మని, శ్రీధరుని సన్నిధిజేరుమని ప్రబోధించారు కవి.

ఈశతకంలో కవి సందర్భానుసారం ప్రకృతి నియమాన్ని కాలగమనాన్ని సూచిస్తూ ఉపమాలంకారాలను ప్రయోగించారు. ఇలా నిత్యజీవితంలో చూస్తున్న వాటిని ఉదహరిస్తూ వేదాంత తత్త్వాన్ని బోధపరచడానికి ప్రయత్నించారు శర్మగారు.

**5. శబ్దాలంకారాల డోల కేశవాది నామమాల**

'కేశవ' నుండి 'శ్రీకృష్ణ' వరకు 24 నామాలున్నాయి. ఇవి విశిష్టమైనవి. విష్ణువుకు సహస్రనామాలున్నా ఈ ఇరవైనాలుగు నామాలతో పూజా సంకల్పా రంభం చేయడం ఆచారం, సంప్రదాయం.

అన్నమాచార్యులు 'మాధవా కేశవా మధుసూదనా' అంటూ వేంకటనాథుని కీర్తించాడు. 'కేశవాది భజనమాల' అని ఆ సమయంలో భజనా సంప్రదాయం కూడా బాగా ప్రచారంలో ఉండేది. ఇదే పద్ధతిలో శర్మగారు 'కేశవాది నామ మాలను' "మాధవా! నన్ను మాత్రము మరువబోకు" అనే మకుటంతో ఇరవై నాలుగు పద్యాలు తేటగీతిలో రచించారు.

ఈ మకుటంలో కూడ "మాధవా" అనే మూడోనామం ఇమిడి ఉంది.

**"విమల। దామోదరానంత విశ్వవంద్య**
**సకల ధామోదరా! కృష్ణ సాధుసేవ్య**
**సర్వ దామోదరస పూర్ణ శ్యామవర్ణ**
**మాధవా నన్ను మాత్రము మరువబోకు!"**[36]

దామోదరా – ఉదరంపై మాల ధరించినవాడు.

సకల ధామోదరా – సమస్తాన్ని ఉదరంలో కలిగినవాడు.

సర్వదా! మోదరసపూర్ణ – సమస్తాన్ని ఇచ్చువాడు. ఆనంద రసంతో నిండినవాడు.

అనే భిన్నార్థాలతో దామోదరా అనే నామాన్ని ప్రయోగించి యమకాలంకారా నికి వన్నె తెచ్చారు.

విశ్వవంద్య అనే సమాసంలో విశ్వంచేత నమస్కరింపబడేస్వామి అని,

తనపేరు విశ్వనాథశర్మ కాబట్టి తనచేత నమస్కరింపబడేవాడనే అర్థం వచ్చేటట్లుగా ఈ సంబోధనను ఔచిత్యవంతంగా ప్రయోగించారు.

**"శ్రీహరీ! వీడుదుడుకని చేయివిడకు**
**విడక చేసిన పనులకు విసుగుగొనకు**
**కొనకు నీ సన్నిధిని గొమ్ము కోపపడకు**
**మాధవా! నన్ను మాత్రము మరువబోకు."[37]**

ఈపద్యాన్ని ముక్తపదగ్రస్తం, అంత్యప్రాసలతో భక్తిభావ బంధురంగా అర్థవంతంగా రచించారు. శర్మగారు పై శబ్దాలంకారాల ప్రయోగంవల్ల పద్యానికి లయాత్మకతతో కూడిన 'తూగు" వచ్చింది.

త్యాగబ్రహ్మం కూడ "దుడుకుగల నన్నే దొరకొడుకు బ్రోచురా"[38] అంటూ కీర్తన రచించారు. పంచరత్న కీర్తనల్లో ఒకటి ఇది.

త్యాగబ్రహ్మనిది రామభక్తి సామ్రాజ్యం అయితే శర్మగారిది కృష్ణభక్తి సామ్రాజ్యం.

## 6. రామనామ విశిష్టతను తెలిపే "రామనామ రహస్యము"

శ్రీ పాండురంగాశ్రమంలో ఎల్లప్పుడు అఖండరామనామ స్మరణం జరుగుతూ ఉంటుంది. విశ్వనాథ శర్మగారు కూడా లక్షలకొద్ది హరేరామ మంత్ర జపం, రామతారకం చేయించారు. చేశారు. అయితే అలాంటి రామనామం విశిష్టతను వివరిస్తూ ఆరుపద్యాలు 'శ్యామసుందరా' అనే మకుటంతో రచించారు.

హరిహరుల మంత్ర సమ్మేళనమే 'రామ' నామమని 'నారాయణ' మంత్రంలో 'రా' అనే అక్షరం 'ప్రాణం', 'నమశ్శివాయ' అనే మంత్రంలో 'మ' అనే అక్షరం 'జీవం'. ఇదే రామ మంత్రంయొక్క రహస్యమని వివరించారు. శ్యామ సుందరా మకుటంలో మ,రా అనే అక్షరాలు క్రమంగా, వేగంగా ఉచ్చరిస్తే రామనామ స్ఫూర్తినిస్తాయి.

**"రాయన - పారిపోవు - నఘరాసులు - వక్త్రము నుండి తోడనే**
**మాయన - మళ్ళీరావు - ముఖమార్గము - మూయుట చేత నోష్ఠముల్**
**పాయక - రామనామమును - పల్కిన పాపములంట వంటినన్**
**హాయని - కూలునిప్పు - చెదలంటిన తీరున - శ్యామసుందరా!"[39]**

'రా' అనే అక్షరం పలకగానే పాపాలన్నీ వెలికిపోతాయి. 'మ' అని పలకగానే నోరుమూయడం వల్ల మళ్ళీ ఆ పాపాలు తిరిగి లోనికి రావు. కాబట్టి రామ నామాన్ని జపించమని కవి ఉద్బోధ.

అగ్నికి చెదలు పట్టనే పట్టదు. పట్టినా మలమల మాడిపోతుంది. అదే విధంగా రామ నామం జపిస్తే పాపాలు రానేరావు. ఒకవేళ వచ్చినా క్షణంలో పటాపంచలవుతాయి అంటారు.

ఉ. **"బీజములోన నున్న బహువిస్తృతమౌ వటవృక్షమట్లు 'రాం'**
**బీజము నందునన్ గలవు వేనకు వేలు సమస్తలోకముల్**
**బీజము మంత్రశక్తి గద! బీజమె మూలము విశ్వసృష్టికిన్**
**శ్రీ జనకాత్మజా రమణ। చిద్రససాగర। శ్యామసుందరా!"**[40]

బీజంలో బహువిస్తృతమైన వటవృక్షం ఉన్నట్లుగా 'రాం' బీజంలో కూడా వేలకువేలు సమస్త లోకాలున్నాయని, బీజాక్షరం శక్తివంతమైనదని, విశ్వసృష్టికి అదే ఆధారమని వివరించారు.

ఈఘోర కలికాలం దాటాలంటే రామమంత్ర జపమే శక్తిమంతమైనదని, తమ గురువరేణ్యులు స్వప్నంలో కనిపించి చెప్పారని ఐదవ పద్యంలో వివరించారు. అకుంఠిత దీక్షతో జపించిన 'రామమంత్రం' సర్వ సౌఖ్యాలు, మోక్షం కలిగిస్తుందని చివరి పద్యంలో వివరించారు.

ఈవిధంగా రామనామ విశిష్టతను గూర్చి ఆరుపద్యాలలో వివరించారు.

## 7. గంగావతరణంకోసం "ఆవేదన"

పంచభూతాలలో నీరు ఒకటి. నీరు జీవనాధారం. ప్రకృతికి అందాన్నిచ్చేది మానవాళికి ఆనందాన్ని పంచేది నీరు. ముఖ్యంగా పంటలు పండాలంటే నీరు ఉండాలి. నిత్యావసరాలలో ఒకటైన నీరు ఎన్నో రూపాలలో లభ్యమవుతుంది. సముద్రమై, నదీనదాలై, వాగులై, వంకలై లభ్యమవుతున్న నీరు లేకుంటే జీవకోటి మనుగడలేదు. మనకు నదులు ఎన్నో ఉన్నాయి. ముఖ్యంగా 'భగీరథప్రయత్నం' వల్ల భువికి వచ్చిన జలాన్ని (భాగీరథి) 'గంగ'గా పేర్కొన్నాం. 'గంగ' శివుని రాణియని, విష్ణుపాదోద్భవమని పురాణాలు చెబుతున్నాయి. అయితే పవిత్రమైన

జలాన్ని 'గంగ' అని పిలవటం జరుగుతుంది. గంగాదేవికి పూజలు, ఉత్సవాలు జరిపే సంప్రదాయం కూడా భారతదేశంలో ఉన్నది.

పాండురంగాశ్రమ ప్రాంతంలో క్షామం ఏర్పడి, వానలు కురువనప్పుడు జనం అల్లల్లాడిపోయారు. ఆ సమయంలో విశ్వనాథశర్మగారు ఆవేదనతో గంగను 27 పద్యాలలో ప్రార్థించారు. ఈపద్యాలన్నీ తేటగీతులే. ఈపద్యాలు రచించి అందరిచేత చదివించగానే వర్షాలు కురిసాయని చెబుతారు.

శర్మగారు ఏరచన చేసినా 'మకుటం' ఎన్నుకోవటంలో ప్రత్యేకత కన్పిస్తుంది. 'తరలి రావమ్మ గంగమ్మ కరుణతోడ' అనడంలో కవిహృదయంలోని 'ఆర్తి' కనిపిస్తుంది.

ఆశ్రమ ప్రాంతంలో 'హరిగంగ' అనే నీటికొలను ఉంది.

**శ్లో॥ "హరిగంగే నమోగంగే। శివసంగే। దయామయి।**
**మంగళం తవదాస్యామి। దేహిమే సర్వమంగళమ్॥"**[41]

అని స్తుతించారు కవి. ఆ హరిగంగలో నీరు కనిపించక పోయేసరికి ఆర్తితో గంగను వేడుకున్నారు.

**"అతల వితలాది లోకాల నధిగమించి**
**చెంగు చెంగున పైపైకి పొంగిపొరలి**
**విశ్రమింపగ - పాండురంగాశ్రమాన**
**తరలిరావమ్మ గంగమ్మ కరుణతోడ"**[42]

ఎక్కడో దాగిన గంగపైకి రావాలని, చెంగు చెంగున నీరు జలజలా ప్రవహించాలని, వచ్చిన గంగ ఈ ఆశ్రమంలో విశ్రమించాలని కోరారు.

జీవులలో శివుడున్నాడు. అన్నపూర్ణ తోడుగా ఉండి ఆనందిస్తుంది. మరి నీకు మమత లేదా అని ప్రశ్నిస్తూ గంగను తరలి రమ్మని వేడుకున్నారు. వారణాసిలో జీవించే తల్లి ఇక్కడ కూడా రంజిల్లుమని ఒక పద్యంలో వేడుకున్నారు.

నీవు లేకుంటే క్షణమైన ప్రాణాలు నిలువవు. చాలా కాలం పడ్డకష్టాలు తలిచి అశ్రుతర్పణం చేసి బ్రతిమాలి వేడుకుంటున్నాం. నీరాకకోసం ఎన్నో రోజులనుండి వేచి ఉన్నాం. మాకు కన్నుల పండుగ చేయాలి. నీవు అడిగిన తర్వాత గడియ గడియకు జీవితాంతం తలుచుకుంటాం.

నీలకంధరురాణి, సునీలవేణి, జహ్నుగారాలపుత్రి, విశాలనేత్రి, సౌందర్య గాత్రి, కల్పవల్లి, చారుతరవేణి, కల్యాణి, కీరవాణి, రత్నాలభరణి, సకల తీర్థ స్వరూపిణి. విష్ణుపాదోద్భవి, కృష్ణవేణి అంటూ గంగాదేవిని సందర్భానుసారంగా చక్కటి విశేషణాలువాడి ఆమెను ప్రసన్నం చేసుకున్నారు.

**"అమ్మ భాగీరథీ! మంగళమ్ము నీకు**
**సకల లోకైక పావనీ స్వాగతమ్ము**
**విశ్వనాథుని వేదన - విని బిరాన**
**తరలిరావమ్మ గంగమ్మ కరుణతోడ."[43]**

ఈ చివరి పద్యంలో గంగాదేవికి స్వాగతం అని, శుభం కల్గుతుందని చెప్పి, తన ఆవేదన విని తొందరగా రమ్మని చెబుతూ తన ఆవేదనాపూర్వక నివేదనను ముగించారు. ఈపద్యంలో 'బిరాన' అనే పదం తెలంగాణా మాండలికం. దీనికి 'వేగంగా' అని అర్థం. ఇలా గంగావతరణం కోసం కవి తన "ఆవేదన"ను కవిత్వ రూపంలో ప్రవహింపజేశాయి.

**జ్ఞాపికలు**

1. శ్రీమదాంధ్ర భాగవతము : పోతన, బమ్మెర. సప్తమస్కంధము, పద్యం - 275, పుట.531
2. శ్రీ శివలింగవిలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం -5, పుట.2.
3. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం-39, పుట.10
4. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 9, పుట.3
5. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం-73, పుట.19
6. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం-50, పుట.13
7. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 86, పుట.22
8. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 3, పుట.1
9. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 84, పుట.22
10. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 25, పుట.7
11. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 38, పుట.10
12. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 46, పుట.12
13. శ్రీ శివలింగ విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 33, పుట.9

14. శ్రీ భగవద్గీతామృత తరంగిణి (తొమ్మిదవ అధ్యాయము) :
శ్రీ సత్యానంద మహర్షులవారు, పుట. 839

15. సంకీర్తనావళి (శ్రీ త్యాగరాజకీర్తన) : సంకలనం - డా॥ కృష్ణమాచార్యులు, యం.
పుట. 45

16. భావానంద (శతజయంతి ఉత్సవ ప్రత్యేక సంచిక) : పుట. 28

17. నామస్మరణ : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 23, పుట. 11

18. నామస్మరణ : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 28, పుట. 12

19. నామస్మరణ : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 43, పుట. 17

20. శ్రీమదాంధ్ర భాగవతము (ద్వితీయ భాగము) : స్వామి సుందర చైతన్యానంద,
నవమస్కంధము, పుట. 19

21. నామస్మరణ : విశ్వనాథశర్మ అప్పాల, పద్యం - 48, పుట. 19

22. శతకవాఙ్మయము : సుందరం ఆర్.వి.ఎస్., పుటలు. 126, 127

23. నామస్మరణ : విశ్వనాథశర్మ అప్పాల, పద్యం - 51, పుట. 20

24. శ్రీహరిహర సేవాలహరి (భజగోవింద స్తోత్రము) : సంకలనం
సీతారామసిద్ధాంతి, గౌరీభట్ల. రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల. పుట. 29

25. అన్నమాచార్యకీర్తనలు : సంకలనం - ప్రసన్న, తెన్నేటి. పుట - 203

26. శ్రీ పాండురంగ వర్ణమాల : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 1, పుట. 21

27. శ్రీ పాండురంగ వర్ణమాల : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 2, పుట. 22

28. శ్రీ పాండురంగ వర్ణమాల : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 32, పుట. 32

29. శ్రీ పాండురంగ వర్ణమాల : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 54, పుట. 39

30. శ్రీ యతివర భావానందస్వామి(జీవితచరిత్ర) : రఘురామశర్మ, గౌరీభట్ల. పుట. 404

31 & 32. సద్భావలహరి : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యాలు - 1,3, పుట. 5

33. సద్భావలహరి : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 6, పుట. 6

34. జీవిత పరమార్థము - వేదాంతశాస్త్రము : నాగమణి, కొండూరు. పుట. 217

35. సద్భావలహరి : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 8, పుట. 6

36. కేశవాది నామమాల : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 12, పుట. 11

37. కేశవాది నామమాల : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం - 23, పుట. 22

38. సంకీర్తనావళి (త్యాగరాజకృతి) : సంకలనం-డా॥ కృష్ణమాచార్యులు యం. పుట. 21

30 & 40. భావానందం (రామనామరహస్యము) : విశ్వనాథశర్మ, అప్పాల.
పద్యాలు 3,4. పుట. 15

41. గంగా పంచరత్న స్తోత్రమ్ (వ్రాతప్రతి) : శ్లో. 4, పుట. 58

42 & 43. ఆవేదన (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యాలు 1,27.

# 6. చిత్రకవిత్వంలో చిదానందరూపం

మానవుడు నిరంతరం కొత్తదనాన్ని కాంక్షిస్తాడు. విజ్ఞానం, వైద్యం, కవిత్వం, కళలు అది ఏరంగంలోనైనా కావచ్చు. ఆ కాంక్షే లేకపోతే ప్రపంచంలో ఇంత పురోభివృద్ధి జరగదు.

మానవుని సాహిత్య సృజనలో ఎన్నో విధాలైన ప్రక్రియలు వెలువడ్డాయి. వాటిలో చిత్రకవిత్వం ఒకటి.

కవి తన మేధాశక్తిని, పాండిత్య ప్రకర్షను ప్రదర్శించడానికి చిత్రకవిత్వాన్ని సృజించాడు. ఈ చిత్రకవిత్వంలో ఒక అక్షరం, రెండు అక్షరాలు, మూడు అక్షరాలు అంటే ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి పద్యాలు వ్రాయడం, బంధకవిత్వం (పద్మ, చక్ర, ఛురిక, గోమూత్రిక మొ॥) చెప్పడం, కందాన్ని అనేక రకాలుగా వ్రాయడం, గర్భకవిత్వం లాంటివి ఉంటాయి.

వీటిని కొందరు 'సర్కస్ ఫీట్ల'ని విమర్శించినా, వీటిలోను కవితాంశ గలవి, మనోహరమైన భావం కలిగినవీ ఉంటాయి.

విశ్వనాథశర్మగారు కూడా చిత్రకవిత్వాన్ని సృజించాడు. 'అప్పకవీయము'ను ప్రమాణంగా తీసుకుని బంధకవిత్వాన్ని రచించారు.

తమ మేధకు పదనుపెట్టదలచి ఈ ప్రక్రియను చేపట్టారు. ఆశ్రమానికి వచ్చే కవులు కవిత్వ చర్చలు చేసేవారు. ఆ చర్చలలో పాల్గొనడం వల్ల శర్మగారు తమ రచనా ప్రావీణ్యాన్ని మెరుగుపరచుకున్నారు.

అనేకమంది అవధానులు, 'యమకచక్రవర్తి' – బిరుదాంచితులు 'రామశాస్త్రి' గారు, భాగవత పౌరాణికులు మొదలైనవారి సత్సాంగత్యం శర్మగారి పాండిత్యానికి వన్నెబెట్టాయి. ఆయన పాండిత్య ప్రకర్షకు నికషోపలాలైన చిత్రకవిత్వ భేదాలను పరిశీలిద్దాం. శర్మగారు బంధకవిత్వాన్ని, గర్భకవిత్వాన్ని 1975లో రచించారు.

ఆయన సృజించిన చిత్రకవిత్వంలో ద్వ్యక్షరి, బంధకవిత్వం, గర్భకవిత్వం, తాత్త్విక సంఖ్య ఏకస్వరూపం ఉన్నాయి. వాటిని క్రమంగా అనుశీలిద్దాం.

## ఎ). ద్వ్యక్షరిలో భక్తి

శ్రీ విశ్వనాథశర్మగారు 'ద్వ్యక్షరి'ని 'శ్రీ శివలింగ విలాసము' అనే శతకంలో ఉత్పలమాలా వృత్తంలో రచించారు.

**"నేమము నూనినాను –మునునిన్ను మనమ్మున నమ్మినాను నీ**
**నామము నెన్ని నేను మననమ్మున నున్న నన్నన? మౌనమా**
**నేమన – నిన్ను మాని నినునేమన – మిన్ను ననున్న నామి। న**
**న్నోము మనన్న – మానమున నోమము నెమ్మని చంద్రశేఖరా!"[1]**

ఒక మకుటం తప్ప న, మ అనే రెండు అక్షరాలే పద్యమంతా నిండి ఉన్నాయి. ఓ చంద్రశేఖరా! మనస్సులో నీపై విశ్వాసం ఉంచి నియమంగా నీ నామస్మరణమే చేస్తున్నాను. స్వర్గంలో ఉన్న ఓ స్వామీ! నన్ను రక్షించమంటూ ఈ పద్యంలో ఆ చిదానంద స్వరూపుని ప్రార్థించారు.

## బి). బంధకవిత్వం

చక్ర, ఖడ్గ, నాగ, పద్మ, గోమూత్రికాది ఆకారాలలో కవిత్వాన్ని సముచితంగా బంధించి చమత్కారాన్ని కలిగించడమే బంధకవిత్వం.

బంధాలు నాలుగు విధాలు. i). మాంగళిక బంధాలు, ii).ఆయుధబంధాలు, iii). ప్రకీర్ణబంధాలు iv). ఆకార చిత్ర మిశ్రమం.[2]

**ఎ). ఆయుధబంధాలు :** 1). షోడశదళ చక్రబంధం, 2). ఖడ్గ బంధం, 3). అసి బంధం, 4). ఛురికా బంధం, 5). చక్రబంధం.

**బి). ప్రకీర్ణ బంధాలు :** 1). నాగబంధం, 2). చంపకమాలికా బంధం, 3). పంచపుష్పమాలికా బంధం, 4). గోమూత్రికా బంధం.

**ఎ). ఆయుధ బంధాలు**

## 1. షోడశదళ చక్రబంధం



విశ్వనాథశర్మగారు శ్రీకృష్ణుని స్తుతిస్తూ ఈ బంధాన్ని రచించారు. ఈ షోడశదళ చక్రంలో కేంద్రస్థానంలో అగ్ని బీజమైన 'ర'కారాన్ని నిక్షిప్తంచేసి, భగవంతుని తేజస్సును ప్రతిఫలింపజేశారు కవి. ఆ తేజస్సు కూడా కృపామయ తేజస్సు, శీతలత్వంతో భాసిస్తూంది. కేంద్ర 'ర'కారాన్ని షోడశదళాలలోని ప్రతి అక్షరానికోమారు చొప్పున పదహారుసార్లు ఆవృతం చేయడంవల్ల భగవంతుడు షోడశకళాపూర్ణుడని చెప్పకనే కవి చెప్పారు. పద్యాంత సంబోధనాంత అక్షరం కూడా 'ర'కారం కావడంవల్ల భగవంతుడు తేజస్వరూపుడనే విషయం నొక్కి వక్కాణించినట్లయింది. ఆ తేజస్సు 'చిత్' స్వరూపం. అది ఆనందమయంగా ఉంటుంది. అందుకే భగవంతుడు కవికి చిదానందరూపుడుగా భాసించి, సింహరేఖావృత్తంలో అగ్ని బీజమైన 'ర'కారకేంద్రంగా షోడశకళలతో ప్రకాశిస్తూ దర్శనమిచ్చాడు.

సింహరేఖావృత్తం – అప్పకవీయ ప్రమాణం

**"రావ రాధారాణి – రాగా**
**రా। వరా। ధీరా। పరాకా**
**రా। వరాగారా। సురాధా**
**రా। వరాకారా। మురారీ."[3]**

## 2. ఖడ్గబంధం - ఇది ఉత్సాహవృత్తంలో వ్రాయబడింది.




**"శౌరి। చేరి కోరి పిల్వబాల జాలమేలరా?**
**నారదాది వంద్యపాద నాట్యగాన సుందరా**
**రారవేణు – గోపబాల। రాధికా మనోహరా**
**వారిజాక్ష – రుక్మిణీధవా హరీ పరాత్పరా।"[4]**

ఈ బంధం 'దశరథ రాజనందన చరిత్ర' ఆధారంగా రచించారు కవి. ఖడ్గంలో బంధించబడిన ఈ పద్యం 'ఉత్సాహం'. దీని నడక పాఠకునికి ఉత్సాహాన్ని కలిగిస్తుంది. 'హరి'ని లలితకళా స్వరూపునిగా చిత్రించారు కవి. ఆయన నాట్య, గాన సుందరుడు, వేణుగోపబాలుడు. సంగీతం, నాట్యం రెండూ ఉత్సాహాన్ని కలిగించేవే. ఇలా ఔచిత్యవంతంగా రచింపబడిన ఖడ్గబంధం ఇది.

**3. అసిబంధం - సుగంధివృత్తంలో వ్రాయబడింది. 'అప్పకవీయము' ఆధారం.**



**"శ్రీధరా। ధరా ధరా। సుశీల। బాల। నీలమా।**
**మాధవా। దయాలవాల। మారకోటి సుందరా।**
**రాధికా మనోవిహార। రావదేల? కోపమా?**
**మాధనమ్ము - దిక్కు - నీవు - మాకు సర్వమీవెరా।"[5]**

ఈ సుగంధి వృత్తంలో లక్ష్మీధరుడని, కూర్మావతారుడని, సుశీలుడని, నీలవర్ణుడని, లక్ష్మీధవుడని దయకుస్థానమైనవాడని, అనేక మన్మథుల సౌందర్యం కలిగిన వాడని, రాధికా మనోహరుడని – భగవంతుని భౌతిక, మానసిక చిత్రణతో ఆయన గుణాలను గుబాళింపజేసి 'మాకు అన్నీ నీవె' – అన్యథా శరణంనాస్తి – కాబట్టి రమ్మని ఆహ్వానించడం 'అసి' బంధంలో 'ససి'గా ఒప్పి ఉంది. ఆ 'సుగంధి'ని ఆఘ్రాణించండి.

## 4. ఛురికా బంధం



అందమైన కందాన్ని ఈ బంధంలో ఇమిడించారు. సురనుత గుణుడైన కృష్ణుడు. పరమదయాపూర్ణుడు కాబట్టి మన భవ (జన్మ) బంధాలను, భయాన్ని తొలగిస్తాడని కవి ఈ 'బంధం'లో ధ్వనింపజేశారు.

**"మురహర। సరసిజ చరణా।**
**సురమత గుణ। వేణుధరణ సుందర తరుణా।**
**శరణాగత జన భరణా।**
**పరమ దయాపూర్ణ। కృష్ణ భవ భయ హరణా"[6]**

## 5. చక్రబంధం - శార్దూల విక్రీడితం



**"వందే కౌస్తుభ భూషణం - సునయనం - వందే సదా - మాధవం**
**వందే - దీనజనావనం - ఘన నిభం - వ్యత్యస్తధారావరం**
**వందే - సుందర - గోపికా జన సఖం - వక్షస్థల లక్ష్మీధవం**
**వందే - శ్రీ వసుదేవజం - భవహరం - వంశీధరం - శైశవం."**[7]

'భవం' (జన్మసంసారం) అనే శార్దూలాన్ని నీ (హరియొక్క) చక్రం ద్వారా ఖండించి మాకు 'భవ' రాహిత్యం చేయుమనే భావాన్ని - శార్దూలాన్ని చక్రంలో బంధించడం (చక్రబంధం) ద్వారా కవి స్ఫురింపజేశారు. 'భవహరం' అనే విశేషణం ఈ పద్యంలో ఉండడమే పై భావనకాధారం.

**బి). ప్రకీర్ణ బంధాలు :**

**1. నాగబంధం - మృదువైన చంపకమాలను 'నాగబంధం'లో బంధించారు కవి. చూడండి.**



**"కరధృత శైలభార। నిజకంజ ముఖప్రభ। దీనపాలనా।**
**సురుచిర కేశ। ధీరవర। శూర। వనస్థలచార। శంఖ - సం**
**హర। ఘనదేహ। చారుతరహార। బృహద్యశ। పూతమానసా**
**మురహర। లోభదూర। గృహమోహమలస్పృహ। మారమోహనా॥"[8]**

చిదానందరూపుని గుణాలనే ఒక్కొక్క చంపకంగా కూర్చి చంపకమాలను సిద్ధంచేసి దాన్ని 'శేషశయనుడైన' హరికి అంకితంగా 'నాగబంధం'లో ఇమిడ్చి అర్చించడం శర్మగారి భక్తిని వేనోళ్ళ చాటుతుంది.

## 2. పంచపుష్పమాలికా బంధం



భూమిని ధరించినవాడు (కూర్మావతారం), దేవతల కాప్తుడు, రాసక్రీడా శ్రేష్ఠుడు, రోగరహితుడు, దయామయుడు అనే పంచగుణాలుగల పరాత్పరుని (శ్రేష్ఠులందరికీ శ్రేష్ఠుడు) 'ప్రమాణి' వృత్తంలో పంచపుష్పాల మాలికగా చిత్రించి బంధించిన బంధం సుమనోహరం.

ప్రమాణి వృత్తం :

**పరాత్పరా! ధరాధరా!**
**సురాప్త। రాసరాజ। రా**
**నిరామయా। దయామయా**
**బిరాన రావ రాధతో**[9]

## 3. చంపకమాలికా బంధం



12 పుష్పాలతో 'చంపకమాలికా బంధం'ను రచించారు. మొదటి పుష్పంలోని అక్షరాలు కలిపి చదివితే పరిపరికోరినా' అని ఏర్పడుతుంది. ఇలాంటి పన్నెండు పుష్పాలు దీనిలో ఉన్నాయి.

**పరిపరి కోరినాను పదపద్మపరాగపు ప్రాపుజూపు శ్రీ**
**ధర। వరహార। వేణుధర। ధర్మధవా। చలమేల। యేల – సుం**
**దరతర। ధీర। పూర్ణతమ తత్వ। తపఃఫల। నీలబాలకా?**
**మురహర। శూర। దేవ। మునిముఖ్యముదావహా। మోహదాహకా।**[10]

ఈ చంపకమాలికను శ్రీకృష్ణ పరమాత్మ కంఠసీమలో అందంగా అలంక రించారు కవి. దీనిలోని పన్నెండు పుష్పాలు ద్వాదశాక్షరి మంత్రాన్ని "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే దాన్ని స్మరింపజేస్తూ 'మోహదాహకం'గా ఉన్నాయి.

**4). గోమూత్రికా బంధం**

దీన్ని మాలినీవృత్తంలో రచించారు. మధ్యలో 19 అక్షరాలు మీద, కింద 11 అక్షరాలు నిలుపుతూ ఈ బంధాన్ని రచించాలి. మధ్యలోని 19 అక్షరాలు పునరావృతమౌతాయి.

**మాలినీ :** **"కనక - వసనధారీ। కావరారా। వివాహో**
**వనజ వదన। శౌరీ భావధారా ప్రవాహో।**
**ఘన నిభ। వనమాలీ। గాన సంజాత మోదా।**
**జన శుభవనమాలీ। జ్ఞాన సంజాత మోదా।"[11]**

పీతాంబరుడు, పద్మముఖుడు, భావధారా ప్రవాహుడు, మేఘసంకాశుడు, వనమాలను ధరించినవాడు, గానంవల్ల కలిగిన మోదం గలవాడు, లోకుల క్షేమ మనేవనానికి 'మాలి' జ్ఞానం వల్ల కలిగిన ఆనందం కలవాడు. అనే విశేషణాలతో 'హరి' భౌతికరూపం, గుణస్వరూపం చిత్రించబడ్డాయి. ఆయన వర్ణనకు పరాకాష్ఠ "జ్ఞానసంజాతమోదం కలవాడ" నడం. కవీశ్వరుడు తన బంధ కవిత్వమంతటా 'చిదానందరూపు'ని భౌతిక, మానసిక, లీలా చిత్రణకు ప్రాధాన్యమిచ్చారు.

ఈవిధంగా శర్మగారు నవరత్నాలలాంటి తొమ్మిది బంధపద్యాలను రచించారు. వీటిలోని విషయం కూడా 'చిదానంద రూపు'ని చిత్రణమే.

## సి). గర్భకవిత్వం

ఒకపద్యంలో మరో పద్యాన్ని లేదా రెండు పద్యాలను ఇమిడించి వ్రాయడం గర్భకవిత్వ లక్షణం.

## 1. కందగీత గర్భ చంపకమాల

ఈ పద్యాన్ని చంపకమాలా వృత్తంలో రచించారు. దీని గర్భంలో కందం, గీతం ఇమిడి ఉన్నాయి.

ప్రధానపద్యం

**చం. "సురవరమాధవా భువన సుందర చిన్మయ పూర్ణకామదా
హరి సుగుణాకరా మధురహాస జనార్దన మంగళాంగ శ్రీ
కర కర గోపికా వరద కావర। కేశవ। వాసుదేవ। భా
సుర చరణా విభూ విమలశుద్ధి నిరంజన। విశ్వపాలనా।"[12]**

**కం. "వర మాధవా భువన సుం
దర చిన్మయ పూర్ణకామదా హరి సుగుణా
కర గోపికా వరదకా
వర కేశవ వాసుదేవ భాసురచరణా।"**

**తే. "భువన సుందర చిన్మయ పూర్ణకామ
మధురహాస జనార్దన మంగళాంగ
వరదకావర కేశవ వాసుదేవ
విమల శుద్ధ నిరంజన విశ్వపాల।"**

చంపకమాలా వృత్తంలోను కందపద్యంలోను 'ర'కారమే ప్రాస 'ర' కారం అగ్ని బీజం. ఇది ఉద్దీపనాన్ని కలిగిస్తుంది. భక్త్యుద్దీపనకిది దోహదం చేస్తుంది. చంపకమాలా వృత్తంలోని మొదటిపాదంలో రెండక్షరాలు వదలి, రెండవ పాదం లోని ఐదు అక్షరాలు గ్రహించి కందపద్యంలోని రెండు పాదాలు రచించారు. ఇదేవిధంగా మిగిలిన రెండు పాదాలూ కూర్చారు. చంపకమాలా వృత్తంలోని ప్రతిపాదంలోని మొదటి ఏడక్షరాలను చివరి ఒక దీర్ఘాక్షరాన్ని వదలిగీతాన్ని రూపొందించారు. ఇదొక సర్కసు ఫీటులాంటిది. రచనా చమత్కారాన్ని చూసి పాఠకుడు 'ఓహో' అని ఆశ్చర్య చకితుడౌతాడు. ఈకందగీత గర్భచంపక మాల నిండా చిదానందరూపునికి సంబంధించిన విశేషణాలే కూర్చారు.

## 2. చతుర్విధ కందం

శర్మగారు ఒక చతుర్విధ కందాన్ని కూడా రచించారు. ఒక కందపద్యం వ్రాసి, దానిలోని వాక్యభాగాలను నాలుగు విధాలుగా చేరుస్తూ నాలుగు

కందపద్యాలను ఒక కందం ద్వారానే (మొదటిది కాక మూడు మొత్తం నాలుగు) రచిస్తారు. ఇదే చతుర్విధ కందం.

**కం. "[1]కరి రాజపాల। పావన**
**చరణా। [2]కరుణాల వాల। జలజాభరణా।**
**[3]హరిభక్త భారభరణా।**
**తరుణా। [4]శరణమ్ము నీవె ధరణీ వరుణా।"[13]**

ఇందులో నాలుగు కందపద్యాలు చోటుచేసుకున్నాయి. మొదటి పాదం మొదటి గణారంభం నుంచి చివరిదాకా ఒక కందపద్యంకాగా, రెండో పాదం మొదటి గణంతో ముగిసేది రెండో కందం. అలాగే మూడోపాదం మొదటి గణారంభంనుంచి రెండోపాదాంతం వరకు సాగేది మూడోకందం. చివరిది నాలుగోపాదం రెండో గణారంభం నుంచి మళ్ళీ నాలుగో పాదం మొదటి గణాంతం వరకు సాగేది నాల్గోకందం.

ఇలా ఒక పద్యాన్నే నాలుగు పద్యాలుగా రచించడం రచనా చమత్కృతి. కందంలోని గణాలు మాత్రాగణాలు కావడం అందులోనూ అన్నీ సంబోధనాంత విశేషణాలే కావడంవల్ల చతుర్విధ కందం సులభంగా రూపుదిద్దుకొంది. ఏది ఏమైనా చిదానందరూప చిత్రణమే ఈ చతుర్విధ కందంలోని ప్రధానాంశం.

**1. కరిరాజ పాలపావన**
**చరణా కరుణాలవాల జలజా భరణా**
**హరిభక్త భారభరణా**
**తరుణా శరణమ్ము నీవె ధరణీ వరణా।**

**2. కరుణాల వాల జలజా**
**భరణా హరి భక్త భార భరణా తరుణా**
**శరణము నీవె ధరణీ**
**వరణా కరిరాజ పాలపావన చరణా**

**3. హరిభక్త భార భరణా**
**తరుణా శరణమ్ము నీవె ధరణీ వరణా**
**కరిరాజ పాలపావన**
**చరణా కరుణాలవాల జలజా భరణా.**

4. **శరణమ్ము నీవె ధరణీ**
**వరణా కరిరాజ పాలపావన చరణా**
**కరుణాల వాల జలజా**
**భరణా హరిభక్త భరణా తరుణా.**

## డి. తాత్విక సంఖ్య ఏకస్వరూపం

ఒక్కటి యొక్క రహస్యం : ఒక్కటిలోనే ప్రపంచం ఇమిడి ఉన్నదని 1×1=1 నుంచి 1×10=10 వరకు రచించారు. 'ఏకమేవాஉద్వితీయం బ్రహ్మ![14] పరమాత్మ ఒకటే. నిత్యసత్యం. ప్రపంచం మిథ్య అని, పరమాత్మ నుండి అనేకం ఉద్భవించినదని. ఒక్కటి (పరమాత్మ) తప్ప వేరేలేదని వివరించారు.

"1×1=1 ఏకమేవాஉద్వితీయం బ్రహ్మ యిది యథార్థము సత్య జ్ఞానానంద స్వరూపము, సర్వశక్తి సమన్వితము, సర్వ వ్యాపకము, సుఖమయము, సర్వము, సర్వాధారము, సర్వాతీతము, నిర్గుణము, నిరాధారము, నిత్యము

పరమాత్మయని భగవానుని పరబ్రహ్మయని వ్యవహరింతురు. ఇదియే నీలమేఘ సుందరుడగు శ్రీకృష్ణపరమాత్మ."[15]

"1×2=2 ఆ శ్రీకృష్ణపరమాత్మయే రాధాకృష్ణులు, ప్రకృతి పురుషులు, సీతారాములు, మొదలగు రెండు సంఖ్యలుగా ప్రకాశిస్తున్నది ఒక్కటే తత్త్వము. రెంటిని ఒకటిగానే గమనించిన ఆనందమే ఆనందము. కష్టసుఖాల కీలకము."[16]

మూడు సంఖ్యతో త్రిమూర్తులు, త్రిగుణాలు, త్రితాపాలు, త్రికాలాలు, త్రిసంధ్యలు మొదలైనవి. ఇవన్నీ ఒక్కటిగా చూడవచ్చును. నాలుగు సంఖ్యతో నాలుగువేదాలు, నాలుగు ఆశ్రమాలు, ఐదు సంఖ్యలో పంచభూతాలు, పంచేంద్రియాలు మొదలైనవి. ఆరు సంఖ్యతో షడ్రుతువులు షడ్రుచులు, ఏడు సంఖ్యతో సప్తసాగరాలు, సప్తఋషులు, ఎనమిది సంఖ్యతో అష్టదిక్కులు, అష్టసిద్ధులు, తొమ్మిది సంఖ్యతో నవ గ్రహాలు, నవబ్రహ్మలు. పది సంఖ్యతో దశావతారాలు మొదలైన విశేషాంశాలు వివరిస్తూ రచించారు. ప్రతి సంఖ్యకు ఒక్కటి చేత హెచ్చించారు. నిజానికి ఒక సంఖ్యను అదే సంఖ్యచేత హెచ్చవేస్తే లేదా భాగిస్తే (౯/౯ =1) వచ్చే సంఖ్య ఒక్కటి. కాబట్టి ప్రపంచమంతా అంకెలగారడీ. అంతా పోయినప్పటికి ఒక్కటి మిగిలినట్టుగా పరమాత్మ మాత్రం నిలిచి ఉంటాడని కవిగారి భావన.

పది సంఖ్యలో యెంతో నిగూఢరహస్యం దాగి ఉన్నది. ఒక్కటికి శూన్యం చేరిస్తే పది అయింది. ఇక్కడ శూన్యం మాయ – భ్రాంతి, ఒకటి – సత్యం. అదే ఒకటి తీసివేస్తే విలువలేకుండా పోతుందని శర్మగారు చక్కగా వివరించారు.

ఒక్కటి పరమాత్మ – శూన్యం – మాయ. ప్రపంచం మాయాకల్పితం. మాయను కల్పించింది పరమాత్మ. పరమాత్మ లేని ప్రపంచంలేదని చక్కటి వేదాంత రహస్యాన్ని దీని ద్వారా తెలిపారు.

ఈవిధంగా 'ఏకమేవాஉద్వితీయం బ్రహ్మ' అనే విషయాన్ని సంఖ్యలతో శర్మగారు వివరించారు.

ఇలా శర్మగారు రచించిన ద్వ్యక్షరి, బంధకవిత్వం, గర్భకవిత్వం, తాత్త్విక సంఖ్య ఏక స్వరూపం – అనే వాటన్నిటిలోను జ్ఞానానందమయుడైన ఆ పరమాత్మే దర్శనమిస్తాడు. ఆయన కవిత్వంలో ఎన్ని ప్రయోగాలు చేసినా, చమత్కారాలు చూపినా పరమాత్మ తత్త్వాన్ని, ఆయన స్వరూపాన్ని ప్రాతిపదికగా గ్రహించారు. ఆయన విరచించిన చిత్ర కవిత్వంలోనూ చిదానందరూపమే భాసిస్తుంది.

**జ్ఞాపికలు**


1. శ్రీచంద్రశేఖర విలాసము : విశ్వనాథశర్మ, అప్పాల. పద్యం – 25, పుట. 7
2. తెలుగులో చిత్రకవిత్వము : ధర్మారావు, గాదె. పుట. 117
3. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 4
4. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 6
5. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 7
6. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 8
7. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 9
8. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 1
9. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 3
10. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 2
11. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 5
12. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 12
13. చిత్రకవిత్వం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 10
14. తాత్త్విక సంఖ్య ఏకస్వరూపం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 13
15. తాత్త్విక సంఖ్య ఏకస్వరూపం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 14
16. తాత్త్విక సంఖ్య ఏకస్వరూపం (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట. 15

# 7. సంస్కృత సుప్రభాతాదులు - స్థూల సమీక్ష

తెలుగులోలాగే సంస్కృతంలో కూడా శర్మగారు అనేక రచనలు చేశారు. సుప్రభాతాలు, అష్టకాలు, నవకం, శతకం, స్తోత్రాలు భక్తి భావ బంధురంగా రచించారు.

పాండురంగాశ్రమంలో ముఖ్యదైవమైన పాండురంగ స్వామి, రుక్మిణి మరియు మిగిలిన దేవతామూర్తులైన శివ, ఆంజనేయ, సీతారామచంద్రమూర్తి, రాజరాజేశ్వరి, సత్యనారాయణ మూర్తి, గంగాదేవి మొదలైన దేవతలగూర్చి ముఖ్యంగా తండ్రి మరియు గురువు అయిన శ్రీ భావానందస్వామివారిని గురించి రచనలు చేశారు.

భావానంద సుప్రభాతం, భావానందాష్టకం, భావానంద భకారశతనామ స్తోత్రం భావానంద స్వామివారిని గురించి రచించారు.

**శ్లో॥ "శ్రీ కృష్ణాద్వైత సిద్ధాన్త। స్థాపినం యతిశేఖరమ్।**
**భావనాబల సంపన్నం। భావానంద గురుంభజే॥"[1]**

శ్రీ కృష్ణాద్వైత సిద్ధాంతాన్ని స్థాపించిన వాడు, యతిశేఖరుడు భావనా బలసంపన్నుడైన భావానంద గురువుకు నమస్కారం.

శ్రీకృష్ణాద్వైతం అంటే శ్రీకృష్ణుడు తప్ప రెండవది లేదు అనే భావాన్ని ప్రతిపాదించడం. భావానంద స్వామిపై రచించిన రచనలకు ఈ శ్లోకాన్నే శర్మగారు ప్రార్థనా శ్లోకంగా గ్రహించారు. భావానందస్వామి సమాధికి నమస్కారం చేసేటప్పుడు నేటికీశ్లోకాన్నే చదువుతూ నమస్కరిస్తారు.

## 1. సుప్రభాతాలు - సుమనోహర భక్తి భావ బంధురాలు

విశ్వనాథశర్మగారు ఐదు సుప్రభాతాలు రచించారు. అవి శ్రీ పాండురంగ, శివ పంచాయతన, శ్రీరామచంద్ర, శ్రీ బాలవీర మారుతి, శ్రీ భావానంద సుప్రభాతాలు.

**ఎ). శ్రీ పాండురంగ సుప్రభాతమ్**

**శ్లో॥ "శ్రీరుక్మిణీ విమలచారు ముఖాబ్జ భృంగ**
**శ్రీ రాధికా రసికశేఖర మంగళాంగ**
**శ్రీ పుండరీక వరదాచ్యుత పాపభంగ**
**శ్రీపాండురంగ భగవం స్తవ సుప్రభాతం"[2]**

అంటూ ఈ సుప్రభాతాన్ని పదిశ్లోకాలలో రచించారు. "హే ప్రభూ! నీ ముఖకాంతిచే చంద్రుడు, నిష్ప్రకాశుడై చుక్కల గుంపుతో దూరం వెళ్ళిపోగా నీ దర్శనం కోసం సూర్యుడు ఉదయిస్తున్నాడు. శారదాదులు నీకథను పాడుతున్నారు. శుకోద్ధవాదుల మంగళవాద్యాలు మ్రోగుతున్నాయి. ఉదయమే భక్తులు భీమరథిలో స్నానమాడి నీ పాదద్వయార్చనకు వస్తున్నారు. ప్రభూ! మేల్కొమ్మ"న్నాడు.

దేవా! భవజలధిలో మునిగిన నను వదలి నిద్రిస్తున్నావు. నన్నుద్ధరింపుము. సమయం లేదు. నీపాదపద్మాలకు భక్తితో తులసీ దళాలతో నేను చేసే పూజను యోగనిద్రను వదలి గైకొమ్ము.

**శ్లో॥ "దుగ్ధం కవోష్ణమధునా మధునా చజుష్టం**
**గవ్యం తవేష్ట మతిపుష్ట గుణైర్వరిష్ఠమ్**
**ఏ హ్యేహి పాతు మహిమంచ తలాత్ప్రబుధ్య**
**శ్రీ పాండురంగ భగవం। స్తవ సుప్రభాతమ్॥"[3]**

శేషపాన్పు నుండి లేచి, తేనెతో గూడిన, తీయనైన కొద్దిగా వెచ్చనైన ఆవు పాలను త్రాగుటకురమ్ము.

నీపాదదాసుడైన విశ్వనాథుని ముఖంనుండి వెలువడిన స్తుతిని అంగీకరించ మంటూ స్వామిని వేడుకున్నారు.

ఈ సుప్రభాతం కవితాత్మకంగా ఉంది. భక్తిభావం తోడై దాని రామణీయ కతను వృద్ధిచేసింది. ఇది భగవంతుని మేల్కొల్పేదిగానే గాక శ్రోత / పాఠకుని హృదయంలోని భక్తిభావాన్ని మేల్కొల్పేదిగా ఉంది.

**బి). శ్రీ శివపంచాయతన సుప్రభాతమ్**

శివపంచాయతనం అంటే ఆదిత్యుడు, అంబిక, విష్ణువు, గణనాథుడు, మహేశ్వరుడు – వీరిని గూర్చి రచించిన సుప్రభాతం ఇది.

శివుని గూర్చి ఎనమిది శ్లోకాలు, అంబికను గురించి రెండు శ్లోకాలు, విష్ణువును గూర్చి మూడు శ్లోకాలు, గణనాథుని గూర్చి ఒక శ్లోకం, ఆదిత్యుని గూర్చి ఒక శ్లోకం చివరగా కాలభైరవుడు, వీరభద్రుని గూర్చి ఒక్కొక్క శ్లోకం రచించారు.

**శ్లో॥ "శ్రీ పార్వతీ హృదయవల్లభ। శూలపాణే।**
**కైలాసనాథ। ఫణిభూషణ। భావజారే।**
**సూర్యాగ్ని హోత్ర శశినేత్ర। పినాకధారిన్।**
**గౌరీపతే। భవతు తే శివ। సుప్రభాతమ్॥"[4]**

'గౌరీపతే। భవతుతే శివ సుప్రభాతమ్' అనే మకుటంతో శివుని గురించి 8 శ్లోకాలతో సుప్రభాతాన్ని రచించారు. శివసుప్రభాతంలో స్వామివర్ణనకే ప్రాధాన్యం ఇచ్చారు. శ్రీ పార్వతీ హృదయవల్లభ, శూలపాణి, కైలాసనాథ, ఫణిభూషణ, భావజారే, పినాకధారి మొదలైన సంబోధనలనేకం ఈ సుప్రభాతంలో చోటుచేసు కున్నాయి.

'సకల జీవరాసులకు కుడిచెవిన తారకమంత్రోపదేశం చేసి కాశిలో మరణ సమయంలో మోక్షం ఇస్తున్నావు. దేవా! ఇక్కడ మాకు నీ నామ జపంతో మోక్షం ఏల ఇవ్వవు స్వామీ?' అని ఒక శ్లోకంలో శివుని ప్రశ్నించారు కవి.

అంబికను గూర్చి సుప్రభాతం రెండు శ్లోకాలలో రచిస్తూ, మొదటి శ్లోకంలో శ్రీచక్రరాజ నిలయే, శ్రితలోక పూజ్యే, శివసుందరి, విష్ణుమాయే అనే విశేషణాలతో రచించారు. రెండవశ్లోకంలో

**శ్లో॥ "ధృత్వా కరాబ్జయుగళే – పరమేశి। దర్వీం**
**అన్నం దదాస్యఖిల దేహభృతా మనన్తమ్**
**కారుణ్య పూర్ణ హృదయే। కృపయాన్నపూర్ణే।**
**శ్రీవిశ్వనాథ దయితే। తవ సుప్రభాతమ్॥"[5]**

అన్నపూర్ణాదేవీ! దేహధారులకందరికీ నిండుమనసుతో చేత గరిటను బూని అన్నప్రదాతయై వెలుగొందుమాతా! కారుణ్యంనిండిన హృదయంగలదానా! విశ్వనాథుని భార్యవయిన ఓ తల్లీ! నీకు సుప్రభాతం అని (శర్మగారు) భవానిని మేల్కొల్పారు.

శివపంచాయతనంలో ఒక్కరైన విష్ణువును స్తుతిస్తూ

**శ్లో॥ "ధృత్వా కిరీట మణికుండల కౌస్తుభాదీన్**
**మందారకుంద తులసీయుత రమ్యహారాన్**
**సర్వత్ర సర్వ హృదయేషు విభాసి విష్ణో**
**లక్ష్మీపతే! భవతుతే – శుభసుప్రభాతమ్."[6]**

కిరీటం, మణికుండలాలు, కౌస్తుభం మొదలైన ఆభరణాలతోపాటు తులసీ, మందార పుష్పమాలలతో శోభిల్లుతూ, అంతటా అన్ని హృదయాలలో ప్రకాశించే విష్ణుమూర్తీ నీకు సుప్రభాతం అన్నారు.

విఘ్నాలు అనే అడవిని దహించేవాడైన విఘ్నేశ్వరుని

**శ్లో॥ "ఉత్తిష్ఠ శంభుసుత। సుందర వారణాస్య**
**విఘ్నాటవీ దహన। మూషక దివ్యవాహ।**
**లోకైక పూజ్య। గణనాయక। శూర్పకర్ణ।**
**శ్రీ విఘ్నవారక। విభో తవ సుప్రభాతమ్."[7]**

లోకైక పూజ్యా! మూషకవాహనా! శూర్పకర్ణా! ప్రతి ప్రభాతం నిర్విఘ్నంగా కొనసాగి పోవాలంటూ సుప్రభాతంతో స్వామిని మేల్కొలిపారు.

కవి – "రవీ! హేమిత్రా! తవ శుభ సుప్రభాతం" అని సూర్య భగవానునికి మేల్కొలుపుగా ఒక శ్లోకం రచించారు.

**శ్లో॥ "ఆదిత్య। సూర్య। సవితః ఖగ। హే మరీచే।**
**భానో। రవే। ఖమణి। పూష। హిరణ్యగర్భ।**
**హేమిత్ర। భాస్కర। దివాకర। పద్మమిత్ర।**
**ఛాయాపతే। భవతు తే శుభ సుప్రభాతమ్."[8]**

దినకరుని పదిహేను నామాలతో కీర్తిస్తూ సుప్రభాత సేవ తమ సుప్రభాతం ద్వారా శర్మగారు 'మిత్రు'నికి అందించారు.

ఈవిధంగా శివపంచాయతనంతోపాటు కాలభైరవ, వీరభద్రులను

'శ్రీకాలభైరవవిభో తవ సుప్రభాతమ్' 'హే వీరభద్ర! భవతాత్తవ సుప్రభాతమ్' అనే మాటలతో సేవించారు.

ఈవిధంగా 'శ్రీ శివపంచాయతన సుప్రభాతమ్'లోని పదిహేడు శ్లోకాలతో పరమేశ్వరునికి సుప్రభాత సేవలందిచ్చారు.

## సి). శ్రీసీతారామచంద్ర సుప్రభాతమ్

ఆశ్రమంలో రామాలయం ఉంది. ఆశ్రమ ప్రక్కగ్రామం దామరకుంటలో కూడా రామాలయం ఉంది. ఆ రాముని గూర్చి రచించినదే ఈ సుప్రభాతం. సుప్రభాతాన్ని దామరకుంట వారే అచ్చువేయించారు.

**శ్లో॥ "గాయన్తి - యే - ప్రతిపదం - తవ నామగానం**
**ధ్యాయన్తి - యే - తవ మనోహర దివ్యరూపమ్**
**తే ఘోర - మాతృజఠరం - నపునర్విశన్తి**
**శ్రీ జానకీప్రియ - విభో - తవ సుప్రభాతమ్."[9]**

ఎవరు నీ నామగానం చేస్తారో, ఎవరు నీ అందమైన మూర్తిని ధ్యానిస్తారో వారు తిరిగి జన్మించరు. అంటే రామనామ జపం వల్ల పునర్జన్మ ఉండదు. అలాంటి ఓ జానకీరామా! నీకు సుప్రభాతం.

**శ్లో॥ "ఆయాతి - భానురధునా - తవ - దర్శనార్థం**
**లీనో - బభూవ - భవదీయ - సునామ్ని చంద్రః**
**కుర్వన్తి సద్విజవరాః శ్రుతి రమ్యరావం**
**శ్రీ జానకీ ప్రియ। విభో। తవ సుప్రభాతమ్॥"[10]**

నీ దర్శనంకోసం సూర్యుడు వస్తున్నాడు. చంద్రుడు నీ నామంలో లీనమయ్యాడు. (రామచంద్రా! అని రామున్ని పిలుస్తాం కదా! ఆభావం ఈ వాక్యంలో చెప్పాడు కవి) వీనుల విందుగా పక్షులు ధ్వనిస్తున్నాయి. మేల్కొనమని వేడుకున్నాడు.

'ద్విజ'శబ్దానికి బ్రాహ్మణుడని అర్థం. (జన్మనాజాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః) "సద్వి జవరాః శ్రుతి రమ్యరావం" అంటే బ్రాహ్మణులచే వేదపఠనం రమ్యంగా చేయబడు తుందని అర్థం.

**శ్లో॥ "త్యక్త్వా - భవార్ణవజలే - బత। మామనాథం**
**శేషే కథం తవ సుతం - కరుణా మయస్త్వమ్,**
**ఆయాహి - శీఘ్రు మిహ - మాదృశరక్షణార్థం**
**శ్రీ జానకీ ప్రియవిభో తవ సుప్రభాతమ్॥"[11]**

అనాథ స్థితిలో ఉన్న నన్ను భవజలధిలో వదిలి నీవేల విశ్రమిస్తున్నావు. నా రక్షణ గూర్చి త్వరగా రమ్ముదేవా అని వేడుకున్నారు.

ఈ సుప్రభాతంలో శ్రీరాముని రూపలావణ్యాదులను, నామ మహిమను వివరించారు. స్వామి ఆశ్రితజనరక్షణ పరాయణత్వ విశిష్టతను వివరించారు. తెలుగురచనలలో లాగానే 'జీవుని వేదన'ను వెలిబుచ్చారు.

## డి). శ్రీ ఆంజనేయ సుప్రభాతమ్

ఆశ్రమ క్షేత్రపాలకుడు ఆంజనేయస్వామి. ఆ స్వామి సుప్రభాతం రెండు శ్లోకాలలో రచించారు.

**శ్లో॥ "శ్రీరామభక్త। కపిపుంగవ। దీనబంధో**
**సుగ్రీవమిత్ర। దనుజాంతక। వాయుసూనో।**
**లోకైకవీర। పురపాల। గదాస్త్రపాణే।**
**వీరాంజనేయ। భవతాత్తవ సుప్రభాతమ్॥"[12]**

శ్రీరామభక్త, కపిపుంగవ, దీనబంధు, సుగ్రీవ మిత్ర, దనుజాంతక మొదలైన విశేషణాలతో స్తుతిస్తూ సుప్రభాతం పలికారు.

**శ్లో॥ "ఉత్తిష్ఠ దేవ। శరణాగత రక్షణార్థం**
**దుష్టగ్రహాన్ హన విమర్దయ శత్రుసంఘాన్,**
**దూరీ కురుష్వ భువి సర్వ భయం సదామే**
**వీరాంజనేయ। భవతాత్తవ సుప్రభాతమ్."[13]**

శరణన్న వారిని రక్షించటానికి, దుష్టగ్రహ బాధ తొలగించటానికి, శత్రు నివారణకు, భయాన్ని తొలగించటానికి మేల్కొమ్మని రెండు శ్లోకాలలో ప్రార్థించారు.

## ఇ). శ్రీ భావానంద భారతీ సుప్రభాతమ్

**శ్లో॥ "ధృత్వా దండ కమండలూ కరయుగే రుద్రాక్షమాలాంగళే,**
**కాషాయాంబర ముత్తమం కటితటే। ఫాలే విభూతిం జనా,**
**నుద్ధర్తుం కృపయా భవార్ణవ జలా। దస్మాదృశాన్ సేవకాన్,**
**భావానంద యతీంద్ర జాగృహిగురో। భక్తౌఘ చింతామణే॥"[14]**

గురుదేవుని కీర్తిస్తూ రచించిన సుప్రభాతం ఇది. రెండు చేతులలో దండకమండలాలను, మెడలో రుద్రాక్షమాలను, కాషాయాంబరాలను, నుదుట

విభూతిని ధరించినదేవా! మా బోటి వారిని రక్షింపుమా, సకల పాపాలను, తాపాలను పోగొట్టి కోరిన కోర్కెలు తీర్చే నీ చరణ తీర్థాన్ని ప్రసాదించటానికి మేల్కొమ్ము, ప్రభూ! అంటూ స్వామిని తన జీవితోద్ధారకుడనే భావనతో రచన సాగించారు.

అజ్ఞానంవల్ల కలిగిన మోహపాశాన్ని జ్ఞానఖడ్గంతో ఛేదించి హస్తమస్తక సంయోగంవల్ల మాలాంటివారికి బ్రహ్మానందాన్ని ప్రసాదించడానికి మేల్కొమ్మంటూ కోరారు.[15]

**శ్లో॥ "జ్ఞానార్క స్సముదేతి చిన్మయకరై రజ్ఞాన రాత్రిర్గతా,**
**భూమాకార చిదంబరే మమ మనశ్చంద్రోన సందృశ్యతే,**
**స్నాత్వా భక్తి రసార్ణవే ద్విజతతిర్గాయన్తి సన్మంగళం,**
**భావానంద యతీంద్ర జాగృహి గురో। భక్తౌఘ చింతామణే."[16]**

అజ్ఞానం అనే రేయి గడిచింది. జ్ఞానసూర్యుడుదయించాడు. విశాలమైన చిదాకాశంలో నా మనశ్చంద్రుడు కనిపించటం లేదు. భక్తి సముద్రంలో మునిగి పక్షిజాతి మంగళాన్ని పాడుతున్నాయి. లెమ్ము మేల్కొమ్ము స్వామి అంటూ గురువుకు సుప్రభాతం పలికారు.

**శ్లో॥ "వైకుంఠం నిజపాదపూతనిలయః శ్రీపాండురంగాశ్రమః।**
**కాషాయాంబర మత్ర పీతవసనం శ్రీవత్స చిహ్నం సమం।**
**దండశ్శార్ఙ్గ ధనుస్త్వమే వహి పరో। నారాయణః కేవలం।**
**భావానంద యతీంద్ర జాగృహిగురో। భక్తౌఘ చింతామణే."[17]**

పాండురంగాశ్రమమే వైకుంఠంగా, కాషాయాంబరమే పీతాంబరంగా, శ్రీవత్స లాంఛ నంతో, దండమే శార్ఙ్గ ధనువుగా వెలుగొందే నీవు నారాయణుడవే అంటారు భావానంద యతీంద్రుని కవి. ఈ సుప్రభాతంలో అజ్ఞానమనే చీకటిని తొలగించుట ఒక గురువుకే సాధ్యం అని నిశ్చయాత్మకంగా వివరించారు.

ఈవిధంగా శర్మగారి కవనశక్తి, భక్తి పరవళ్ళు తొక్కుతూ రక్తి కట్టించింది.

## 2). స్తోత్రాలు - గురుదేవానుగ్రహ పాత్రాలు

స్తోత్రమ్ – అంటే స్తుతించడం శర్మగారు రచించిన స్తోత్రాలలో ఎక్కువగా

భావానంద స్వామిని స్తుతించడం కనిపిస్తుంది. ఆస్తుతిలో విన్నపం, గౌరవం, భక్తి, ఆరాధన అనే భావాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

**ఎ). శ్రీ భావానంద స్తోత్రమ్**

శ్రీకృష్ణుడు తప్ప వేరు దైవంలేదు అనే సిద్ధాంతాన్ని స్థాపించిన యతివరుడు భావానంద స్వామి.

**శ్లో॥ "భవసాగర మధ్యస్థానుద్ధర్తుం కృపయా హరే।**
**నామ నౌకా ప్రదాతారం భావానంద గురుం భజే॥"**[18]

(సంసార సాగరాన మునిగిన వారిని ఉద్ధరించుటకు నామస్మరణయను నావను అనుగ్రహించిన గురువు నమస్కారం)

అజ్ఞానమనే చీకటిని తొలగించటానికి, జ్ఞానజ్యోతిగా వెలసిన చిదానంద స్వరూపం, నిర్గుణం, సగుణం, నిరాకారం, నిరంజనం, సాకారం, సర్వాధారం, సర్వగతం, సర్వాతీతం, సర్వాంతర్యామిత్వం అనే పరబ్రహ్మ లక్షణాలు కలవాడని ఈ స్తోత్రంలో వివరించారు.

**బి). శ్రీ భావానంద భకారశతనామ స్తోత్రమ్**

'భావానంద' అనే పేరులోని ఆద్యక్షరం 'భకారం'తో శతనామాలు రచించారు. ఈ స్తోత్రం ఆయన గురుభక్తికి, పితృభక్తికి తార్కాణం.

'భ'కారంతో ఈ నామాలను ఎంతో అర్థవంతంగా రచించారు. ఈ స్తోత్రాన్ని స్తోత్ర మణిరాజంగా పేర్కొనవచ్చు.

**శ్లో॥ "భారతీయ యతిశ్రేష్ఠో - భారతాది ప్రవాచకః,**
**భగవద్భావ సంపూత - యశోదానందన ప్రియః॥"**[19]

('భారతీ' (శ్రీ భావానంద భారతీస్వామి) అను దీక్షానామంగల యతి శ్రేష్ఠుడు, భారతం మొదలగు గ్రంథాలధర్మ సూక్ష్మాలను వివరించేవాడు. భగవద్భావంతో నిండినట్టివాడు. యశోదా నందుడికి (శ్రీకృష్ణుడికి) ఇష్టమైనవాడు శ్రీ భావానంద స్వామి. (యశోదానందుడు అనడంలో శర్మగారి తల్లిపేరు యశోద, యశోద కుమారుడైన తనకూ ఇష్టమైనవాడు) అనే అర్థంతో ఈ శ్లోకాన్ని భావగర్భితంగా రచించారు. ఇందులోని నామాలను గమనిస్తే ఓం భక్తిగమ్యాయ నమః, ఓం భక్తి

దాత్రేనమః, ఓం భానుతేజసే నమః మొదలైన నూరు నామాలు కలిగి, ఇరవై నాలుగు శ్లోకాలలో ఈ స్తోత్రం రచించారు.

దైవ సౌందర్య వర్ణన, ప్రతి అణువులో భగవంతుని దర్శించటం, దైవలీలలు, స్వామి విరహం లాంటి విషయాలు దీనిలో ఉన్నాయి.

### సి). శ్రీ బాలవీర మారుతి స్తోత్రమ్

పాండురంగ ఆశ్రమంలో క్షేత్రపాలకుడుగా భాసిస్తున్న ఆంజనేయస్వామిని ఉద్దేశించి ఈ స్తోత్రాన్ని రచించారు. దీనిలో మొత్తం 11 శ్లోకాలున్నాయి.

శ్లో॥ **"జపన్తం సదా జానకీరామ మంత్రం**
**స్మరన్తం పరబ్రహ్మ భావేన రామమ్**
**ప్రతి గ్రామవాసం ప్రసన్నాంజనేయం**
**భజే పాండురంగాశ్రమ క్షేత్రపాలమ్॥"**[20]

శ్రీరామునే పరబ్రహ్మంగా భావించి, తారకనామం జపిస్తూ ప్రతిగ్రామంలో ఉన్నట్టి శ్రీ పాండురంగ క్షేత్రపాలకుడైన ఆంజనేయ స్వామిని భజిస్తున్నాను.

'భజే పాండురంగాశ్రమ క్షేత్రపాలమ్' అనే మకుటంతో రచించిన ఈ శ్లోకాలలో అనుప్రాసలు, అంత్యప్రాసలు భావానుగుణ పద ప్రయోగం, భక్తి భావం ముప్పేటలుగా కనిపిస్తాయి. భుజంగ ప్రయాత వృత్తం ఆధారంగా కవి రామనామజపం చేసే ఆంజనేయుని సేవిస్తూ తరింపదలచాడు. రాముడు విష్ణ్వవతారం. విష్ణువు శేషశయనుడు. భుజంగశయనుని అవతారమైన రాముని భక్తుడు ఆంజనేయుడు. ఆయనను సంతోషపరచడానికే భుజంగ ప్రయాత వృత్తాన్ని ఎన్నుకున్నాడు కవి.

శ్లో॥ **"అఘఘ్నం రిపుఘ్నం - మనస్సంశయఘ్నం**
**విషఘ్నం భయఘ్నం తథా విఘ్నవిఘ్నమ్**
**త్రి తాపానలఘ్నం హరిం ప్రేమమగ్నం**
**భజే పాండురంగాశ్రమ క్షేత్రపాలమ్"**[21]

పాపాన్ని, శత్రువులను, సంశయాలను, విషాన్ని, భయాన్ని, విఘ్నాలను, తాపాలను పోగొట్టేవాడవు, హరిప్రేమలో నిమగ్నమైన నిన్ను భజిస్తున్నాను. 'ఘ్న'కార ప్రయోగం 'భంజనత్వాన్ని సూచిస్తుంది.

## డి). శ్రీ షిరిడీ సాయిబాబా అష్టోత్తర శతనామస్తోత్రమ్

శ్రీ సాయిబాబా శతనామావళి స్తోత్రమ్ రచించారు. శర్మగారు ఇందులో సాయిచరిత్ర సారాంశం మొత్తం 21 శ్లోకాలలో అందించారు.

**"ధునీపాలో నిరాధారః శిష్యాధారో గురూత్తమః।**
**అజాత శత్రుః సర్వజ్ఞో జలదీప విధాయకః॥"[22]**

జలదీపం వెలిగించినవాడు, సర్వం తెలిసినవాడు. ధునిలోని విభూతితో అడిగినవి ఇచ్చే వాడు, శత్రువులు లేనట్టివాడు, శిష్యులున్నట్టివాడు అని ఈ శ్లోకంలో బాబాను చిత్రించారు. ఈవిధంగా సాగింది సాయిబాబా స్తోత్రమ్.

## ఇ). గంగాపంచరత్న స్తోత్రమ్

గంగాస్తోత్రంలో రత్నాలలాంటి ఐదుశ్లోకాలను రచించారు. శర్మగారు ఈ పంచరత్న స్తోత్రాన్ని తనదైన శైలిలో రచించారు.

**శ్లో॥ "శ్రీమద్భావానంద దివ్యకమండలు వరాలయామ్।**
**ప్రణమామి సదా భక్త్యా గంగాతుంగ తరంగిణీమ్॥"[25]**

భావానంద స్వామి దివ్యకమండలమే మందిరంగా కలిగి, ఉన్నతమైన అలలుగల గంగామాతను భక్తితో ఎల్లప్పుడు నమస్కరిస్తున్నాను.

ఆశ్రమ ప్రాంతంలోని చెరువులు, బావులు అన్నింటిలో గంగామాత నివసించాలని తన ఐదు పద్యరత్నాలు, గంగామాత పాదరత్నాలుగా స్వీకరించాలని వేడుకున్నారు కవి. గంగను భువికాహ్వానించడం, చెరువులు, బావులు నింపమనడం లోకకల్యాణార్థం. పారమార్థిక చింతనగల శర్మగారి లోకకల్యాణమూ ప్రధానమైనదే.

## 4. అష్టకాలు - భక్తి భావ విశిష్టాలు

సంస్కృత సాహిత్యంలో 'అష్టకమ్' అనే ప్రక్రియ విరివిగా కనిపిస్తుంది. అన్నపూర్ణాష్టకమ్, భ్రమరాంబాష్టకమ్, బిల్వాష్టకమ్ మొదలగునవి.

విశ్వనాథశర్మగారు కూడా అష్టకాలను ఎనిమిదింటిని రచించారు. ఇక్కడ అష్టమ సంఖ్యను పాటించారు.

రుద్ర, రుక్మిణీవల్లభ, సీతారామ, కృష్ణ, రాధ, రాజరాజేశ్వరి, సంతోషిమాత, సత్యదేవ అష్టకాలను రచించారు. అష్టకాలలో కూడా మకుటాన్ని పాటించారు.

## ఎ). రుద్రదేవాష్టకమ్

'భజే సర్వదా – చిన్మయం రుద్రదేవమ్' (చిన్మయ స్వరూపుడైన రుద్రదేవుని ఎల్లప్పుడు భజిస్తాను.) అనే మకుటం గ్రహించి, శివుని స్తుతిస్తూ, రుద్రదేవాష్టకాన్ని రచించారు.

**శ్లో॥ "నిరాకార సాకార లింగస్వరూపం**
**శరీరార్థ సంవ్యాప్త గౌరీ స్వరూపమ్**
**చిదానంద రూపం హృదం భోజదీపం**
**భజే సర్వదా చిన్మయం రుద్రదేవమ్."[24]**

నిరాకార, సాకార లింగస్వరూపం, అర్థనారీశ్వర రూపం, చిదానందరూపం, హృదయ కమల దీపమైన చిన్మయమూర్తి శివుని సదా సేవిస్తానన్నారు. నాలుగు 'య' గుణాలు ప్రతి పాదంలోనున్న ఈ పద్యం "భుజంగ ప్రయాత వృత్తం" శివుడు భుజంగ భూషణుడు. స్వామికి ఇష్టమైన భుజంగ ప్రయాతంలో స్వామిని చిత్రించడం ఔచిత్యవంతంగా ఉంది. భుజంగంలా తానూ కవితాలతయై స్వామిని సమీపించాలనే కవి తపన ఈ వృత్తాన్ని స్వీకరించడంలో కనిపిస్తుంది.

## బి). శ్రీ రుక్మిణీ వల్లభాష్టకమ్

'హృదాలయే సదా ముదాభజామి రుక్మిణీధవమ్' (రుక్మిణీశుడైన పాండురంగ స్వామిని నామనోమందిరంలో ఎల్లప్పుడు సంతోషంతో భజిస్తున్నాను) అనే మకుటంతో స్వామి రూప, గుణ విశేషాలను వర్ణించారు.

**శ్లో॥ "కిరీటహార కౌస్తుభైరలంకృతాంగ శోభయా**
**ప్రకాశమాన భక్త హృత్సరోజదివ్య మందిరమ్,**
**స్వవేణుగాన ముగ్ధగోపికా సహస్ర వేష్టితం**
**హృదాలయే సదాముదా భజామి రుక్మిణీధవమ్."[25]**

పంచచామర (జ,ర,జ,ర,జ,గ) వృత్తంతో స్వామిని వర్ణించి, వీవనతో విసరడం అనే (చామరం వీజయామి) ఉపచారం ద్వారా కవి రుక్మిణీధవుని (ఈ శ్లోకంలో) సేవించారు.

## సి). శ్రీ సీతారామ చంద్రాష్టకమ్

ఆశ్రమం పక్కనేగల దామరకుంటలో సీతారామస్వామి మందిరం ఉంది. ఆ

స్వామిని గురించే 'శ్రీ సీతారామచంద్రాష్టకమ్'ను రచించారు. ఆ గ్రామస్థులే ఈ పుస్తకాన్ని అచ్చువేయించారు. రామాయణసారాన్ని అంతా ఈ శ్లోకాలలో నింపారు. శ్రీరాముని మోహన రూపాన్ని పాఠకుని హృదయంలో హత్తుకొనేవిధంగా వర్ణించారు.

రామనామ మాధుర్యం, విశిష్టతలను ఈ శ్లోకాలలో వివరించారు. "భావయేహృది – జానకీ ప్రియ రామచంద్ర మహర్నిశం" – (జానకీపతి రామ చంద్రుని ఎల్లప్పుడూ నా మనస్సులో భావిస్తున్నాను) అనే మకుటంతో సీతారాముని వర్ణిస్తూ కవి ఈ అష్టకం రచించారు.

**శ్లో॥ "కాంచనాంబర ధారిణం – సుకిరీట కుండల మండితం**
**రత్నకంకణ కౌస్తుభాది – విభూషణై స్సమలంకృతమ్**
**దివ్యచందన – లేపితాంగ – సుగంధ పూర్ణ నిజాలయం**
**భావయే హృది – జానకీప్రియ – రామచంద్ర మహర్నిశమ్."**[26]

రాముడు పీతాంబరంతో అనేక భూషణాలతో, దివ్యమైన చందనం పూయబడిన అంగాలతో అలరారుచున్నాడని వర్ణించారు.

రాముని సాకార అలంకృత సౌందర్య రూపాన్ని కవీశ్వరుడు 'మత్తకోకిల'లా గానం చేశారు. గానానికి కోకిల ప్రసిద్ధి. కవితాగానానికి మత్తకోకిలావృత్తం ప్రశస్తం.

ఇలా ఈ అష్టకంలో స్వామిని వివిధ రూపాలలో దర్శించి తరించారు కవి.

## డి). శ్రీకృష్ణ ప్రేమాష్టకమ్

ప్రేమ స్వరూపుడు కృష్ణుడు. భక్తి భావంతోనే కాదు, తనపై ప్రేమభావనతో ఆరాధించిన గోపికలను ఉద్ధరించినవాడాయన. తననూ స్వామి అలా ఉద్ధరించా లనే భావంతో "శ్రీకృష్ణ ప్రేమాష్టకమ్" రచించారు శర్మగారు.

**శ్లో॥ "అసారే సంసారే విషయ విషపూరే పటుతరే**
**ప్రవాహే ఘోరే మాం మలిన తరమోహేన పతితమ్।**
**భ్రమన్తం ధావన్తం మనసి విలపన్తం కరుణయా**
**సముద్ధర్తుం కృష్ణో వసతు మమ హృద్ధామ్ని సతతమ్."**[27]

మోహపూరితమైన సారంలేని సంసారం అనే ప్రవాహంలో పడి తిరుగుతూ

పరువు లిడుతూ మనస్సులో కలత చెందుతున్న నన్ను దయతో ఉద్ధరించటానికి తమ హృదయ ధామంలో శ్రీకృష్ణుడు సదా నివసించాలని కోరుకున్నారు.

ఈశ్లోకంలోని భ్రమన్తం, ధావన్తం, విలపన్తం అనే పదప్రయోగాలు "శిఖరిణీ వృత్తం" యొక్క విశిష్టతను తెలుపుతున్నాయి. భగవంతుని రూపం మనసులో నిలిస్తేనే జీవునికి మోక్షం అనే విషయాన్ని ఈ శ్లోకంలో ఘంటాపథంగా చెప్పారు. స్వామియొక్క పరిపూర్ణ ప్రేమకు పాత్రుడు కావాలనే కోరికతో ఈ అష్టకం రచించారు కవి.

## ఇ). శ్రీ రాధాష్టకమ్

కృష్ణునితో కనిపించే దివ్యమూర్తి రాధాదేవి. రాధ ప్రకృతి, కృష్ణుడు పురుషుడు. ప్రకృతి పురుషైక్యరూపమే పరిపూర్ణ భగవత్తత్వం కృష్ణాష్టకమ్ వ్రాసిన కవికి రాధాష్టకమ్ వ్రాస్తే తప్ప కవి కవితాతపస్సు ఫలవంతం కాదు. అందుకే శర్మగారు 'భావయామి నిరంతరం హృదిరాధికాం హరి వల్లభామ్' (హరిప్రియ అయిన రాధికను సదా మదిలో భావిస్తున్నారు) అంటూ రాధాష్టకమ్ రచించారు.

**శ్లో॥ "పద్మరాగ పదద్వయీం నవ పద్మ వర్ణతను ప్రభాం**
**పద్మగంధ సుగంధినీం వరపద్మ కోమల కోమలీమ్**
**పద్మసద్మ నివాసినీం జితపద్మ పత్ర సులోచనాం**
**భావయామి నిరంతరం హృదిరాధికాం హరివల్లభామ్."**[28]

పద్మరాగాన్ని బోలేపాదాలు, కొత్తపద్మం యొక్క వర్ణంలా ప్రకాశించే మేను, పద్మగంధియై, శ్రేష్ఠమైన పద్మ కోమలతను కలిగినదై, పద్మ నివాసినియై, పద్మ పత్రాలను జయించిన కన్నులు గలిగిన రాధికను నా హృదయంలో భావిస్తున్నాను అని వర్ణించారు.

ఈ వర్ణన సర్వం రాధను ప్రకృతి స్వరూపిణిగా నిలిపింది. సర్వం పద్మ మయంగా చిత్రించడంవల్ల 'పద్మ' అంటే లక్ష్మీదేవి కావడంవల్ల 'ఆమె సాక్షాత్తు లక్ష్మీదేవియే' అనే భావాన్ని కవి మనకు కలిగించారు.

రాధాకృష్ణ ప్రేమతత్త్వాన్ని మనోహరంగా ఈ అష్టకంలో కవి వర్ణించారు. అంతేకాదు రాధాకృష్ణుల కభేదం చెబుతూ

**శ్లో॥ "శ్రీ కృష్ణో రాధికా కారః॥ శ్రీ రాధాకృష్ణరూపిణీ॥**
**ఏకమేవ పరంబ్రహ్మ॥ ద్విధా భాతి నసంశయః॥"[29]**

(రాధికయే కృష్ణుడు, కృష్ణుడే రాధిక. ఒక పరబ్రహ్మ రెండు విధాలుగా కన్పిస్తున్నాడు. సంశయంలేదు) కాబట్టి రాధామాధవుని సేవించమని ఈ అష్టకంలో ప్రతిపాదించారు.

## ఎఫ్). శ్రీ రాజరాజేశ్వర్యష్టకమ్

శ్రీ రాజరాజేశ్వరీదేవిని పాండురంగస్వామి మందిరంలోనే పక్కన ఉన్న శివాలయంలో ప్రతిష్ఠించారు. ప్రతి సంవత్సరం అమ్మవారి శరన్నవరాత్రులు జరుపుతారు. నిత్యం శ్రీ చక్రార్చన చేస్తారు.

నిత్యం ఆశ్రమంలో అన్నదానం చేస్తారు. అందువల్ల ఈ అష్టకంలో రాజరాజేశ్వరీ దేవిని అన్నపూర్ణాదేవిగా అభివర్ణించారుకవి. లలిత, భవాని, భువనేశ్వరి, గౌరి, మంగళరూపిణి, శ్రీకృష్ణమాయ, మీనాక్షీ, దుర్గ అని అన్ని రూపాలలో ఉన్న రాజేశ్వరీ దేవిని "దేవీం నౌమి సదా మదీయ జననీం శ్రీరాజరాజేశ్వరీం' అంటూ స్తుతించారు. 'శార్దూల విక్రీడితం' ఎన్నుకొని అంబను శార్దూల వాహనంపై దర్శింపజేశారు.

**శ్లో॥ "మోహాంధం కృత కర్మమార్గ పథికం దేహాత్మ భావాన్వితం**
**నానా యోని సహస్ర జన్మ మరణ శ్రాంతం జడం పాపినమ్॥**
**దీనం మాం శరణాగతం కరుణయాత్రాతుం సమర్థాం ముదా**
**దేవీం నౌమి సదా మదీయ జననీం శ్రీ రాజరాజేశ్వరీమ్."[30]**

'దుర్గతిని నశింపజేసేది, మోహాంధకారం తొలగించేది, అనేక జన్మలనుండి పుట్టటం, గిట్టటం సంభవిస్తున్నది. కాబట్టి ఆ భావ పరంపరను, తాపత్రయాలను తొలగించేది ఆతల్లి అని పేర్కొన్నారు.

భావానందస్వామి నిర్మించిన ఆశ్రమంలో సంచరిస్తూ, నిత్యాన్నదానాలచే సంతుష్టురాలవై, కృష్ణుని ఆరాధించే విశ్వనాథకవి హృదయంలో నిలిచిన జననీ' నమస్కరిస్తున్నాను. 'కృష్ణా రాధక విశ్వనాథ హృదయారాధ్యాం జగన్మాతరం'[31] అని కృష్ణ భక్తుడైనప్పటికీ ఈ విశ్వనాథుని హృదయంలో 'తల్లి'గా నిన్ను

సేవిస్తున్నాడు అనే అర్థం ఒకటి. మరో అర్థంలో విశ్వనాథుడు శివుడు. శివుడు హరిని ఎల్లప్పుడు ధ్యానిస్తూ ఉంటాడు. అలా ధ్యానించే శివుని హృదయంలో స్థానం సంపాదించి ఆరాధింపబడుతున్న జగన్మాతవు తల్లీ! అలాంటి నీకు నమస్కారం అని రెండు అర్థాలు వచ్చేటట్లుగా విశ్వనాథశర్మగారు రచించి, జగన్మాత హృదయాన్ని కరుణారసార్ద్రభరితం చేశారని చెప్పవచ్చు.

## జి). శ్రీ సంతోషి మాత్రష్టకమ్

శ్రీ సంతోషిమాత ఆలయంలోని అమ్మవారిని గూర్చి శ్రీ వేదాటి రఘుపతి శర్మగారు కోరగా శర్మగారు ఈ అష్టకాన్ని రచించారు.

దీనిలో అమ్మవారి దివ్యమంగళ విగ్రహాన్ని వర్ణించి, ఆమూర్తిని సేవించే వారికి కలిగే సకల శుభాలను వివరించారు.

**శ్లో॥ "భూతప్రేత పిశాచరోగశమనీ దుఃఖాబ్ధి సంతారిణీ**
**అష్టైశ్వర్య విధాయినీ శుభకరీ దారిద్ర్య విధ్వంసినీ**
**బింబోష్ఠీ పరమేశ్వరీ పరశివా దేవీ జగన్మోహినీ**
**భూయాన్మేవరదా సమస్త జననీ సంతోషిణీ సత్వరమ్."**[32]

భూతప్రేత పిశాచాది దోషనాశినిగా, అష్టైశ్వర్య ప్రదాయినిగా, దారిద్ర్యాది దుఃఖ శమనిగా పేరొందిన జగజ్జనని సంతోషాన్ని కలుగజేయుమని ప్రార్థించారు.

"భూయాన్మేవరదా సమస్త జననీ సంతోషిణీ సత్వరమ్' ప్రపంచానికి తల్లియైన సంతోషి మాత తొందరగా వరాలిచ్చే దేవత కావాలని మకుటంలో కోరుకున్నాను.

సంతోషిమాత అష్టకం చదివేవారందరికి సంతోషాన్ని కలుగచేయాలని ఫలశ్రుతిలో పేర్కొన్నారు.

## హెచ్). శ్రీ సత్యదేవాష్టకమ్

ప్రతి శుభకార్యంలో హిందువులు పవిత్రంగా చేసే వ్రతం, శ్రీ సత్య నారాయణ స్వామి వ్రతం. కొందరు పౌర్ణమినాడు, సంక్రమణంనాడు నిష్కామంగా ఈ వ్రతాన్ని నిర్వహిస్తారు. ఈ వ్రత మహిమ తెలియనివారు లేరు.

శ్రీ సత్యదేవుని పవిత్రతను, రూపాన్ని, గుణగణాలను, వ్రతం విశిష్టతను వివరిస్తూ శర్మగారు ఈ అష్టకాన్ని రచించారు.

శ్రీ మహావిష్ణువే సత్యదేవుడు. ఆ విష్ణువు శంఖ, చక్ర, గదాధరుడై చతుర్భుజా లతో ప్రకాశిస్తూ కిరీటాది భూషణాలు ధరించి, మెరుపు తీగలాంటి వస్త్రాలు ధరించి నా మనఃకమలపీఠంపై కూర్చున్న రమాపతియైన సత్యదేవుని సదా భజిస్తున్నాను.

కోటిసూర్య ప్రకాశంగలవాడు. వైకుంఠ నివాసుడు, మత్స్య, కూర్మాది అవతారాలు దాల్చినవాడైన హరిని భజిస్తున్నాను.

స్వామి వ్రతమహిమ, ప్రసాద మహిమ విశిష్టమైనదని వర్ణించారు.[33]

రెండవ శ్లోకంలో 'భుజంగేశయానం విహంగేశయానం' అను పాదాన్ని చూస్తే 'భుజంగేశ యానం' - అనగా శేషతల్పంపై శయనించే వాడవని, 'విహంగేశ యానం' పక్షీంద్రునిపై ప్రయాణించే వాడవని వర్ణించారు. ఇక్కడ ఛేకానుప్రాసతో స్వామి యొక్క రూపలావణ్యాదులను కనులకు కట్టినట్లు వర్ణించారు.

**శ్లో॥ "త్రిమూర్తి స్వరూపం త్రిలోకేషు పూజ్యం**
**త్రితాపార్తి నాశం త్రిసంధ్యా సువంద్యమ్,**
**త్రికాలేషు నిత్యం త్రిసత్యాతి సత్యం**
**భజే శ్రీ రమావల్లభం సత్యదేవమ్."[35]**

బ్రహ్మ విష్ణు మహేశ్వరులైన త్రిమూర్తులయొక్క రూపాలు కలిగినవాడు. స్వర్గ మర్త్య పాతాళాలనే మూడులోకాలలో పూజింపదగినవాడు, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపాలచే ఆవేదన పొందినవారి కష్టాలను పోగొట్టేవాడు, ఉదయ, మధ్యాహ్న, సాయం సంధ్యలలో వందనీయుడు, భూత భవిష్యత్ వర్తమాన కాలాలలో ఎలాంటి మార్పులేనివాడు, జగత్తు, ఈశ్వరుడు అనే (మూడు సత్యాలు 1. మిధ్య యగు జగత్తులో సత్యస్వరూపుడైనవాడు, 2. జడచైతన్య స్ఫూర్తి జీవుడు విశ్వతేజస ప్రాజ్ఞుడు అయిన ఆ జీవునిలో సత్యస్వరూపుడై ఉన్నాడు, 3. ఈశ్వరుడు. హిరణ్య గర్భుడు, విరాట్టు, అవ్యాకృతుడుగనున్న ఈశ్వరునిలో సత్యస్వరూపుడు) సత్యాల స్వరూపుడు, సత్యజ్ఞానానంద స్వరూపుడు (అతి సత్యం) అయిన సత్యదేవుని భజిస్తు న్నాను. అని త్రిమూర్త్యాత్మకత్వం, సర్వవ్యాపకత్వంలను ఒకే శ్లోకంలో వివరించారు.

## 4). "భావనవనీతమ్" (సప్తవింశతి) భక్తి ప్రబోధకం

నవనీత ప్రియుడైన శ్రీకృష్ణుని యశోద, గోపికలు నవనీతంతో మెప్పించారు.

విశ్వనాథ శర్మగారు తమ కవితా హృదయాన్ని మథించి, 'భావమనే' నవనీతాన్ని స్వామికి అందించారు. ఒక్కొక్క శ్లోకాన్ని ఒక నవనీతపు ముద్దగా 27 శ్లోకాలలో భావనవనీతాన్ని అందించారు. అదే మురళీధర సప్తవింశతి.

మురళీధర సప్తవింశతిలో 'భావయామి నిరంతరం మమ మానసే మురళీ ధరం' అనే మత్తకోకిలావృత్త మకుటాన్ని స్వీకరించారు.

భక్తి అనే పదానికి శంకర భగవత్పాదులు శ్రీ వివేక చూడామణిలో రెండు నిర్వచనాలు ప్రతిపాదించారు.

అందులో మొదటిది "స్వాత్మ తత్త్వాను సంధానం" – భక్తి రిత్య పరే జగుః "[36] అంటే 'స్వ స్వరూపాన్ని ఉపనిషత్తులలోను, బ్రహ్మసూత్రాలలోను, భగవద్గీత లోను ప్రతిపాదించిన విధంగా ఎల్లప్పుడు అనుసంధానం చేయటం లేదా ధ్యానించటం భక్తి. భక్తి దశలలో మూడవదైన – "త్వమేవాఽహమ్"[37] నీవే నేను. అనే భావనతో ధ్యానించటం రెండోది.

శర్మగారు పై లక్ష్యంతో తమ మనోభావ నవనీతాన్ని స్వామికి అర్పించారు.

శ్లో॥ **"వేదశాస్త్ర పురాణ నిర్గత సార మక్షర మవ్యయం**
**నిత్యసత్య సనాతనం యదుభూషణం భవశోషణమ్,**
**చారు చందన చర్చితాంగ సుగంధ పూర్ణ దిగంతరమ్**
**భావయామి నిరంతరం మమ మానసే మురళీధరమ్."[38]**

నాశంలేని వేదశాస్త్రసార శాశ్వత మూర్తిని, చందన లేపిత దేహంగల మురళీధరుని నా మనస్సులో భావిస్తున్నాను అంటారు. ఆదిశంకరుల ఆది నిర్వచనానికి ఈ శ్లోకం లక్ష్య ప్రాయం.

కృష్ణుని లీలలు, రాసక్రీడ, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, భక్తకల్పతరుత్త్వం కృష్ణ సౌందర్యం, పరబ్రహ్మ మయత్వం ఆయన రచించిన శ్లోకాలలో చోటుచేసుకున్న కొన్ని అంశాలు.

'శ్రీకరం రిపుభీకరం కరుణాకరం సుగుణాకరం'[39] శుభాన్ని కలుగజేసేవాడు, శత్రువులకు భయంకరమైనవాడు, కరుణామయమూర్తి, సుగుణాకరుడు అని దీని అర్థం. కాని ఒకే పాదంలో నాలుగు 'కరం'లు వాడడంవల్ల మురళీధరుడు

చతుర్భుజుడని స్ఫురింపజేశారు. ఈవిధంగా భావ నవనీతంతోపాటు శబ్ద ప్రయోగ నవనీత మాధుర్యాన్ని కూడా అందించారు.

సప్తవింశతి అనగా 27, నక్షత్రముల సంఖ్య 27, దీనిని 'నక్షత్రమాల' అనే పేరుతో వ్రాయటం కనిపిస్తుంది.

## 5. శ్రీ రాజేశ్వరీ నవకమ్

ఈ 'నవకమ్'లో తొమ్మిది శ్లోకాలలో అమ్మవారిని స్తుతించారు. 'పాతుమాం సర్వదా రాజరాజేశ్వరీ' 'రాజేశ్వరీ దేవి ఎల్లప్పుడు మమ్ములను రక్షించుము) అనే మకుటంతో ఈరచన సాగింది.

**"యే యథామాం ప్రపద్యన్తే। తాంస్తథైవ భజామ్యహమ్।**
**మమవర్త్మాను వర్తన్తే। మనుష్యాః పార్థ సర్వశః॥"**[40]

'ఎవరెవరు ఏయే విధంగా నన్ను ధ్యానం చేసి సేవిస్తున్నారో వారిని అదే విధంగా అనుగ్రహిస్తున్నాను. మనుష్యులంతా అన్నివిధాలుగా నా మార్గాన్నే అనుసరిస్తున్నారు'. అని భగవద్గీతలో స్వయంగా శ్రీకృష్ణుడే వివరించారు. స్వామిని, దేవిని అష్టకాలలో, నవకాలలో ఏవిధంగా స్తుతించినా లక్ష్యం ఒకటే. ఆ స్వామిని చేరడం.

**శ్లో॥ "సర్వదేవాత్మికా - సర్వమంత్రాత్మికా**
**సర్వయంత్రాత్మికా - సర్వతంత్రాత్మికా**
**సర్వలోకేశ్వరీ - సర్వభూతప్రియా**
**పాతుమాం సర్వదా - రాజరాజేశ్వరీ!"**[41]

సర్వం రాజరాజేశ్వరీ దేవియే అని ఈ శ్లోకంలో వివరించారు.

దేవి స్తుతిని, మహిమను ఈ నవకమ్‌లో వర్ణించి, చివరగా 'భావుకం సేవకం - విశ్వ నాథం సుతం' అంటూ నీ కుమారుడు, ఎల్లప్పుడు ధ్యానిస్తూ సేవిస్తుంటాడని ముగించారు.

ఏ స్తుతిలోనైనా, తాను భగవత్ సేవకుడనని, దయను ప్రసాదించమని వేడుకున్నారు. ప్రతి స్తోత్రంలో 'శరణాగతి' యే ఎక్కువగా కన్పిస్తుంది.

## 6. "నమామి మురళీధరమ్" వైవిధ్యభరిత శతకం

నమామి మురళీధరమ్ అని శర్మగారు 87 శ్లోకాలతో ఒక స్తోత్రమ్ రచించారు. అందులో 32 శ్లోకాలు, 'నమామి హరివల్లభామ్' (కృష్ణుని వరించిన రాధికకు నమస్కరిస్తున్నాను) అనే దాన్ని మకుటస్థానంలో గ్రహించి రచించారు. 31 శ్లోకాలు 'నమామి మురళీధరమ్' (మురళీధరుడైన శ్రీకృష్ణుని నమస్కరిస్తు న్నాను) అనేపాదాన్ని శ్లోకం చివరి పాదంగా గ్రహించి రచించారు. మిగిలిన 24 శ్లోకాలలో గురువు, పాండురంగస్వామి, రాధాకృష్ణైక్యతను గూర్చి రచించారు.

**శ్లో॥ "భావానంద మయందేవం - సచ్చిదానంద విగ్రహం**
**ఆధారం సర్వలోకానాం - రాధాకృష్ణముపాస్మహే."[42]**

ఈ మొదటి శ్లోకంలో రాధాకృష్ణుని ఉపాసిస్తున్నాను. అంటూ ఈ ఉపాసనకు మూల కారణమైన గురువు శ్రీ భావానంద స్వామి. శర్మగారు సర్వలోకాలకు ఆధారం గురువు (కృష్ణుడు) అంటూ గురుభక్తితో కూడిన కృష్ణభక్తిని ప్రకటించారు.

తరువాత శ్లోకంలో 'కృష్ణం వందే జగద్గురుం' అనే భావనను దృష్టిలో పెట్టుకుని గురువులకు గురువు అని వివరించారు.

ఇంకా కొన్ని శ్లోకాలలో కటిపై హస్తాలతో నిలిచిన పాండురంగడని, పాండురంగా శ్రమంలో నిలిచిన స్వామి అని శ్రీకృష్ణుని వర్ణించారు.

**"రుక్మిణీ రాధికాచేతి - నామద్వయ విభూషితాం**
**ఏకారాధా ద్విధాభాతి - శ్రీరాధా ఉభయాత్మికా."[43]**

ఈ శ్లోకంలో రుక్మిణియే రాధగా, ఒకే రూపం రెండు విధాలుగా కన్పిస్తుందనే భావం వివరించారు.

**"శ్రీకృష్ణో రాధికాకారః - శ్రీ రాధా కృష్ణరూపిణీ**
**ఏకమేవ పరంబ్రహ్మ - ద్విధాభాతి న సంశయః"[44]**

శ్రీకృష్ణుడే రాధిక, రాధికయే కృష్ణుడు. ఆ పరబ్రహ్మ స్వరూపం రెండు రూపాలుగా ఏర్పడిందని, రాధాకృష్ణులు ఒకటే అని నిరూపణ చేయాలనే సత్సంకల్పంతో శర్మగారు ఈ రచన చేపట్టారు. (ఈ రచనలో కవి 'రాధాకృష్ణౌ గతిర్మమ' 'కృష్ణఏవ సదామమ' 'సర్వం కృష్ణార్పణం భవేత్' అనే వాటిని చివరిపాదంగా గ్రహించి కొన్ని శ్లోకాలు రచించారు)

**శ్లో॥ "అపశబ్ద భయం నాస్తి - రాధాకృష్ణస్య సన్నిధౌ**
**నగ్రహిష్యతి శబ్దార్థం - భావ గ్రాహీ జనార్దనః"[45]**

శ్రీరాధాకృష్ణుడు భావాన్ని స్వీకరించేవాడే కాని, శబ్దార్థాలను గ్రహించేవాడు కాదని 'అపశబ్ద భయంనాస్తి' అని చమత్కారంగా వివరించారు.

ఇలా 22 శ్లోకాలవరకు రాధాకృష్ణులను ఒకేచోట వర్ణించిన శర్మగారు 23వ శ్లోకం నుండి ఒక శ్లోకం రాధికను, ఒక శ్లోకం కృష్ణుని వర్ణించడానికి స్వీకరించారు. ఈ జంట శ్లోకాలలో వర్ణన, ఆరాధన, ప్రేమ, భక్తి ఏవిషయమైనా ఒకేవిధంగా వర్ణించటం విశేషం.

**శ్లో॥ "శ్రీకృష్ణ ప్రేమ సామ్రాజ్య - దివ్య సింహాసనేశ్వరీం**
**సదా ద్వాదశ వర్షీయాం - నమామి హరివల్లభాం॥"[46]**

**శ్లో॥ "శ్రీ రాధాప్రేమ సర్వస్వ పట్టభద్రం దయానిధిం**
**సదా షోడశ వర్షీయం - నమామి మురళీధరం."[47]**

శ్రీకృష్ణప్రేమ సామ్రాజ్ఞి, ఎల్లప్పుడు 12 ఏళ్ళ వయస్సులో ఉండే రాధాదేవికి నమస్క రిస్తున్నాను. రాధాప్రేమకు పట్టభద్రుడు, ఎల్లప్పుడు 16 ఏళ్ళ వయసులో ఉన్న మురళీధరునికి నమస్కరిస్తున్నాను అని శర్మగారు వెంటవెంట శ్లోకాలలో ఒకేవిధంగా వర్ణించారు.

ఈవిధంగా బృందావన సంచారం, రాసలీల, ముగ్ధమనోహర సౌందర్యం, లీలామానుషత్వం మొదలైన ఘట్టాలను గ్రహించి పాఠకులచే నవనీతమాధుర్యాన్ని, మురళీగాన మాధుర్యాన్ని ఆస్వాదింప చేశారు శర్మగారు.

**శ్లో॥ "చతుర్భుజం దేవరూపం। ద్విభుజం సౌమ్య రూపిణం**
**జగద్రూపం జగన్నాథం। నమామి మురళీధరం"[48]**

**శ్లో॥ "లక్ష్మీరూపేణ వైకుంఠే - గోలోకే రాధికాఖ్యయా**
**రాజమానాం మహాదేవీం - నమామి హరివల్లభామ్."[49]**

చివరగా చతుర్భుజుడైన నారాయణుడు, మహాలక్ష్మీయే శ్రీకృష్ణారాధికలని, ఆ వైకుంఠమే - గోలోకమని చెపుతూ తన రచనను ముగించారు.

దీనిలో మరో 13 శ్లోకాలు వ్రాస్తే శతకం పూర్తయ్యేది. కాని శర్మగారు 87 శ్లోకాలతోనే ముగించారు. ప్రతి ప్రక్రియలో ఒకే మకుటంతో రచన

కొనసాగించారు. కాని ఇందులో మూడు, నాలుగు మకుటాలు ఎన్నుకోవడం, 87 శ్లోకాలతో ముగించటం వెనుక శర్మగారు కేవలం కృష్ణప్రేమ తత్త్వంలో మునిగి, కలాన్ని నడిపించి ఉంటారు. ఛందస్సును శ్లోక పరిమితిని దృష్టియందు ఉంచుకోలేదని అనిపిస్తుంది. ఇందులో 10వ శ్లోకంలో మొదటి రెండు పాదాలు వ్రాసి మూడు నాలుగు పాదాలు వ్రాయలేదు. కేవలం కృష్ణ... అని ఆపేశారు. తర్వాత దానిని పూరించటానికి ప్రయత్నించలేదు.

మొత్తంమీద ఈరచన జ్ఞానమార్గంతో కూడిన భక్తితత్వాన్ని అందిస్తుంది. గర్గ భాగవతసారం, చైతన్య భక్తి సంప్రదాయ ఛాయలు దీనిలో గోచరమవుతున్నాయి. ఈ రచన చదివే పాఠకులకు శ్రీకృష్ణరాసక్రీడ కనులకు కట్టినట్లు కన్పిస్తుందనటంలో అతిశయోక్తిలేదు.

## 7). ప్రపన్న శతకమ్ : వైరాగ్య భావ శోభితం

తెలుగు భాషలో రెండు శతకాలకు రచించిన శర్మగారు సంస్కృతంలో ఒక్క శతకాన్నే రచించారు. "అదే ప్రపన్నశతకమ్"

స్వామి 'ఆర్తత్రాణ పరాయణుడు' అనే బిరుదు కలవాడు. కాబట్టి ఆ స్వామిని 'శరణు'కోరారు. మకుటంలో 'రక్షమాం శరణాగతమ్' అన్నారు. శరణన్న వారిని రక్షించడం స్వామికి కొత్తేమీకాదు. అలనాడు గజేంద్రుని, ద్రౌపదిని, శబరిని, ప్రహ్లాదుని రక్షించిన శ్రీ మహావిష్ణువు, తనను కూడా రక్షించాలని కోరుకున్నాడు.

భక్తి సంప్రదాయంలో 'శరణాగతి' కూడా ఒకటి. ఇంత వరకు వ్రాసిన స్తుతులలో స్వామిని కీర్తించడం, వర్ణించడం, స్వామి మహిమను గూర్చి చెప్పడం మొదలైన విషయాలకు ప్రాధాన్యమిస్తే, ఇందులో కేవలం భవసాగరాన్ని దాటించమని, మోక్షసామ్రాజ్యాన్ని అందించ మని పలువిధాలుగా వేడుకున్నారు.

**శ్లో॥ "అసారే ఘోర సంసారే దుఃఖపూర్ణ మహాప్రదే।**
**పతితం బాలగోపాల। రక్షమాం శరణాగతమ్॥"**[50]

సారంలేని ఘోరసంసారం, దుఃఖంతో కూడుకున్నది.

ఇందులో పడిననన్ను రక్షించమని వేడుకున్నారు. ఈ శతకంలో ఎక్కువగా అశాశ్వత సంపదకన్న, శాశ్వత సుఖాన్నిచ్చే విషయాన్ని గూర్చి రచించారు.

**“జన్మమృత్యు జరా వ్యాధి - భయశోక సమన్వితమ్”**
**“కృతకర్మ మహామార్గ పథికం - భవకాననే”**
**“వ్యర్థప్రలాప సల్లాపైః వృథా భూద్గత జీవనమ్”**
**“కారాగార సమాగారే బద్ధోహం తవ మాయయా”**
**“జన్మ దుఃఖం జరాదుఃఖం మృత్యుదుఃఖం పునఃపునః”**
**“కాలస్య కరుణానాస్తి - జీవితం క్షణ భంగురమ్”**

అంటూ ‘అశాశ్వతమైన వాటిలో చిక్కుకున్నాను. ఏవిధంగానైన రక్షించమ’ని వేడు కున్నారు.

రక్షించే స్వామిని ‘ఆర్తత్రాణ పరాయణ’, ‘ఆపద్బాంధవ’ ‘దయాసాంద్ర’ ‘దయాపూర’ ‘శరణాగత భక్తార్త పరిత్రాణ పరాయణ’ ‘కరుణామయ’ ‘వాత్సల్య పూర్ణహృదయ’ ‘భక్తవత్సల’ ‘దీనబంధో’ ‘దయాసింధో’ అంటూ కరుణామూర్తిని, కరుణామృతాన్ని కురిపించాలని కీర్తించారు.

56వ శ్లోకంలో ‘గతాని’ పంచ పంచాశద్వర్షాణి మమమాధవ’ అంటూ 55 ఏళ్ళ జీవితం గడిచిందని, ఇక ఉపేక్ష చేయవద్దని శరణుకోరారు.

సర్వకాల సర్వావస్థలయందు రక్షించమని, అనాయాస మరణం ఇవ్వమని, ఆ సమయంలో భగవన్నామ స్మరణం జ్ఞప్తిలో ఉండాలనే విషయాన్ని ప్రస్తావించారు.

ఈశతకంలో ‘భజగోవింద స్తోత్రమ్’లోని సారం ప్రస్ఫుటమౌతుంది. వైరాగ్య భావం, స్వామికై విరహం, కాలం గూర్చిన భయం, మృత్యువు ఆగమనం మొదలైన విషయాలను శ్లోకాలలో ప్రస్తావించారు.

**“నంద నందన గోవింద। యశోదానంద వర్ధన**
**బృందావనాంత సంచార। రక్షమాం శరణాగతమ్॥”**[51]

కొన్ని శ్లోకాలలో స్వామిని అనేక నామాలతో స్తుతించారు.

ఈశతకసారం గమనిస్తే శర్మగారు గొప్ప శ్రీకృష్ణభక్తునిగా మనకు దర్శన మిస్తారు. భక్తి పరాకాష్ఠ దశ, వైరాగ్యం, వేదాంత విచారం దీనిలో గోచరమవు తున్నాయి. స్వామిని ఆశ్రయించి, భవసాగరాన్ని దాటండని అనుభవైక వేద్యంగా వివరించారు.

## జ్ఞాపికలు

1. సుప్రభాతాది మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 1, పుట-4
2. సుప్రభాతాది మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 1, పుట-1
3. సుప్రభాతాది మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 6, పుట-2
4. శ్రీశివపంచాయతన సుప్రభాతమ్(వ్రాతప్రతి) :విశ్వనాథశర్మ,అప్పాల. శ్లో. 1, పుట-4
5. శ్రీ శివపంచాయతన సుప్రభాతమ్ (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 10, పుట-6
6. శ్రీ శివపంచాయతన సుప్రభాతమ్ (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 12, పుట-7

7&8. శ్రీ శివపంచాయతన సుప్రభాతమ్ (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 14 15, పుట-8

9. శ్రీసీతారామచంద్ర సుప్రభాతమ్(అష్టకమ్) : విశ్వనాథశర్మ,అప్పాల. శ్లో. 4,పుట-5
10. శ్రీసీతారామచంద్ర సుప్రభాతమ్(అష్టకమ్): విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 6, పుట-6
11. శ్రీసీతారామచంద్ర సుప్రభాతమ్(అష్టకమ్): విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 7, పుట-7

12&13. స్తోత్రరత్నావళి (శ్రీ ఆంజనేయ సుప్రభాతమ్) : సంకలనం- డా॥ వేంకటరామయ్య, గోలి. శ్లో. 1,2, పుట-218

14నుండి16. శ్రీ గురు పూజాకల్పమ్ (శ్రీ భావానందభారతీ సుప్రభాతమ్) : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 2,4, పుట-2

17. శ్రీగురుపూజాకల్పమ్ (శ్రీ భావానందభారతీ సుప్రభాతమ్) : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 8, పుట-3
18. భావానందం (శ్రీభావానంద స్తోత్రమ్) : విశ్వనాథశర్మ, అప్పాల. పుట-10
19. శ్రీ గురుపూజాకల్పమ్ : విశ్వనాథశర్మ అప్పాల. శ్లో. 16, పుట- 7
20. శ్రీ రామసేవాలహరి (శ్రీ బాలవీరమారుతి స్తోత్రమ్) : సంకలనం : వెంకటరామశర్మ, మదునూరి. శ్లో. 3, పుట-22
21. శ్రీ రామసేవాలహరి (శ్రీ బాలవీరమారుతి స్తోత్రమ్) : సంకలనం : వెంకటరామశర్మ, మదునూరి. శ్లో. 9, పుట-24
22. శ్రీషిరిడీ సాయిబాబా అష్టోత్తర శతనామస్తోత్రమ్ : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో. 6, పుట -2
23. గంగాపంచరత్న స్తోత్రమ్ : విశ్వనాథశర్మ అప్పాల. శ్లో. 1, పుట -58
24. స్తోత్రమణిమాల (రుద్రదేవాష్టకమ్) : సంకలనం : వెంకటరామశర్మ, మదునూరి. శ్లో. 3, పుట -5

25. భావనవనీతమ్ : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.3, పుట -44
26. శ్రీ సీతారామచంద్ర సుప్రభాతం : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.4, పుట -10
27. స్తోత్రరత్నావళి (శ్రీకృష్ణప్రేమాష్టకమ్) : సంకలనం : డా॥ వేంకటరామయ్య, గోలి. శ్లో.1, పుట - 185
28. భావనవనీతమ్ (శ్రీ రాధాష్టకమ్) : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.5, పుట -35
29. భావనవనీతమ్ (శ్రీ రాధాష్టకమ్) : విశ్వనాథశర్మ, అప్పాల. ఫలశ్రుతి శ్లో.3, పుట -40
30. స్తోత్రమణిమాల (శ్రీరాజరాజేశ్వర్యష్టకమ్) : సంకలనం - వెంకటరామశర్మ, మదునూరి. శ్లో.5, పుట.13
31. స్తోత్రమణిమాల (శ్రీరాజరాజేశ్వర్యష్టకమ్) : సంకలనం - వెంకటరామశర్మ, మదునూరి. శ్లో.8, పుట.14
32. శ్రీ సంతోషిమాత్రష్టకమ్ : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.5, పుట-4
33. శ్రీ సత్యదేవాష్టకమ్ : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.8, పుట.5
34. శ్రీ సత్యదేవాష్టకమ్ : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.2, పుట.2
35. శ్రీ సత్యదేవాష్టకమ్ : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.6, పుట.4
36. వివేకచూడామణి : ఆదిశంకరాచార్య. శ్లో.32, పుట-22
37. జీవిత పరమార్థము - వేదాంత శాస్త్రము : నాగమణి, కొండూరు. పుట.128
38. భావనవనీతమ్ : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.3, పుట.6
39. భావనవనీతమ్ : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.21, పుట.24
40. శ్రీ మద్భగవద్గీత :వ్యాఖ్యాత- శ్రీ సుందరచైతన్య, జ్ఞానయోగము శ్లో.11, పుట.64
41. శ్రీ స్తోత్రమణిమాల (శ్రీరాజేశ్వరీ నవకమ్) : సంకలనం : వెంకటరామశర్మ, మదునూరి. శ్లో.3, పుట.15

42 నుండి 49. నమామి మురళీధరమ్ (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.1,6,9,18,29,30,86,87) క్రమంగా పుటలు - 1,2,3,4,10

50&51. ప్రపన్నశతకమ్ (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ, అప్పాల. శ్లో.2,85, పుట.59, 71

# 8. మంగళ హారతులు - సంగీత సాహిత్య శోభితాలు

## 1. మంగళహారతులు - వైశిష్ట్యం

శ్రీ విశ్వనాథశర్మగారు ఆశ్రమనిర్వహణ, మానవసేవతోపాటు భగవంతుని వర్ణించడం, స్తుతించడం, సేవించడం అనే లక్ష్యసాధనలో జీవనం సాగించారు.

ఆ భగవంతుని అర్చనకు కావలసిన అక్షర సుమాలను కూర్చి వివిధ ప్రక్రియలనే మాలికలల్లి సమర్పించారు. ఆ మాలికలలో శతకాలు, అష్టకాలు, నీరాజనాలు మొదలైనవి ఉన్నాయి.

వాటిని తెలుగులోను, సంస్కృతంలోను స్వామికి అర్పించి, భక్తి పారవశ్యంతో తేలియాడారు.

శర్మగారి రచనలలో మంగళహారతి ఒక విశిష్టప్రక్రియ. ఆయన మొత్తం 122 మంగళ హారతులు రచించారు. వాటిలో తెలుగులో 110, సంస్కృతంలో 12 ఉన్నాయి.

ఆచార్య బి. రామరాజుగారు జానపద గేయ సాహిత్యంలో "పారమార్థిక గేయములు" అనే శీర్షికలో మంగళహారతులను గూర్చి వివరించారు. "భక్తి గేయములందు మరియొక శాఖ మంగళహారతులు. దీనిని మంగళారతులని కూడ అందురు. 'మంగళహారతి'కి నివాళి, నీరాజనం అనేవి పర్యాయపదాలు.

పూజాదికములందుగాని, శుభకార్యములందుగాని మంగళము పాడుట కలదు. ఈ యాచారము భారతదేశమంతటను కలదు. మంగళహారతి యనగా నివాళి. కాని రానురాను నివాళి నిచ్చునపుడు పాడెడు పాటకర్థమైనది. ఈ యర్థము ఇటుల ఎప్పుడు మారెనో తెలియదు. 'ఆరత్యు పరతి విరతయ ఉపరామె' అని అమరకోశము. ఆరతి, ఉపరతి, ఉపరామము విరతియు చాలించుటకు పేరులు. మంగళము పాడి చాలించుటచే ఇది మంగళారతియైనదోయేమో? 'ఆలతి' యను మరియొక

శబ్దమున్నది. దాని కర్థము 'రాగాలాపము' 'రలయోర్లడయోః' అను మతమున నారతియే ఆలతియై యుండును. నన్నెచోడుడు 'ఆలతులొగిచేసి పాడి రభినవ లీలన్' అనియును 'అలతులు నిల్పహస్తమున 'ననియు' ఆలతుల్ నూల్కనచేసి' యనియు ప్రయోగించెను."[1]

దక్షిణ భారతదేశంలో ఎక్కడ సంగీతసభ జరిగినా చిట్టచివర త్యాగరాజు రచించిన "నీ నామరూపములకు నిత్యజయమంగళం"[2] అని పాడతారు.

అన్నమాచార్యులవారి "క్షీరాబ్ధి కన్యకకు శ్రీమహాలక్ష్మికి నీరజాలయకును నీరాజనం"[3]

"మంగళం గోవిందునకు జయమంగళము గరుడధ్వజునకు"[4] అంటూ వేంకటేశుని కీర్తిస్తూ హారతులు ఇస్తారు. భక్త రామదాసుగారి "రామచంద్రాయ జనకరాజజా మనోహరాయ

మామకా భీష్టదాయ మహిత మంగళం"[5] అని భద్రాచల రాముని కీర్తిస్తూ హారతులు పాడతారు.

మంగళహారతులలోని వస్తువు భక్తి "చిత్తం పరమేశ్వరుని పాదారవిందాలకడకు 'భక్తి'[6]యని శంకరాచార్యులవారు పేర్కొన్నారు. "భగవంతునియెడగల పరమపూజ్య భావమే భక్తి."[7]

శర్మగారు భక్తి ప్రతిపాదకాలైన మంగళహారతులను రచించారు. వాటిలోను కృష్ణభక్తి ప్రతి పాదకాలైన హారతులే ఎక్కువగా రచించారు.

ఈ మంగళహారతులన్నీ ఊరూరా శతరుద్రాభిషేకం చేస్తూ, భక్తులు కోరిన విధంగా ప్రతి ఊరుపేరుతో ఒక మంగళహారతి, శివుని గూర్చిన ఒక ఉత్పలమాలా పద్యం శర్మగారు రచించారు. పద్యాలనే 'శ్రీ శివలింగ విలాసము' అనే పేరుతో శతకంగా ముద్రించారు. మంగళ నీరాజనాలను 'మంగళ మంజరి'గా ముద్రించారు.

## 2. శర్మగారి హారతులు - వర్గీకరణ




విశ్వనాథ శర్మగారు రచించిన హారతులను స్థూలంగా భాషాపరంగా తెలుగు, సంస్కృత హారతులని విభజించవచ్చును. తెలుగులో కృష్ణుడు పాండురంగడు, అనంతుడు, రాముడు, ఆంజనేయుడు, విఘ్నేశ్వరుడు, శివుడు భావానందస్వామి, వివేకానందుల గురించి రచించిన హారతులు పురుష పరమైన దేవతలను, భక్తులను గురించి రచించినవి.

కృష్ణుడు, పాండురంగడు, అనంతుడు, రాముడు, ఆంజనేయులకు సంబంధించిన హారతులు విష్ణుభక్తి ప్రతిపాదకాలు.

శివ, విఘ్నేశ్వరులకు సంబంధించినవి శివభక్తి ప్రతిపాదకాలు. భావానందుడు, వివేకానందుల గురించి రచించిన హారతులు భగవద్భక్తులను, వారి భక్తిని వ్యక్తిత్వాన్ని గురించి రచించినవి. వీటన్నిటిని పరిశీలిస్తే శ్రీశర్మగారు అద్వైత సిద్ధాంతానుయాయి అని విశదమవుతుంది.

ఆయన రచించిన తెలుగుహారతులలో దేవీ (స్త్రీ) పరమైనవి కొన్ని ఉన్నాయి. సంతోషిమాత, సరస్వతి, రాజేశ్వరి దేవతలతో పాటు తన తల్లి 'యశోదమ్మ' కూడా శర్మగారి హారతుల్లో చోటు సంపాదించుకుంది. మొత్తం మీద పదునాలుగు విధాల దైవ హారతులను ఆయన తెలుగులో రచించారు. వీటన్నిటిలోను శర్మగారి భక్తి ప్రపత్తులు పరాకాష్ఠనందాయి.

సంస్కృత మంగళహారతులలో కృష్ణుడు, పాండురంగడు, రాములకు సంబంధించినవి విష్ణుభక్తి ప్రతిపాదకాలు కాగా శివునికి సంబంధించిన హారతులు శివభక్తి ప్రతిపాదకాలుగా కనిపిస్తాయి. శర్మగారు అద్వైతి కాబట్టే, శైవ, వైష్ణవ భేదం లేకుండా అందరిని భక్తితో కొలిచారు. అంతేకాదు అద్వైత సిద్ధాంత స్థాపకులు, ప్రచారకులైన ఆదిశంకరులను గురించి కూడా హారతులు రచించి తాను 'అద్వైతి'ననే విషయాన్ని (చెప్పకనే) రూఢి చేశారు.

శర్మగారు అనేక దేవతాహారతులు రచించినా ఆయనను కృష్ణుడు బాగా ఆకర్షించాడు. 'కృష్ణ' శబ్దానికి ఆకర్షించేవాడని అర్థం కదా, అందుకే ఆయన కృష్ణునిపై అధికంగా హారతులు రచించారు. తాను కృష్ణారాధకుడనని అష్టకాలలో మాటిమాటికి చెప్పుకున్నారు. ఆయన నిక్కమైన పదహారణాల పరమ భక్తుడు. ఆయన రచించిన హారతులను వరుసగా విశ్లేషిద్దాం. వాటిలోని ఔన్నత్యాన్ని స్థాలీపులాక న్యాయంగానైనా గ్రహిద్దాం.

## 3. శ్రీకృష్ణ హారతులు

వస్తువిశ్లేషణ : విశ్వనాథ శర్మగారు రచించిన నీరాజనాలలో శ్రీకృష్ణుని గూర్చి తెలుగులో 55, సంస్కృతంలో 6 ఉన్నాయి. ఈ హారతులలో శ్రీకృష్ణుని రూపలావణ్యాదులను, రాసలీలలను, వేదాంతాన్ని చక్కగా వర్ణించారు.

హారతులు సంగీతం వచ్చినవారికే కాదు, జనులు అంతా పాడుకొని ఆనందించే విధంగా శాస్త్రీయ సంగీత బాణీల్లోను, సినిమా పాటల బాణీలలోను రచించారు.

సినిమా బాణీలో వ్రాయటంవల్ల ఆపాట బాగావిని ఉన్న సామాన్యజనులు ఈ హారతిని చక్కగా రాగయుక్తంగా పాడుకోగలరనే భావనతో ఎక్కువగా ఆబాణీలోనే అనుసరించారు.

శర్మగారి హారతులను ఒక దగ్గర జేర్చి "మంగళమంజరి"[8] అనే పేరుతో 1988సం॥లో 1000 ప్రతులు ముద్రించారు. అందులో ప్రతి హారతి ఏ దేవుడిదో, అది ఏరాగమో, ఏ సినిమా గీతం మాదిరో అన్నీ చక్కగా ముద్రించారు.

శర్మగారు రచనలు చేస్తున్న కాలంలోనే ఈ తెలంగాణా ప్రాంతంలో చాలామంది కవులు ఈవిధమైన మంగళహారతులు రచించారు. విఠాల చంద్రమౌళిశాస్త్రి, రుక్మాభట్ల, విధుమౌళిశాస్త్రి, గౌరీభట్ల సిద్ధేశ్వరశాస్త్రి, గౌ॥ రఘురామశాస్త్రి వీరంతా ఆయన సమకాలికులు.

శర్మగారు శ్రీకృష్ణుని, బాలకృష్ణునిగా, గోపాలకృష్ణునిగా, రాధాకృష్ణునిగా వర్ణించారు.

**అ). బాలకృష్ణుని వర్ణన**

**"అందమైన డెందమని - అందుదాగి యుందువని**
**ఎందరో? అన్నారయ్య - దేవ దేవా! మా**
**ముందుకేల? రానే రావు కృష్ణయ్యా! కృష్ణయ్యా!**
**అందుకొమ్ము నీరాజనము కృష్ణయ్యా!"[9]**

అంటూ చిన్ని కృష్ణుని ముందుకువచ్చి, హారతి గొనుమని ప్రార్థించారు.

**"మన్నుదిన్న వాడవని - నిన్ను వెన్న దొంగవని**
**అన్నలేమొ? అన్నారని -దేవదేవా**
**చిన్నబోకు మయ్యా? చిన్ని కృష్ణయ్యా, కృష్ణయ్యా**
**ఉన్నదిక్కు నీవేనయ్యా! కృష్ణయ్యా"[10]**

అంటూ చిన్నికృష్ణుడే మాకుదిక్కు అని వేడుకున్నారు.

మరో హారతిలో

**చ॥ "వెన్నదొంగ, నీ వన్నె చిన్నెలను యెన్నడు జూతునురా**
**కన్నయ్యా! నా కన్నులు నీకైకాయలు గాసెనురా**
**పరమాత్మ మురళీ ధర పింఛ మౌళీ"[11]**

అని కన్నయ్యను చూడాలనే ఆవేదనను వ్యక్తం చేసారు.

**చ॥ "చిన్నికృష్ణ' కనిపించుమురా! వెన్నలంచ మిత్తునురా**
**కన్నతండ్రి! తులసీదళముల కానుక నర్పింతునురా"[12]**

అంటూ వెన్ననులంచంగా ఇస్తాను స్వామి కనిపించమని గోముగా ప్రార్థించారు. భక్తితో తులసీదళాలను సమర్పిస్తానన్నారు.

మరోచరణంలో బాలకృష్ణుని ముగ్ధమనోహరరూపాన్ని వర్ణించారు.

**చ॥ "సిరి సిరి మువ్వలతో - సరిసరి నడకలతో**
**చారెడేసి కన్నులతో - వోర వోర చూపులతో**
**మారులేని వేణువూదె - మార మోహనాకృతితో**
**సారమై చిన్మయమౌ - చారు నీలకాంతులతో**
**సిరిపింఛపు తళుకు లొలుకు - కురుల కుటిల నటనలతో**

**చేరా రావయ్యామా చెంతకు రావయ్య"[13]**

చిట్టి అడుగులు, వాటికి మువ్వలు పెద్దపెద్ద కన్నులు, ఓరచూపులు మురళీనాదం, నీలకాంతి, పింఛంతో తళుకులొలికే కురులు కలిగిన చిన్నికృష్ణుని ఒకసారి చెంతకు రమ్మని శర్మగారు వాత్సల్యపూరిత హృదయంతో యశోదాదేవి అదృష్టాన్ని ఈ యశోదా నందనునికి (శర్మగారికి) ఇవ్వమని ప్రార్థించారు. ఇలా బాలకృష్ణుని రూపాన్ని, ఆయన బాల్యక్రీడలను వర్ణించి మురిసి పోయారుకవి. ఈ వర్ణనలు కృష్ణుని శైశవ దశను చిత్రించాయి.

## ఆ). గోపాలకృష్ణ వర్ణన

గోకులంలో స్వామి గోవులను కాయడం, గోప గోపీజనంతో ఆడుకోవడం, గోవర్ధన పర్వతం ఎత్తడం మొదలైన విశేషాలను తెలుపుతూ మంగళహారతులను శర్మగారు రచించారు. ఈమంగళహారతులలో భాగవత కథాంశాలు గానానుకూలంగా మలచబడ్డాయి.

**1చ॥ "గోలోకధాముడవై - గోకులాన వెలసితివి**
**గోవులను గాచితివీ - జీవులను బ్రోచితివి**
**గోలచేసి గోపికల - పాలువెన్న దోచితివి**
**గోవర్ధన గిరిజేరి - గోవిందుడవైతివి**
**గోపాల సుందరా - కోపమేలరా! బిరబిర"[14]**

అంటూ గోలోకవాసియైన కృష్ణపరమాత్మ గోకులంలో చేసిన లీలలను వర్ణించారు.

**2చ॥ "బృందావనిలో - యమునా తటమున**
**అందెలు పదముల సందడి సేయగ**
**మందలగాచే - మాధవ! హరి - నా**
**డెందములో విహరించుమురా."[15]**

బృందావన విహారిని తన హృదయ కమల విహారిని కమ్మని అర్థించారు.

ఒకపల్లవిలో : **"హారతి- గిరిధారీ। గోవింద హరి**
**అ॥ప॥ కరుణాసాగర। కాంచుము - శౌరీ**
**సరగున - మముజేరి - గోవిందహరి"[16]**

అంటూ గోవిందుని ప్రార్థించారు. బృందావన విహారిని కనులకు కట్టినట్లు చిత్రించారు.

## ఇ). శ్రీ రాధాకృష్ణవర్ణన

మధురభక్తి ప్రతీక రాధిక. రాధికామనోహరుడు శర్మగారి ధ్యానమూర్తి. కాబట్టి రాధాకృష్ణులను చాలా అపురూపంగా వర్ణించారు.

**ప॥ "రారాకృష్ణా! రాధాకృష్ణా**
**చేర - రావయ్యా! మా। చెంతకురావయ్యా"[17]**

**అ.ప॥ "రాధికా ప్రియ - బృందావన చర**
**రాసకేళీకళా - రాధక - నటశేఖర"[18]**

**అ.ప॥ "శ్రీ రాధా - మానస మందిరా**
**నీరాజన సేవ - యిదో దొర"[19]**

**అ.ప॥ "శ్రీ రాధా ప్రియ। చిన్మయా**
**శ్రిత జనావన। నీదయ"[20]**

**చ॥ "అందాల రాధమ్మ - సౌందర్య చరణాల**
**అందెల సందడి లయగా**
**అనురాగ తంత్రులు - శృతి మీటగా**
**అందరి హృదయాలు స్పందించగా"[21]**

**ప॥ "రాధాలోల మంగళమో - హరి"[22]**

**చ॥ "శ్రీరాధా ప్రేమామృత లహరీ"[23]**

**ప॥ "రాధికా సుందరా! గిరిధర"[24]**

అంటూ రాధికను కథానాయికగా చేసి, శ్రీకృష్ణపరమాత్మను కథా నాయకునిగా జేసి, రాసకేళికి రాధాకృష్ణుల ప్రణయకలాపాన్ని వర్ణించారు.

ఈవిధంగా శర్మగారు బాల, గోపాల, రాధాకృష్ణులను చిత్రీకరించటంతో పాటు విన్నపాలు, శరణాగతిని తన హారతులలో స్వామికి వినిపించారు.

**చ॥ "కనుల వెంబడి - నీరముల్ - కాల్వలాయెనపారముల్**
**కఠినమేలా। రాధా లోలా"**

**చ॥ "హీనుడని నన్నిలలో - దయ**
**బూనవో - నీ మదిలో - అను**
**మానమా - విశ్వములో**

హాయిగా - విహరింప కృపతో"[25]

చ॥ "పరిపాలిత శ్రీ పాండురంగాశ్రమా
పరి పరి నిన్ను బిలుచుట యపరాధమా
మొరవిన భారమా? శరణన చేరుమా
నా కన్నులకైనను కన్పింపుమా - ఓ కృష్ణా"[26]

చ॥ "నిను గనలేని - కనులెందుకు?
నీ దయలేని - బ్రతుకెందుకు?
కణకణమందున - కనిపించుమురా!
క్షణమై - ననువిడ - నాడకురా"[27] అందుకోర - కృష్ణయ్యా"

చ॥ "నీ దర్శన - భాగ్యముతో - మమ్ముల
ధన్యుల గావించుమా?
నీదయరా! రాధా మాధవా!"[28]

చ॥ "నిన్ను గాంచువేళ - రానేరాదా?
నీ కటాక్షమైన - లేనే లేదా?
ఎన్నడూ నిను జూతును - యెన్నడు దయగల్గును
నన్ను మరవ - బోకుమయ్యా! కృష్ణయ్యా! కృష్ణయ్యా!
నిన్ను విడచి - నిలువలేను కృష్ణయ్యా!"[29]

ప॥ "నిను జూడగ - లేనా కృష్ణయ్యా"[30]

ప॥ "ఒకసారి కనుపించవేమయ్యా - కృష్ణ
ఇకనైన దయరాద? నీలకాయ - గోపాలరాయ"[31]

అంటూ స్వామి కనిపించాలని, తన మొరలాలకించాలని, ఆ స్వామి సౌందర్యాన్ని చూడాలని ఎంతో ఆవేదనతో శర్మగారు కృష్ణుని ప్రార్థించారు. తన జీవితధ్యేయమే కృష్ణ దర్శనంగా పరితపించారు.

ఈ హారతులలో వేదాంతం, తత్త్వం, భక్తి, జ్ఞానం, వైరాగ్యం, మధురభక్తి, వాత్సల్య భక్తి, దాసభక్తి అనే అంశాలు చోటుచేసుకున్నాయి.

జానపద బాణీలోను, సంప్రదాయ సంగీత బాణీలోను, సినిమా బాణీలోను కృష్ణునికి హారతులు రచించారు శర్మగారు.

**ఈ) హారతులలోని శబ్దార్థాలంకార ఔచిత్యం**

మధురభక్తి తొణికసలాడే ఆయన హారతులలో ఔచిత్యవంతంగా శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు వాటంతటవే వచ్చి చేరిపోతాయి. ఆయన కవిత్వానికి అవి వన్నె తెస్తాయి.

**చ॥ "నీముఖ చంద్రోదయము గోరుచున్**
**నిలిచె నయన కుముదముల్**
**నీ మంజుల రూపాదిత్యునకై**
**నిరీక్షించె హృదయమ్ము"[32]**

ముఖ చంద్రుడు – నయన కుముదాలు – రూపాదిత్యుడు – హృదయ కమలము – అంటూ రూపకశోభను ప్రదర్శించారు.

**చ॥ "రాముడవీవె – రంగడవీవే**
**స్వామీ! శివుడవు – సకలము నీవే**
**యేమర బోకుము – విశ్వేశుని**
**శ్యామల – పాండురంగాశ్రమ మందిర"[33]**

అంటూ రాముడు, రంగడు, శివుడు సకలం కృష్ణునిగానే భావించి హరిహరులకు అభేదాన్ని చాటి అద్వైతిగా నిలిచారు. సర్వదేవ సమత్వాన్ని చాటారు.

**"తల్లివి నీవె – తండ్రివి నీవె**
**దైవము నీవె – దయామయా**
**యెల్లజగాలకు – యేలికవీవె**
**యీవె – సకలము – చిన్మయా"[34]**

తల్లి, తండ్రి, దైవం సమస్తం భగవంతుడే అని ఆయన సర్వ వ్యాపకత్వాన్ని చాటడమే కాక అంతటా భగవంతుని దర్శించారు.

**చ॥ "నందగోపాల! నాభావ – నవనీతము**
**విందుగా – చూరగొనవేమి? విపరీతము**
**అందముల కందము – బిందు – నీ రూపము (హరి)**
**అందిన – అదియే బ్రహ్మానందము"[35]**

హారతిలోని బిందుపూర్వక 'ద'కార ప్రాసను పాటిస్తూ, అంత్య ప్రాసతో రచింపబడిన హారతి శ్రావ్యతను మరింత పెంపొందించింది.

**చ॥ "వినతా సుత వాహనా। వనితా మనోమోహనా।**
**ఘనతాపస పాలనా। జనతాప - నివారణా॥"[36]**

'త'కారంతో వృత్యనుప్రాసను, 'న'కారంతో అంత్యప్రాసను వాడడంవల్ల ఈ చరణం శ్రుతిపేయంగా సాగింది.

**చ॥ "కనుము - నాలో కాపురముండి - కనులారగా**
**మనసులో దివ్య భావాలు - చెలరేగగా**
**వేణుగానమ్ము - వినిపించు - వినసొంపుగా**
**తనువు పులకించగా - మునులు వినుతించగా**
**జనము - నీ నీలియందాలు - తిలకించగా"[37]**

ఈ హారతిలో అంత్యప్రాసను పాటించారు. సులభమైన, సరళమైన పదాలు, సమాసాలు వాడి 'హారతి'ని రక్తికట్టించారు.

కృష్ణుడు ఎన్ని లీలలను చూపాడో అంత అవలీలగా ఎన్నో చక్కటి పదాలను సమాసాలను, శర్మగారు హారతులలో ప్రయోగించారు. చూడండి.

రాధాలోల, గోలోకరాజ, బృందావిహారీ, ఖగగామి, నందనందనవ్రజ సుందరా, భావ నవనీతము, సౌఖ్య వారాన్నిధీ, సర్వేశ, తోయజ దళనయనా, ప్రేమభావ, పుండరీకహితకరా, నల్లనివాడు, అల్లరివాడు, కన్నయ్య, రేపల్లెరేడ, ప్రేమనైజా మొదలైన పదాలను సందర్భోచితంగా ప్రయోగించి హారతుల రచనకు వన్నె తెచ్చారు.

## ఉ.) సంస్కృతంలో శ్రీకృష్ణహారతులు

శర్మగారు సంస్కృతంలో శ్రీకృష్ణుని లీలలను, అవతార పరమార్థాన్ని మనోహరంగా వర్ణించారు.

**ప॥ "భజరే మానస - గోవిందం**
**భజ - మమ - హృదయధనం - బ్రహ్మానందఘనం"[38]**

గొప్పనైన బ్రహ్మానందం, నా హృదయధనమైన గోవిందుని సేవించవే మనసా అని ప్రబోధించారు.

**చ॥ "నంద కిశోరం - నవనీత చోరం**
**బృందావన భువి - కృత సంచారం**
**బృందారకగణ - వందిత పాదార**
**విందం - మధురం - మధురాతి మధురం"[39]**

నందకిశోరుడు, నవనీత చోరుడు, బృందావన సంచారుడు, దేవతలచే నమస్కరింపబడే పాదాలుగల గోవిందుడు మధురాతి మధురం అంటూ కృష్ణుని కీర్తించారు.

**చ॥ "రామకృష్ణ హరిహరాది - నామరూప చిన్మయ**
**శ్యామలాంగ। పాండురంగ - సకల శుభకరా।"[40]**

చిన్మయుడు ఐన కృష్ణుడే రాముడు, విష్ణువు, శివుడు, పాండురంగడు, ఆ స్వామి సకలశుభాలను కలుగజేసేవాడని, దృఢవిశ్వాసంతో గానం చేశారు.

**ప॥ "పరిపాలయమాం గిరిధారీ" ॥ప॥**
**అప.॥ ప్రవిమల రాధా - భావ విహారీ - ప్రభో ॥ప॥**
**చ॥ సంసార మహా సాగర పతితం**
**విషయవాసనా - పాశైర్నిబద్ధం**
**అగతిం - దీనం - ఆర్తమనాథం**
**కృత్వాపటుతర - మాయా విముక్తం"॥ప॥[41]**

ఈ సంసారం అనే మహాసాగరంలో పడి ఉన్నాను. విషయ వాసనలతో బంధింపబడి, దిక్కులేక, దీనుడనై, ఆర్తుడనై, అనాథుడనై మాయలో ఉన్న నన్ను విడుదల చేయమని ఆర్తితో, వేదనతో అర్థించాడు కవి.

**అ॥ "రాధికా ప్రియ! బృందావన చర**
**రాసకేళి కళా - రాధక - నటశేఖర**
**చ॥ ప్రకటిత నిజ - మాయాజాలా**
**భక్త పరాధీన। సుచేల**
**శుక ముఖనుత గోపరిపాలా**
**శుభదాయక గోపీజనలోల॥"॥మాధవా॥[42]**

రాధామాధవుడు, భక్త పరాధీనుడు, శుకమహర్షి చేత స్తుతింపబడిన మాధవుడు, భక్తి భావ సులభుడైన స్వామికి హారతిని సమర్పించారు.

**"శృత్వా విశ్వస్య - కరుణాక్రందం**
**దృష్ట్వా మామక - దీనావస్థాం**
**ద్రవతినకిం తవ - నవనీత హృదయం**
**మామవ కృపయా - శీఘ్రాతి శీఘ్రం॥"[43]**

'విశ్వనాథ శర్మయొక్క - ఆక్రందన విని దీనావస్థను చూసి, నీ నవనీత

హృదయం ద్రవించడం లేదా? దయతో శీఘ్రాతి శీఘ్రంగా నన్ను కాపాడు స్వామి' అని మొరపెట్టు కోవడంలోని భక్తుని "ఆర్తి" గమనించదగింది.

ఈవిధంగా సంస్కృత హారతులలో కూడా భవసాగరాన్ని దాటించమని, జ్ఞానభిక్షను ప్రసాదించమని, మోక్షాన్ని అనుగ్రహించమని వేడుకున్నారు.

## 4. శ్రీ పాండురంగ హారతులు

పాండురంగాశ్రమంలో ఆరాధ్యదైవమైన పాండురంగస్వామిని గురించి అనేక హారతులు రచించారు. ఇక్కడ పాండురంగడు, శ్రీకృష్ణుడు అభిన్నులు. కృష్ణావతార విశేషణాలతోనే పాండురంగని శర్మగారు స్తుతించారు.

ప॥ **"అంతరంగాలలో అలరారు పాండురంగా**
**ఆరార్తికమ్ము గొనుమా - ఆనంద వారిధి పొంగా"**

అనే పల్లవిలో "పాండురంగా!" అని సంబోధించిన శర్మగారు

చ॥ **"నీ మురళిపాట వినగా - నీ దివ్య తేజము - గనగా**
**నీవే - నేనై - వెలుగ - దేవ కరుణించుము - వేగా"**[44]

అంటూ కృష్ణుని విశేషణాలతో పై చరణం రచించారు. "నీవే నేనై వెలుగ" - అనేది శర్మగారి లక్ష్యం. ఆ లక్ష్య సాధన కోసమే ఈ రచనలన్నీ.

ప॥ **"దేవ దేవా! పాండురంగా! దీన। మందారా**
**సేవ యొసగి కావుమయ్య। జీవనాధారా ॥దేవ॥**

చ॥ **మాటి మాటికి వేడుకున్న - మౌనమెందుకు గిరిధరా**
**మనసు విప్పి - కరుణతోడ - మాటలాడుము శ్రీధరా**
**నేటికైనా - ఏనాటికైనా - నేను - నీవాడరా నీదే భారమురా" ॥దేవ॥**[45]

స్వామిని ఎంతో ఆర్తితో పిలిచి, ఒకసారి మనసువిప్పి మాట్లాడుమని ఆర్ద్రతతో అర్థించారు. రెండవ చరణంలో

2చ॥ **"పరుగులిడును - దేనికొరకో**
**తెరువు మనసుకు - తెలియదు**
**ప్రతి పదమ్మున - జగములన్ని**
**బ్రహ్మమయమని యెరుగదు**
**భావమంతయు, నీవుగానిది - బంధమే తొలగదు భయము విడనాడదు"**[46]

మనసుకు మార్గం తెలియక, పరుగులు పెడుతుంది. ప్రతిదీ బ్రహ్మమయ మని తెలియదు. భావమంతా పాండురంగమయం అయితే బంధం వీడుతుంది. భయం తొలగుతుంది. అంటూ వేదాంత తత్త్వాన్ని, జ్ఞానమార్గాన్ని ప్రబోధించారు. చివరి చరణంలో "స్వామి నామం"తోనే ఇది సాధ్యం అని ఉపాయాన్ని కూడా వివరించారు.

మరొక హారతిలో

**ప॥ "నాకు సర్వస్వము - సర్వదా - పాండురంగడే**
**అ.ప॥ నామ జపమొకటే - జీవ, జీవనాధారము"[47]**

అంటూ ఎల్లప్పుడు, అన్నీ పాండురంగడే అని, స్వామి నామజపమే జీవులకు జీవనాధారం అనే తాత్త్విక సత్యాన్ని విశదీకరించారు.

**"అణువుకన్న చిన్నవాడు**
**అన్నిటికన్న మిన్నవాడు**
**కణకణమ్మున నున్నవాడు**
**పాండురంగడే"[48]**

అంటూ భగవత్తత్త్వాన్ని (అణోరణీయాన్ మహతో మహీయాన్) స్వామి స్వరూపాన్ని వివరించారు.

పంచరాగమాలిక (భీంప్లాస్, కాఫి, కళ్యాణి, మోహన, శివరంజనిలో పాండురంగ హారతిని రచించారు.

**ప॥ "అందుకొనుమో పాండురంగా**
**హాయిగా - నీరాజనము - పాపభంగా"[49]**

అనే పల్లవితో ప్రారంభించి, 5 చరణాలతో ముగించారు.

సప్తరాగ తాళమాలికలో పాండురంగ హారతి రచించారు. ఇందులో ఏడు రాగాలు, ఏడు తాళాలు వేరు వేరుగా ఉన్నాయి.

1. మాల్కోస్, 2. చక్రవాకం, 3. భీంప్లాస్, 4. కల్యాణి, 5. తిలక్ కామోద్, 6. శివరంజని, 7. భూపాల మొదలగు రాగాలలో ఏడు చరణాలతో రచించారు.

1. ధృవతాళం చతురశ్ర జాతి (14) అక్షరాలు
2. మఠ్యతాళం చతురశ్ర జాతి (10) అక్షరాలు

3. రూపకతాళం చతురశ్ర జాతి (6) అక్షరాలు

4. జంపెతాళం మిశ్ర జాతి (10) అక్షరాలు

5. త్రిపుటతాళం తిశ్ర జాతి (7) అక్షరాలు

6. ఆటతాళం చతురశ్ర జాతి (12) అక్షరాలు

7. ఏకతాళం చతురశ్ర జాతి (4) అక్షరాలు

ఏడు విధాలైన తాళాలతో హారతిని రచించారు. పల్లవి, అనుపల్లవి రాగం – హిందూస్తాన్ భైరవి – తాళం – ఆదితాళం చరణాలలోది కాకుండా వేరుగా వీటికి రాగతాళాలు.

**ప॥ "పాండురంగ। రుక్మిణీ మనోహర**
**పరమ దయాకర। వేణుధర। శ్రీ"[50]**

అంటూ ప్రారంభించిన ఈ హారతిలో విష్ణు, కృష్ణ, పాండురంగ మూర్తులకు భేదం లేకుండా విశేషణాలు వాడుకున్నారు.

సంగీత, సాహిత్యాల మేళవింపుతో ఈ మాలికను వనమాలికి అర్పించి, ఆ సౌందర్య మూర్తిని శర్మగారు దర్శించి తరించారు. భక్తులను తరింపజేశారు. ఈవిధంగా వివిధరాగాలలో హారతులు రచించి పాండురంగ స్వామిని సేవించారు.

## అ). సంస్కృతంలో శ్రీ పాండురంగ హారతులు

సంస్కృతంలో పాండురంగని గూర్చి రచించిన హారతిలో 'శ్రీ భావానంద' అనే పదం పాదాదిలో వచ్చేటట్లు రచించారు.

**ప॥ "శ్రీ పాండురంగాయ – శ్రీ మనోవల్లభాయ**
**చిదానంద సాగరాయ – సదా మంగళం**

**2. భావ బల సమన్వితాయ – భావ భక్తి సేవితాయ**
**భావానంద యతివరాయ – భవ్య మంగళం**

**3. వాసుదేవాయ వేణు – వాదన ప్రియాయ – కనక**
**వాససే – సుఖకరాయ – పరమ మంగళం**

**4. నందనందనాయ – మౌని – బృందవందితాయ**
**సుందరీ మనోహరాయ – శుభదమంగళం**

**5. దయాపూర్ణ మానసాయ – ధర్మమార్గ గోచరాయ**
**దాస విశ్వనాథ సన్ను – తాయ మంగళం"[51]**

ఈవిధంగా తండ్రి, గురువు, దైవాలను ఒకే హారతిలో నుతించారు. ప్రతి హారతిలో ఏదో ఒక విశేషాన్ని పొందుపరచి, సంగీత, సాహిత్య సమతౌల్యంతో హారతులు రచించి, భక్తాళిని అలరింపజేశారు. సంస్కృతాంధ్ర పదాలను సమపాళ్ళలో స్వీకరించడమేగాక వాటిలో దేన్నెక్కడ ఉపయోగిస్తే ఔచిత్యవంతంగా ఉంటుందో అలా చేసి, తమ రచనలకు వన్నె తెచ్చారు కవి.

## 5. శ్రీరామహారతులు

శ్రీరాముని గూర్చి ఎనిమిది హారతులు రచించారు. ఈ హారతులలో రామచంద్రుని సౌందర్యం, ఔదార్యం పరివారాన్ని గురించి వివరించారు.

**ప॥ "నాగతి నీవేరమ్మా విడ - నాడకు - నీదయ సుమ్మా"[52]**

అని, 'స్వామి! నీవే శరణం' అంటూ ప్రారంభించి, 'తెలిసి తెలియక చేసిన పాపాలు' తొలగించమని, 'పోయిన గడియలు రానేరావు మాయల ద్రోసిన స్వామీ నీదేనరూ? (నీదయ) అంటూ కీర్తించారు.

మరొక హారతిలో రాముడు మనవాడే అంటూ తన మనసుకు నచ్చజెపుతూ హారతిని "సఖియా వివరింపవే"[53] అనే సినిమాబాణితో రచించారు.

**ప॥ "మనసా! దిగులెందుకే**

**అ॥ విను మనయము రాముడు నీవాడే॥మ॥**

**చ॥ ఆలసించక - హరిని డాసి**

**పూలదోసిలి - ముందుబోసి**

**నీలో వెలిగే - జ్ఞానరాశి**

**నివ్వాళిగా - జేసి పులకించవే"[54]**

మనసా! "దిగులుచెందకు, ఎల్లప్పుడు రాముడు నీవాడే విను. అలాంటి రామునికి ఆలస్యం చేయక ఆ మూర్తికి పూలు సమర్పించి, వాటితోపాటు నీలో ఉన్న జ్ఞానాన్ని హారతిగా జేసి సమర్పించి, పులకించు"మంటూ ఆత్మబోధ చేసుకున్నారు.

కర్పూరకళికను గాక ఆత్మజ్ఞాన కళికను వెలిగిస్తే కలిగేది పులకరింతే. తత్ఫలితం మోక్షమే.

మిగిలిన రెండు చరణాలలో సాకేతనిలయుడు, జగమేలువాడు, విశ్వనాథుని కోరికలు ప్రేమతో తీర్చేవాడు అయిన రాముడు సర్వవ్యాపకుడు. భక్తుల విన్నపాలు వింటాడు. అని దృఢవిశ్వాసంతో ప్రకటించారు.

మరొక హారతిలో "మదన శతకోటి – మంగళాకార – మాకు నీవే సుమ్మా"[55] అంటూ స్వామి సౌందర్యాన్ని చిత్రించారు. అందం అంటే సౌందర్యం. 'సౌందర్యం' అనే పదానికి "సుతరాం ఆద్రియతే ఇతి సౌందర్యం"[56] అని వ్యుత్పత్తి పరమాత్మ సౌందర్యం పరమ ఆదరణీయం కదా!

**చ॥ "అందమంత – రూపుదాల్చి – అవతరించిన బ్రహ్మమా**
**యెందుకొరకు – అందరాక – వుందువయ్యా – దైవమా**
**అందుకోవయ్య – సాకేత రాజా – విందుగా మాప్రేమ**
**వందనము చేకొనుమా – నందనుల మరువకుమా!"[57]**

అందం సాకారమై, బ్రహ్మమై రామునిగా రూపుదిద్దుకొన్నదని, మాకు అందరాక ఎందుకున్నావయ్యా, సాకేతరాజా, విందుగా మాప్రేమను అందుకొనవయ్యా – ఈ "నందనుల" మరువకుమా అని రాముని ప్రార్థించడంలో రాముని పితృదేవునిగా ఆరాధించడం కనిపిస్తుంది. పితాపుత్ర భావంతో భగవంతుని సేవించడం భక్తికి పరాకాష్ఠ.

ఈవిధంగా ఏడు హారతులు తెలుగులో రచించారు. రాముని నడకలోని గాంభీర్యం, మాటలోని సౌమ్యత, ప్రవర్తనలోని ఔచిత్యాలను ఈ హారతులు మనకందిస్తున్నాయి.

శ్రీరాముని సంస్కృత హారతి

**ప॥ "దశరథ నందన – దశముఖ భంజన**
**దయయా – స్వీకురు – నీరాజనం"[58]**

అంటూ శ్రీరాముని నీరాజనసేవ చేశారు. ఇందులో జలధర సుందరా, కోదండ శర భాసురా, జనగణ పూజిత, వనచర సేవిత అని చక్కని సమాసపదాలతో హారతిని రచించారు.

## 6). శ్రీ ఆంజనేయ హారతులు

ఆశ్రమ క్షేత్రపాలకుడైన ఆంజనేయస్వామిని గురించి రెండు మంగళహారతులు రచించారు.

**ప॥ "కపీశ॥ హారతి గొనుమా – గంధమాదనాద్రివాస**
**కాంచనాభ॥ రామదూత – కాంచుమాదెస – దేవా"[59]**

అంటూ "మహేశ, పాప వినాశ"[60] అనే సినిమాబాణీలో రచించారు. మరో హారతి "నీరాజనము గొనుమా - కపివీర దయగనుమా"[61] అనే పల్లవితో హారతిని ప్రారంభించారు. చరణాలలో

**1. "శ్రీరామ పదసేవా ధురంధర**

**2. రామ నామమున తనివిదీరక**
**రాముని దయతో నమరుడవై**

**3. బాల వీర మారుతీ, విశ్వము**
**నేలుమయ్యా - నీవే గతి**
**ఆలసింపకుము చాలా**
**ఆశ్రమ క్షేత్రపాలా"[62]**

**4. గ్రామ గ్రామమున - రామదాసులను**
**కాపాడుదువో - హనుమంతా**
**ప్రేమతోడ నమ్మిన - విశ్వానికి**
**పెన్నిధి నీవే - హనుమంతా"[63]**

అని స్వామి విశిష్టతను రామభక్తిని, ఆర్తత్రాణ పరాయణత్వాన్ని వివరించారు.

## 7. శివహారతులు

హరిహరులకు భేదం లేదని హరిహరాద్వైత సిద్ధాంతం చెబుతుంది. పరమాత్మ స్వరూపమే వివిధ రూపాలుగా కనిపిస్తుందని వేదాంత గ్రంథాలు వివరిస్తున్నాయి. శర్మగారు అసలైన దైవతత్వాన్ని దర్శించారు.

ఋషికాని వాడు కవి కాజాలడు. తపశ్శక్తివల్ల ద్రష్టగా మారినవారు మాత్రమే చక్కగా స్వామిని వర్ణించగలరు.

విశ్వనాథశర్మగారు విశ్వనాథుని ఐనా, శ్రీనాథుని ఐనా పరబ్రహ్మ దృష్టితో చూశారు.

**ప॥ "పరమాత్మా! హరా! హారతి గొనుమయ్య శంకరా"[64] (హరునిది)**

**ప॥ "కృష్ణ! పరమాత్మ - వేగ - రావయా" (హరిని)[65]**

అని స్తుతించారు. శ్రీ కృష్ణుని హారతులలో కృష్ణ సౌందర్యాన్ని ఎంత రమణీయంగా వర్ణించారో, శివ హారతులలో శివుని సౌందర్యాన్ని అంతే మనోహరంగా వర్ణించారు.

1.ప॥ "వెండికొండ దేవరా! చండికా మనోహరా!"[66]

2.చ॥ "ఫాలలోచన, పాపమోచన। బాలచంద్ర - కళాధరా।
నీలలోహిత, భక్త సేవిత। నిత్యమంగళ విగ్రహా।
కేల శూలము బట్టి - లోకాలేలుదొర వీవేనయా
లీలగా మమ్మేలగా - రాజాలవా - కరుణామయా"[67]

3ప॥ "నిటలాక్ష - నీరాజనం"[68]

4చ॥ "సొగసులు - గురిపించు - సగమేన - గౌరమ్మ
నగు మోముతో వెల్గు - సిగలోన గంగమ్మ
నాగుల నగలుంచి - నందిపై వేంచేసి
నగపాల దయయుంచి నను గాంచు మించు"[69]

5చ. "తోలు పుట్టము గట్టి - కేల శూలము బట్టి
లీలగా లోకాలన్ని - యేలుదువు కనిపెట్టి"[70]

ఈవిధంగా శివుని నివాసం, శివుని అలంకారం, పార్వతీదేవి అర్ధభాగంలో, జటలోగంగ గల శివుని, శివుని వాహనాన్ని చక్కగా వర్ణించారు. శివుని సగుణ, సాకార రూపాన్ని శర్మగారు ఈ హారతిలో దర్శించారు.

జానపద బాణీలో అచ్చ తెలుగు పదాలనధికంగా వాడి సంస్కృత పదాలను తక్కువగా వాడిన ఈ కింది హారతి సుమనోహరంగా రూపుదిద్దుకొంది.

1చ. "వెండి కొండపైన - వెలుగురేడా
చండికమ్మ - వలచిన మొనగాడా
దండి మహిమలు గలవాడ మెండు - బూచుల - యెకిమీడా
దండము - శంభుదేవుడా - శివ - శివ - శివ"[71]

2ప॥ "యెందుకయ్యా - జాగుసేతువు - నందివాహన శంకరా
అందుకొన రావయ్య - మంగళ - హారతిదిగో పురహరా"[72]

3ప॥ "రారా - మంగళ మందుకోరా - హరా
నా - భారమ్ము నీదే - భవానీ వరా"[73]

4చ॥ "ఓ శితికంఠ। నీ పాదమంట
చేసిన పాపాలు కలియును మంట
దాసుల యింట - గౌరమ్మజంట
వసియించుమా - నోముపంటా"[74]

**5చ. "యెద్దుపైన నీ సవారి - గద్దపైన నేమొహరి**
**యిద్దరిద్దరిద్దరైన - యిద్దరు వకటే నయా"[75]**

శివకేశవులు ఒకరేనని చాటారు.

### అ). పదప్రయోగ ఔచిత్యం

దయాజలధి, ఆత్మానంద నిధీ, ధూర్జటీ, నగపాల, నతపాల, దండి మహిమలు గలవాడ, శ్రీకంఠ, శితికంఠ, పన్నగాభరణ, చంద్రశేఖరా, భవా, హరా, రాకాధిపావనా, గంగాధర నందియానా, కుజనౌఘదూర, నగాధీశ్వరా అనే చక్కటి పదాలను, పదబంధాలను సమాసాలను భావం వ్యక్తమయ్యే విధంగా ప్రయోగించి, ఆయా సందర్భానుగుణంగా రచన సాగించారు.

### ఆ). అలంకార శిల్పం

శివుని గూర్చి 25 హారతులు శర్మగారు రచించారు. అందులో దాదాపు ప్రతిచరణంలో అంత్యప్రాసను ప్రయోగించారు. అక్కడక్కడ వృత్త్యనుప్రాసనుకూడా ప్రయోగించారు. అంత్యప్రాస పాదాల సమతౌల్యాన్ని, అనుప్రాసలయాత్మకతను కలిగించి, సంగీత సాహిత్యాలకు మెరుగులద్దుతాయి.

శివతాండవాన్ని గూర్చి వర్ణించే సందర్భంలో పదాలు, పాదాలు నాట్యం చేస్తున్నట్టు ఆయా పాదాలలో వర్ణించారు.

**2చ॥ "చండికా ప్రియ - చండ భుజదండా। రాకేందు మండల**
**మండితాభ్ర కిరీట। ధృతరుండ**
**ధండి డిండిమ - డమరునాద మజాండ భాండము**
**నిండ నిండగ చండతర - శంఖమ్ము మ్రోగ - నఖండతాండవలీల సల్పుము"[76]॥మ॥**

బిందుపూర్వక 'డ'కారాన్ని ఆవృత్తి చేయడంవల్ల శివతాండవాన్ని అక్షరరూప ఢమరుక ధ్వనిలో కనిపింపజేశారు. ఇది అక్షర శిల్పం. మరో చరణంలో

**చ॥ "యక్ష రక్షిత కక్ష। శ్రితపక్షా। దక్షాధ్వర క్షర**
**రూక్ష। దుష్ట విపక్ష। నిటలాక్షా।**
**దక్ష। రాక్షస శిక్ష। తక్షణ మోక్షద। విరూపాక్ష। సుందర**
**వక్ష। ధృత రుద్రాక్ష। దేవాధ్యక్ష। విషభక్షణ క్షమ। శుభ"[77]**

ఈ చరణంలో 20మార్లు 'క్ష'కారాన్ని పునరుక్తం చేసి, స్వామి రౌద్రరూపాన్ని, దుష్ట శిక్షణ, క్షమతను, శిష్టరక్షణ సామర్థ్యాన్ని, భక్త పాలనాదక్షతను లోకరక్షాపరత్వాన్ని వేనోళ్ళ చాటారు.

ఒక హారతిలోని చరణాలలో అంత్యప్రాసను ప్రయోగించి మనోహరంగా రచించారు.

**2చ॥ "శ్రీకంఠ శతరుద్ర - సేవకుల్ పూజింప**
**లోకేశ! నీభక్త - లోకమ్ము సేవింప**
**యే కారణము లేని - నీ కరుణలో ముంప**
**రాకాధిపావనా! రావయ్య! తిలకింప"[78]**

మొదటి చరణంలో శరణ, తరణ, హరణ, శ్రీ చరణ అని, మూడవ చరణంలో అలరారి, వేసారి, మంగళకారి, మదనారి అని ప్రయోగించి ఆ హారతిని మాటిమాటికి చదువరులు చదివి ఆనందించేటట్లుగా రచించారు.

## ఇ)సంస్కృతంలో శివహారతులు

సంస్కృతంలో మూడు హారతులు రచించి ముక్కంటికి సమర్పించారు.

**1ప. "తే దదామి - మంగళం - సాదరం - గృహాణ - శంభోశివ"[79]**
**2ప. "సమా కలయ శుభ మంగళం - శివ"[80]**

అనే పల్లవులతో ప్రారంభించిన హారతులలో శివవర్ణన మనోహరంగా కావించారు.

వీటిలో మూడవహారతి **"రామచంద్రాయ జనకజా మనోహరాయ"**[81] అని భద్రాచల రామదాసు వ్రాసిన మంగళగీతిని అనుకరిస్తూ శర్మగారు శివుని గూర్చి హారతి రచించారు.

**ప॥ "ఓం మంగళం నమశ్శివాయ మంగళ ప్రదాయ - సర్వ**
**మంగళా మనోభిరామాయ - మంగళం॥మం॥**
**చ॥ నంది వాహనాయ - దివ్య నాగభూషణాయ - మౌని**
**బృందవందితాయ - పరమశివాయ మంగళం॥మం॥**
**2. మహన్యాస సహిత - భవ్య - మహా రుద్రపూజితాయ**
**మహిత వైభవాయ - సాంబాయ మంగళం ॥మం॥**

3. శి వకరాయ - శంకరాయ - సేవకజన పోషకాయ
భవహరాయ - భవానీధవాయ - మంగళం ॥మం॥
4. వామదేవాయ - భక్త - కామిత ప్రదాయకాయ
కామకోటిసుందరాంగాయ మంగళం ॥మం॥
5. యక్షరాజ సేవితాయ దక్షయాగ సంహరాయ
రాక్షసాంతకాయ శశిధరాయ మంగళం॥మం॥
6. దయాపూర్ణ మానసాయ। ధర్మ మార్గ గోచరాయ
దాస విశ్వనాథ సన్నుతాయ మంగళం ॥మం॥"[82]

ఓం 'నమఃశివాయ' అనే పంచాక్షరీ మంత్రాన్ని పాదాద్యక్షరాలలో నిలిపి, శివతత్త్వాన్ని ఈ హారతిలో ప్రబోధించారు.

ప॥ "ఉమాభరణం శరణం వ్రజామి
కుమార జనకం- నాగ భూషణం"[83]

అనే పల్లవిలో ఒక హారతి శివునిగూర్చి శర్మగారు, తన వియ్యంకుడు రుక్మాభట్ల శ్రీ రాజేశ్వరశర్మ గారితో కలిసి రచించారు. ఈహారతిలో కూడా స్వామి యొక్క వైశిష్ట్యాన్ని వివరించారు.

## 8. విఘ్నేశ్వర హారతి

మన సంప్రదాయంలో ఏ శుభకార్యమైనా, విఘ్నేశ్వరుని పూజతో ప్రారంభిస్తారు. ఏకళాకారులైనా తమ నాటకాన్ని గాని, తమకళనుగాని, సంగీత సాహిత్య సభా వేదికనుగాని విఘ్నేశ్వర స్తుతితోనే ప్రారంభిస్తారు. ఇది సనాతన సంప్రదాయం.

విద్యను, శుభాలను ఇచ్చే దైవమని, చిన్నపిల్లలు మొదలు అంతా వినాయకుని ఉత్సవాలు జరుపుతారు. ప్రతి గృహంలోను, వీధి, వీధిన ప్రతిమను పెట్టి భక్తిగా స్వామిని ఆరాధిస్తారు.

అలాంటి ఉత్తమ దైవమైన విఘ్నేశ్వరుని "శ్రీ గణనాథంభజామ్యహం"[84] అంటూ త్యాగరాజు స్తుతించాడు.

శర్మగారుకూడా విఘ్నేశ్వరుని గూర్చి గానం చేయటానికి తనదైన రీతిలో

ప॥ "కరిముఖ! శ్రీకర! పరమదయాకర!
గౌరీసుత! శుభ నీరాజనం"[85]

అంటూ హారతిని ఆరంభించారు. తర్వాత చరణాలలో విఘ్నహర, లంబోదర, మూషక వాహనా, మోదక అశనా, నాగమయ భూషణ అని స్వామిని వర్ణించారు.

**"తొలి నీపూజలు - సలిపిన - విఘ్నాలు**
**తొలగి - సౌఖ్యములు- కలుగునయా**
**సలలిత - సుందర। స్వామి। యేకరద**
**కలిహర! విశ్వేశు గనవేమయా"[86]**

అని తొలిపూజలు అందుకొని, సౌఖ్యాలు కలిగించేవాడిని కీర్తించారు.

ఈవిధంగా శివుని గురించి, విఘ్నేశ్వరుని గురించి హారతులను రచించిన శర్మగారు అనేక రుద్రాభిషేకాలను నిర్వహించి, నిర్వహింపజేసి "నారుద్రో రుద్ర మర్చయేత్"[87] అనే వేదవాక్యానికి ఉదాహరణంగా నిలిచి తానే శివుడై లౌకిక, అలౌకిక కార్యాలనేకం నిర్వహించారు.

భక్తి పారవశ్యంతో రచనలుచేశారు. అలాంటి వాటిలో హారతులు సర్వజనాళికి మోదాన్ని కలిగిస్తూ, సంగీత సాహిత్య మేళవింపులతో (సాహిత్య) లోకంలో గుబాళిస్తున్నాయి.

## 9. భగవద్భక్తుల హారతులు

శర్మగారికి మార్గదర్శకులు, భక్తులు, వేదాంతులు అయిన శ్రీ వివేకానందస్వామి. శ్రీభావానంద స్వాములను గురించి తెలుగులో హారతులు రచించారు. సంస్కృతంలో శ్రీ ఆది శంకరాచార్యను గూర్చి ఒక హారతి రచించారు.

### అ). వివేకానంద స్వామి హారతి

వివేకానందస్వామి జన్మదిన వేడుకలు జరిగే సందర్భంలో శ్రీగౌరీభట్ల విఠ్ఠలశర్మగారు కోరగా వివేకానందుని గూర్చిశర్మగారు ఒక హారతి రచించారు.

**ప॥ "వివేకానంద యతి వర్యా**
**వినుము - నీరాజనము - సదయా"**

అనే పల్లవితో ప్రారంభించి,

**చ॥ "నరేంద్రా! నీదు బోధనలే**
**వరాలై - దేశమున వెలసే**
**స్థిరముగా - ముందు నిల్చుటకు**
**బరాబరి లేరు నీకెవరు"[88]**

అమెరికాలోను, భారతదేశంలోను వివేకానందస్వామి చేసిన ఉపన్యాసాలు యువతను జాగృతం చేశాయి. ఆయనకు సాటి ఎవరూ లేరని కీర్తించారు.

మిగిలిన చరణాలలో రామకృష్ణ పరమహంస కృపను మాకు పంచమని, భవ్య సందేశాన్ని ఇవ్వమని, భవాంబుధి తరింపగా దారిచూపి, పరమానందామృతాన్ని పంచమని వేడుకున్నారు.

**ఆ). శ్రీ భావానందస్వామి హారతులు**

**"మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ"**[89] అన్నది వేదోక్తి. ఆమాటలను త్రికరణశుద్ధిగా ఆచరించినవారు శ్రీ విశ్వనాథశర్మగారు. అన్ని దైవాలకంటే ముఖ్యమైన దేవతలు తల్లిదండ్రులు.

అనేక దేవతాస్తుతులు చేసిన శర్మగారు తల్లిదండ్రులను దైవ స్వరూపులుగా భావించి అనేక విధాలుగా స్తుతించారు. మంగళ నీరాజనాలు రచించారు.

తండ్రిని గురువుగా సేవించిన శర్మగారు 'గురువరా! నీదయ' అంటూ పల్లవిలోనే తన గురుభక్తిని చాటారు. చక్కటి భక్తి భావనతో ఒక మంగళహారతిలో తండ్రి వర్ణన, రెండవ హారతిలో ఆయన ఆరాధన కన్పిస్తుంది.

**ప॥ "గురువరా! నీదయ**

**అ॥ప॥ సరగున రావా! నా - మొరవిని బ్రోవ**
**హరిమయ సంసార - యతి పుంగవా"**

**చ॥ "కాషాయ శుభవర్ణ కలితాంబరా**
**కర విస్ఫురద్దండ - జలమండలా**
**కరుణాకరా - మేఘ శ్యామలా**
**కనుమా - భావానంద - వన మందిరా"[90]**

కాషాయ వస్త్రాలతో దండ కమండలాలతో, మేఘశ్యామలాకృతితో వెలుగుతున్న స్వామిగా తండ్రిని దర్శించారు.

రెండవ హారతిలో

**ప॥ "నీరాజన మిది - గొనుమోదేవా**

**అ.ప॥ నిరవధి సుఖదాతా - శ్రీగురువర మాచేత**

**చ॥ జీవకోటి దుస్థితిని గని - గురు**
**దేవా! మంగళ - గీతివిని - హరి**

**భావానందమును - ప్రసాదించుము**
**గావుము - నిరుపమ - ప్రేమధుని"**[91]

తనను బాధలనుండి దూరంచేసి, తనకు భావానందాన్ని కలుగజేయమని, చిత్తశాంతిని సమకూర్చమని – పత్ర, పుష్ప, ఫల తోయాలను స్వీకరించి పరమానందం పొందమని భావానంద స్వామిని వేడుకున్నారు.

ఒక హారతిలోని శ్రీకృష్ణుని వర్ణించే చరణంలో

**"అతి హీనుడను - నీవే గతి - శ్రీ భావానంద**
**యతి రూపమున నిన్ను - సతతమ్ము నుతియింతు"**[92]

అంటూ శ్రీ భావానంద యతిరూపంలో ఉన్న శ్రీకృష్ణుడవైన నిన్ను వేడుకుంటాను అనే భావన గమనిస్తే తండ్రి, గురువు, దైవం ముగ్గురినీ శర్మగారు భావానంద స్వామిలో చూడగలిగారు. ఆయన పితృభక్తికి ఈ ఉదాహరణచాలు. శ్రీకృష్ణుని 'భావానంద' అని, పాండురంగని 'భావానంద యతివరాయ' అని సంబోధించారు.

ఈవిధంగా తండ్రిని అష్టకాలలో, స్తోత్రంలోలాగా మంగళహారతుల్లోను స్మరించి తరించారు.

**ఇ). శ్రీ శంకరాచార్య హారతి**

సంస్కృతంలో శ్రీ ఆదిశంకరాచార్యులను గూర్చి వ్రాసిన హారతిలో శంకరుల జీవిత సన్నివేశాలు కనిపిస్తాయి.

**ప॥ "గురుదేవ! గురుదేవ! వరశివ గురుపుత్ర। పరశివ సుఖమాత్ర**
**కరుణాలయ। మంగళ మాకలయ సుచారిత్ర। గురుదేవ"**[93]

అంటూ గురువుగా, కారుణ్యమూర్తిగా, మంచి చరిత్ర కలవానిగా కీర్తించారు.

**చ॥ "మండన మిశ్రోద్ధత మత ఖండన చాతుర్యాఽఖండ తపశ్చర్య పాండిత్యోజ్జీవిత భూమండల శుభచర్య"**[94]

అంటూ స్తుతించిన ఈ హారతిలో ఆయన జీవితఘట్టాలు స్ఫురిస్తాయి.

ఈవిధంగా భగవద్భక్తుల గురించి చక్కగా హారతులలో వారిని స్తుతించారు.

## 10). స్త్రీ దేవతా హారతులు

దేవీ పరమైన హారతులను శర్మగారు రచించారు. అందులో సంతోషిమాత, సరస్వతీ, రాజేశ్వరీ, 'యశోద'లను గురించి రచించారు.

## 1). సంతోషిమాత హారతి

సంతోషంకలిగించే అమ్మగా ప్రసిద్ధిపొందిన ఈదేవిని "జననీ నీరాజనం"[95] అంటూ హారతిని అర్పించారు.

**చ॥ "కొలిచిన వారికి - కోటి వరాలు**
**తలచిన వారికి కలుగు సుఖాలు।**
**పిలచిన వారల - పెన్నిధివమ్మా**
**మలయజ ధారిణి - మాతా - సంతోషి"[96]**

సంతోషిమాతను కొలిస్తే వచ్చే సుఖాదులను ఈహారతిలో వివరించారు. మిగిలిన రెండు చరణాలలో నిన్ను ఆరాధించిన మనుజులు హాయిగా ఉంటారని, చేతిలో ఖడ్గం, శూలం ధరించి లోకాలను ఏలుతూ ఉంటావని, మాపై దయచూపుమని ప్రార్థించారు. విశ్వానికి సంతోషాన్నిచ్చే అమ్మగా ఆమెను నుతించారు.

## 2). సరస్వతీదేవి హారతి

సరస్వతీ దేవికి సరస్వతీ రాగంలో ఒక హారతిని సమర్పించారు.

**ప॥ "నీరాజనము గొనుము వాణీ! వీణాపాణీ"** అని ఆరంభించి చరణంలో

**"నీరజ దళనేత్రి। నిత్య మంగళదాత్రి**
**నిరుపమ సౌందర్య - నిర్మల శుభగాత్రి**
**భారము నీదేసుమా - శ్రిత భక్త జనయిత్రి**
**సారె సారెకు నిన్ను - సన్నుతింతు - నమ్మ భారతి"[97]**

అంటూ సరస్వతీదేవి దివ్య మంగళమూర్తిని ధ్యానించారు.

మరో చరణంలో

**"కాటుక కనుదోయి - కరుణామృతము గురియ**
**పాటలాధరమందు - పసిడి నవ్వులు మెరయ**
**నీటైన నీరూపు - నేత్రోత్సవము సేయ**
**మాటలు- విశ్వేశు - పాటలై జగాన వెలయ"[98]**

అంటూ వాణీదేవిని కాటుక కంటితో కరుణామృతాన్ని కురిపించమని పాటలాధరంతో నవ్వులు చిందించమని, నీరూపం మాకు నేత్రపర్వం చేయగా తన మాటలు విశ్వేశునికి పాటలై లోకంలో వెలయగా కరుణించమని వేడుకున్నారు. తనవాణిలో వాణిని ఉండమని ప్రార్థించారు.

**అ). అలంకారశిల్పం**

ఈ హారతిలో రెండవ చరణం అంత్యప్రాసలతో విరాజిల్లింది.

**"జలజ సంభవురాణి– చదువుల పూబోణి**
**సలలిత పదసరణి - సైకత సుశ్రోణి**
**విలసిత నీలవేణి - విమల సంభాషిణి**
**కలిమల హారిణి - హంస వాహిని"[99]**

అనిసమాసాల చివర 'ణి' పాదాంతంలోను 'ణి' ప్రయోగించి వీణాపాణి, వాణిని రమణీయంగా నుతించారు.

**3). రాజరాజేశ్వరీ హారతులు**

విశ్వనాథ శర్మగారు రాజేశ్వరీదేవి, లలితలను ఒకటిగా భావించారు. హారతులు వేరుగా వ్రాసినా ఒకే విధమైన అర్థాలుగల పదాలు, సమాసాలను కూర్చి వారిని స్తుతించారు.

శ్రీ రాజరాజేశ్వరి హారతులు రెండు రచించారు. మొదటి హారతిలో

**ప॥ "ఆనందమయీ - శ్రీలలితా - హారతిగొనుమా**
**అమ్మా - నీ తనయుల - మమ్మాదరించుమా"[100]**

రెండవ హారతిలో

**ప॥ "జననీ - శ్రీ రాజరాజేశ్వరీ"[101]** అని రచించారు.

**"శ్రీ రాజరాజేశ్వరీ - రాజ్యదాయినీ, రాజ్యవల్లభా"[102]** అని లలితా సహస్ర నామాలలో ఉంది. కాబట్టి రాజరాజేశ్వరికి, లలితకు అభేదాన్ని పాటించారు.

**చ॥ "శ్రీ చక్రనగర సామ్రాజ్ఞీ - త్రిపురసుందరీ**
**శ్రీ పంచదశీ సౌభాగ్య - రాజేశ్వరీ - రాజరాజేశ్వరీ"[103]**

శ్రీ చక్రం, పంచదశీ, సౌభాగ్య మహామంత్రాలకు అధిష్ఠాన దేవత అంటూ రెండు హారతులలో ఇదే విషయాన్ని వేరు, వేరుగా వివరించారు.

'ఇక్షు, సుమ, పాశ, అంకుశాలతో శోభిల్లు శ్రీమాతా మమ్ములను బ్రోవుము. మరువకుము మాయాధీశ్వరీ' అని వేడుకున్నారు.

లలితాదేవిని గూర్చి వ్రాసిన హారతిలో

**ప॥ "కరుణామయి శ్రీలలితా**
**వరమంగళమో మాతా"[104]**

అనే పల్లవితో రచించిన ఈ హారతిలో అమ్మను స్తుతిస్తూ ఒక చరణంలో

**"నాదు హృదయ పంకజమున**
**నంద నందనా కృతితో**
**ఊదుచు మురళిన్ పాయక**
**నుండుము దేవీ దయతో"[105]**

అంటూ శ్రీకృష్ణుని ఆకృతిలో మురళీగానం చేస్తూ నా హృదయంలో ఉండాలని వర్ణించటం గమనిస్తే 'పరబ్రహ్మ' స్వరూపంగా సర్వమూర్తులను శర్మగారు దర్శించారని చెప్పవచ్చు.

**4). శ్రీ యశోదా మాత హారతి**

దేవీ హారతులతోపాటు మాతృమూర్తి యశోదమ్మ గారిని గూర్చి ఒక హారతి రచించారు.

**ప॥ "నీరాజనము - యశోదామాతా**
**నీ కిడిదుము జోతా - నీవే మా యూత శుభ"[106] ॥నీ॥**

అమ్మా నీకు నమస్కారం, నీవే మాకు ఆధారం అంటూ ప్రార్థించారు.

**చ॥ "భూత ప్రేమోల్లాసినీ**
**పుణ్యాఖనీ సువాసినీ**
**స్వాతంత్ర్యమ్మే - లేని మముగని**
**స్వపదమ్మున - జేర్చుము జనని"[107]**

పుణ్యమూర్తి, సువాసినీ, ప్రాణులపట్ల అమితాదరం కలిగిన మహా యిల్లాలు. భవ బంధాలలో ఉన్న మాకు 'ముక్తి'ని ప్రసాదించుమని వేడుకున్నారు.

నిజానికి మాతృమూర్తి మరణంతో ఆవేదన చెందిన శర్మగారు ఆ ఆవేదనతోనే కవితా ప్రపంచంలోకి అడుగుపెట్టారు. ఆమె తనకు జన్మను, కవిత్వాన్ని రెంటిని ఇచ్చిన మాతృమూర్తి.

ఈవిధంగా వివిధ మంగళహారతులను భక్తితో, ఆర్తితో, ఆవేదనతో రచించారు. సంగీత, సాహిత్యాలతో శోభిల్లే శర్మగారి హారతులు ఆ ప్రాంతం వారికి కొంగు

బంగారంగా భాసిల్లు తున్నాయి. భక్తి రసాయనంతో రంగరించి రచించిన హారతులు ముక్తిదాయకాలై పాఠకులను మురిపిస్తున్నాయి.

## 11. హారతులలోని విషయ విశ్లేషణం

**1. భౌతిక వర్ణనా హారతులు :** (స్వామి బాహ్య సౌందర్య వర్ణన)

శర్మగారు సాకారమూర్తిని కనులకు కట్టినట్టుగా వర్ణించారు. కృష్ణుని, పాండురంగస్వామిని, శ్రీరాముని, శివుని, ఆంజనేయుని, భావానందస్వామిని వీరితోపాటు స్త్రీ దేవతా మూర్తులను మనోహరంగా వర్ణించారు.

**అ). శ్రీ కృష్ణుని వర్ణన:**

**చ॥ "సొగసుల గనియైన - నగుమోముతో**
**సోగ కనుదోయితో - సొంపురానడలతో"[108]**

స్వామిఅందం, స్మితవదనం, అందమైన కళ్ళు, చక్కటి రాచనడకలను వర్ణించారు.

**చ॥ "కలువల - నిరసించే - కనులు**
**చెలువల - అలరించు - కరాలు**
**నీలకాంతులు - నీ ముంగురులు - నీ అందాలు**
**సలలిత పదములు - కలిమల హరములు"[109]**

కళ్ళు కలువలను నిరసిస్తాయి. చేతులు స్త్రీలను అలరిస్తాయి. నీల కాంతిగల ముంగురులు సుకుమారమైన పాదాలు, కలిదోషాలు హరించునవి. వీటితో కృష్ణుడు ప్రకాశిస్తాడని వర్ణించారు.

**చ॥ "నీల నీల - కాంతుల వెలయ, నెమలికన్ను బెట్టుకుని**
**మీలనేలు చూపులు వరల - కేలమురళి - బట్టుకొని, ఆహా!**
**మేలిమి - పుట్టము గట్టుకొని - మిల మిల నామము దీర్చుకొని**
**అందుకోరా - మురారీ మంగళహారతి మముజేరి"[110] ॥రా॥**

నీలమేఘుడు, శిఖిపింఛమౌళి, మురళీధరుడు, పీతాంబరధారి అని కృష్ణుని భౌతిక సౌందర్యాన్ని చిత్రించారు కవి.

ఇలాంటి భావమే ఒక సంస్కృత హారతిలోను కనిపిస్తుంది.

**చ॥ "శ్రీకర, కౌస్తుభ భూషణ - కేకి పింఛమకుట, సకల**
**లోకేశ్వర, నీల నీల - రూప సుధారసఝరీ"[111]**

ఇలా కృష్ణుని అంగాంగ వర్ణనను ఆకర్షణీయంగా చేశారు కవి.

**ఆ). శివుని వర్ణన**

శర్మగారు హరిని ఎంత మనోహరంగా వర్ణించారో అంతే మనోహరంగా హరుని వర్ణించారు.

**చ॥ "ఫాలలోచన। పాపమోచన। బాలచంద్ర కళాధరా।**
**నీలలోహిత। భక్తసేవిత। నిత్యమంగళ విగ్రహా।**
**కేలశూలముబట్టి లోకా - లేలుదొర వీ వేనయా**
**లీలగా మమ్మేలగా - రాజాలవా? కరుణామయా"[112]**

ఫాలలోచనుడు, బాలచంద్ర కళను ధరించినవాడు, నీలలోహితుడు, భక్త సేవితుడు, శుభకరమైనమూర్తి, శూలధారి అని శివుని భౌతిక రూపాన్ని దర్శింపజేశారు.

**చ॥ "సొగసులు గురిపించు - సగమేన - గౌరమ్మ**
**నగుమోముతో వెల్గు - సిగలోన గంగమ్మ**
**నాగుల నగలుంచి నందిపై వేంచేసి**
**నగపాల దయయుంచి ననుగాంచు మించి"[113]**

గంగాధరుడు, అర్థనారీశ్వరుడు, నాగాభరణుడు, నందివాహనుడు అని శివుని సాకార రూపాన్ని చిత్రించారు.

తెలుగులోనే కాక సంస్కృతంలో శివుని వర్ణనను గావించారు.

**చ॥ "గజ చర్మాంబర 'గజరిపు సంహర।**
**గజముఖ కలితాదర**
**భుజగ భూషధర। రజిత గిరీశ్వర।**
**భజనీయ। శశిశేఖరా।**
**నిజ భక్తాధారా। కుజనౌఘ దూరా"[114]**

గజచర్మాంబరధారి, భుజంగ భూషణుడు, కైలాసవాసుడు, శశిశేఖరుడు అని శివుని రూపాన్ని చిత్రించారు. తెలుగు, సంస్కృతం – రెండింటిలోను ఏ మూర్తినైనా కనులకు కట్టేటట్లు వర్ణించి, ఆ చిత్రాన్ని మనఃఫలకంపై స్థిరంగా ముద్రపడేటట్లు రచించారు శర్మగారు.

**2. మానసిక వర్ణనా హారతులు (అంతఃసౌందర్యం)**

**అ) శ్రీకృష్ణుని మానసిక చిత్రణం**

భగవంతుని బాహ్యసౌందర్యాన్ని ఎంత చక్కగా చిత్రించారో అంతే మనోహరంగా అంతఃసౌందర్యాన్ని కూడా చిత్రించారు.

అంతఃసౌందర్యంలో స్వామి దయార్ద్రహృదయం, ఆర్తత్రాణ పరాయణత్వం మొదలైన గుణాలను చిత్రించారు. వాటికి సంబంధించిన కథలు, లీలలను హారతులలో అనేకమార్లు ప్రస్తావించారు.

**అ.ప॥ "కరుణాంతరంగ - హరీ పాండురంగ"[115]**

**చ॥ చల్లని చూపుల యుల్లము దోచే నల్లని నా స్వామి"[116]**

**చ॥ "హరే, దీనబంధో। దయాపూర్ణ సింధో"[117]**

**చ॥ "పుండరీక హితకరా। మురహర। మురళీధరా।**
**నిండు మనసునీదిరా। నీవే మాకు దిక్కురా।"[118]**

**చ॥ "కాపాడుమా - దీన చింతామణీ**
**మాపాలి - గోపాల చూడామణీ**
**చూపించు నీ దివ్య బృందావనీ**
**ఆపన్న జనశీల రక్షామణీ"[119]**

**ప. "కనిపించురా కరుణాసాగరా"[120]**

**ప॥ "దేవదేవా! పాండురంగా। దీనమందారా,**
**సేవయొసగి - కావుమయ్యా। జీవనాధారా[121] ॥దే॥**

అని స్వామిని కరుణాసాగరుడని, దీనులకు కల్పతరువు (మందారం) అని, చింతామణియని, ఆపన్నజనులకు రక్షకుడని, నిండుమనసు కలవాడని స్తుతించారు. శర్మగారు స్వామి హృదయా విష్కరణ చేసి, ఆయన భక్తుల హృద్వీథిలో నివసించడానికి తోడ్పడ్డారు.

**ఆ). రాముని మానసిక చిత్రణం**

శ్రీరాముని గుణగణాలను శర్మగారు కింది చరణాలలో వర్ణించారు.

**చ॥ "ఏకవచన శర। ఏక వధూవ్రత**
**సాకారధర - భూ.మాకార మాం"[122]**

**ప॥ "దశరథ నందన। దశముఖ భంజన"[123]**

**చ॥ "సీతా సమేత। శ్రిత పారిజాత"**
**వాతాత్మజనుత। వైకుంఠనేత హరి"[124]**

శ్రీరాముడు ఒకే బాణం, ఒకే స్త్రీ వ్రతం కలవాడు, దశరథ తనయుడు, దశకంఠుని హతమార్చినవాడు, సీతారాముడు, ఆంజనేయుని ప్రభువు, వైకుంఠాధిపతి అని రాముని విశిష్టతను తెలిపారు.

### 3. కథా స్ఫురణ హారతులు

శర్మగారు కొన్ని హారతులలో అక్కడక్కడ భాగవత కథలను ప్రస్తావించారు.

**1చ॥ "సతితో శ్రీమద్భాగవత మందు వ్యాపించి**
**ప్రతిచోట భాసించు - శృతి సార - నతపాల"[125]**

అని భార్యయైన రుక్మిణితో భాగవత కథలన్నిటా వ్యాపించి అంతటా ప్రకాశించే, వేదసారుడని భగవంతుని (కృష్ణుని) కీర్తించారు.

మరొక హారతిలో భాగవత, భారత కథాంశాలను నిక్షిప్తం చేశారు.

**చ॥ "కరి వరదుడవై - పరువిడలేదా?**
**కురుసభ ద్రౌపది - మొర వినలేదా?**
**సరగున మముగను - తరుణము రాదా?**
**హరి హరి? మాపై - కరుణ గలుగదా?"[126]**

అని గజేంద్ర మోక్షం, ద్రౌపదీ మానసంరక్షణం ఘట్టాలను ప్రస్తావించి గజేంద్రునిపై, ద్రౌపదిపై కరుణచూపినవిధంగా తనపై కూడా కరుణను ప్రసరింపజేయమని కోరారు.

భాగవత దశమస్కంధంలోని బాలకృష్ణుని లీలలను అనేక విధాలుగా చిత్రించారు.

**"ఘన యశోద - శ్రీకృష్ణరూపమున**
**కట్టి వైచె - రోటన్ - బ్రహ్మమున్"[127]**

అని శ్రీకృష్ణుని యశోద రోటికి కట్టిన సన్నివేశాన్ని చిత్రించారు.

**"గోలోక ధాముడివై - గోకులాన వెలసితివి**
**గోవులను గాచితివీ - జీవులను బ్రోచితివి**
**గోలచేసి గోపికల - పాలు వెన్న దోచితివి**
**గోవర్ధన గిరిని జేరి - గోవిందుడవైతివి."[128]**

గోపాలుడుగా, నవనీత చోరుడుగా, గోవర్ధనోద్ధర్తగా గోవిందుడు చేసిన చేష్టలను చిత్రించారు.

భాగవత కథలతోపాటు భక్తులను కూడా స్మరించారు.

'పుండరీక హితకరా! మురహర' భక్తుడైన పుండరీకునికి మేలుచేసిన వాడా! అనే సంబోధనలో భక్తుడైన పుండరీకుడు మనకు దర్శనమిస్తాడు.

ఈవిధంగా తమ హారతులలో భాగవత, భారత కథలను స్ఫురింపజేస్తూ తద్వారా భగవంతుని ఆర్తత్రాణ పరాయణత్వాన్ని స్థిరీకరించారు.

**4. మధురభక్తి హారతులు**

"తత్ర్పాప్య తదేవావలోకయతి తదేవ శృణోతి తదేవ భాషయతి తదేవ చింతయతి."[129] భగవత్ ప్రేమను పొంది మధుర భక్తుడైనవాడు, ఆ ప్రేమనే చూస్తాడు. దానినే యాలకిస్తాడు. దానినే వర్ణిస్తాడు. దానినే చింతిస్తాడు.

"దివ్యమైన యీ ప్రేమ రసమందు మునిగి ప్రేమానందమయుడైన భక్తుడు సర్వత్ర తన ప్రేమమయుడు, రసమయుడునగు ప్రియతమునే దర్శించును. అతనికి ఎందును అన్యవస్తువు ఏదియు గానరాదు"[130] ఇది మధురభక్తి తత్త్వం.

భక్తునికి భగవంతునికి ఉన్న ప్రేమతత్త్వం.

శర్మగారు కూడా తన హారతులలో ఎక్కువగా మధురభక్తికి ప్రాధాన్యం ఇచ్చారు.

**1). "అందముగ నా హృదయ - బృందావనములోన**
**నంద నందన ప్రేమ - విందిడదు మనసార"[131]**

**2). "సుమ - కోమలాంగ జాగేలా? నీ**
**ప్రేమను నాలో నించి బ్రోవవే"[132]**

**3). "విశ్వనాథుని - ప్రేమామృతమును**
**వేడుకతో చవి - చూడుమయా"[133]**

**4). "నా మదిలో - ఘన శ్యామానందము**
**ప్రేమోన్మాదము - పెంపున బొరలుచు"[134]**

**5). "ఓ శ్యామతేజా - ప్రేమ నైజా"[135]**

**6). "నీ విశ్వానికి - నేత్రోత్సవమై**
**నిలువుము - ప్రేమధుని గోవిందహరి"[136]**

**7). "ప్రేమతోడ నిన్ను - సేవిస్తాను - ఆ**
**ప్రేమలోన మునిగి - ధ్యానిస్తాను**
**ప్రేమించే విధము - యే మాత్రము తెలియదు."[137]**

**8). "నీల మోహనాంగ। ప్రేమ జాలువార - నీ విశ్వము**
**నేలుమయ్య। భవ్య సుగుణజాల। కృష్ణ, శైలభార"[138]**

**9). "డెందమందు నీ పాదార విందములను ప్రేమమీర**
**పొందుపరచి కన్నులార - కందు సతము - కాంక్షదీర"[139]**

ఈ హారతులలోని చరణాలలో మధురభక్తి ప్రధానంగా రచన సాగింది. రాధాదేవి ప్రేమభక్తి కూడా ఇలాంటిదే.

చైతన్య మహాప్రభువు కూడ మధురభక్తి (ప్రేమభక్తి) సంప్రదాయాన్నే పాటించాడు. "భగవంతునిపట్ల ప్రేమగలిగి, అతని లీలావతారముల ద్వారా చేయబడిన దివ్యలీలలను స్మరించుచు అతని పాదపద్మములయందు అనన్యమైన ప్రీతి కలిగిన భక్తునకు విభిన్నమైన బాహ్యదశలు కలుగును. భగవంతుని నిరుపమ సౌందర్య మాధుర్యాతిశయమును, ఆనంద నిమగ్నుడై మాటిమాటికి పులకితుడగుచుండు భక్తునకు క్షణక్షణము రోమాంచితమై స్వరము గద్గదికయై మాటలు తడబడుచుండును. హృదయమునందు భగవంతుడనిన అనన్యమైన భక్తి, ప్రీతి కలిగిన భక్తుని స్థితి అలౌకికముగను, వర్ణించసాధ్యము కానిదిగను ఉండును."[140]

భగవంతుని కోసం పిచ్చి పట్టటంలోని మధురానందం అనుభవించే ఆ భక్తునికి మాత్రమే తెలియటం సాధ్యం తప్ప ఇతరులకు అర్థంకాదు. అలాంటి భక్తుని ఈ ప్రపంచమంతా ప్రేమనిలయమై, ప్రేమ స్వరూపంగా తోస్తుంది. ఇదే చైతన్యమహాప్రభువు పొందిన అనిర్వచనీయ ఆనందం. అతని సిద్ధాంతంలో "ముక్తి మార్గములు రెండు : మోసములేని విశ్వాసము, ఎడతెగని భక్తి"[141]

శర్మగారు కూడా అలాంటి భక్తి భావనతో హారతులు రచించారు. ప్రేమజాలువార, ప్రేమభావ, ప్రేమామృతమ్ము, ప్రేమనైజా, ప్రేమోన్మాదము, ప్రేమమీర, ప్రేమధుని, ప్రేమాంతరంగ, ప్రేమఘనా, ప్రేమాధీనా, ప్రేమమయా, ప్రేమ సుధాసాగరా లాంటి పదాలను అనేకమార్లు ఉపయోగించారు.

(మధుర) భక్తి రసానికి స్థాయి భగవద్రతి. ఆ భగవద్రతి శర్మగారి హారతులలో స్పష్టంగా గోచరిస్తుంది. అందువల్ల ఆయన హారతులలో కొన్ని మధురభక్తి తత్త్వ ప్రతిపాదకాలని చెప్పవచ్చు.

## 5. వైరాగ్య వేదాంత ప్రతిపాదక హారతులు

శర్మగారి హారతులలో వైరాగ్య వేదాంతాలను మనం దర్శించవచ్చు.

**1చ॥ "దారిలేని సంసార వనమ్మున - దూరితి నిన్నెడబాసి**
**దార సుతులె గతియని - మోహమ్మున - దవిలియుంటి కనుమూసి**
**ఘోర పాపములు జేసి - ఓ - కారుణ్యామృత ఘనజలరాశి భారమిదో కొనరావే-**
**నా భారమిదో కొనరావే" ॥మము॥[142]**

**2చ॥ "స్థిరముగాదు జీవితము - పరమాత్ముడె సత్యము**
**హరినామ సుధారసము - నరులకు తారకము**
**నిరతము దేవునిపై మది - నిల్పుటె పరమార్థము**
**కరము విశ్వనాథ విభుని - గనుడీ మంగళమిడి"[143]**

**3చ॥ "నేలనింగి - నిప్పునీరు - గాలితో నిర్మించినా**
**తోలుబొమ్మల - పాత్ర పోషణ - చాలు విశ్వము నేలుమా"[144]**

**4చ॥ "ఘోర సంసార - నరకాన - కుమిలించకు**
**సారమేలేని - భోగాల - చవి జూపకు**
**దారి జూపించి దీవించి - మారాడకు**
**చేరరా చెంతకు - వేరుగా చూడకు**
**చేరి లాలించి పాలించు విడనాడకు"[145]**

**5చ॥ వేదాటవిలో వెదకెదవేలా"[146]**

ఈ ప్రపంచం అశాశ్వతం, మోక్ష సామ్రాజ్యమే శాశ్వతం. సారంలేనిది ఈ సంసారం. ఈ మాయను తొలగించి, జ్ఞానాన్ని ప్రసాదించమని వేడుకున్నారు. పాంచభౌతికమైన ఈ శరీరం స్వామి కల్పించిన తోలుబొమ్మ అని, దీనికి సూత్రధారి పరమాత్ముడని తేటతెల్లంగా చిన్ని చిన్ని పదాలతో వివరించారు. ఇలా తమ హారతులలో వైరాగ్య, వేదాంత భావాలను ప్రతిపాదిస్తూ రచన కావించారు కవి.

## జ్ఞాపికలు


1. జానపద గేయ సాహిత్యము : డా॥ రామరాజు బిరుదురాజు, పుట - 339
2. జానపద గేయ సాహిత్యము : డా॥ రామరాజు బిరుదురాజు, పుట - 380
3. అన్నమాచార్యుని మధుర కీర్తనలు : సమీకరణ - శ్యామసుందరి, ముత్య., పుట-63
4. అన్నమాచార్యుని మధుర కీర్తనలు : సమీకరణ - శ్యామసుందరి, ముత్య.. పుట-62
5. సంకీర్తనావళి : సంకలనం - డా॥ కృష్ణమాచార్యులు యం., పుట - 93

6 & 7. జీవిత పరమార్థము - వేదాంత శాస్త్రము :నాగమణి కొండూరు., పుట - 85

8. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 1988 సం. ముద్రణ

9 & 10. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 48

11. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 19
12. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 49

13 & 14. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 33

15. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 54
16. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 51
17. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 33
18. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 27
19. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 28
20. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 45
21. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 15
22. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 47
23. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 53
24. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 55
25. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 12
26. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 18
27. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 54
28. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 44
29. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 48
30. వాసుదేవ మంగళ సంకీర్తన : సంకలనం - మైత్రామశర్మ త్రిగుళ్ళ., పుట - 54
31. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 12
32. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 15
33. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 31
34. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 50
35. వాసుదేవ మంగళ సంకీర్తన : సంకలనం - మైత్రామశర్మ త్రిగుళ్ళ., పుట - 48

36. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 39
37. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 57
38. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 8
39. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 39
40. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 16
41. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 11
42. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 11
43. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 12
44. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 42
45 & 46. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 8
47 & 48. వాసుదేవ మంగళ సంకీర్తన : సంకలనం- మైత్రామశర్మ త్రిగుళ్ళ., పుట-57
49. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 13
50. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 37
51. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 12
52. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 67
53. ఘంటసాల మధురగీతాలు : పుట - 20
54. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 62
55. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 66
57. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 66
58. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 69
59. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 71
60. ఘంటసాల భక్తిగేయాలు : సముద్రాల, పుట - 22
61&62. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 70
63. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 71
64. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 87
65. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 43
66. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 94
67. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 82
68. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 81
69. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 83
70. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 95
71. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 78
72. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 82

73. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 75
74. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 79
75. మంగళమంజరి(వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 5
76&77. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 76
78. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 89
79. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 93
80. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 96
81. సంకీర్తనావళి : సంకలనం - కృష్ణమాచార్యులు., పుట - 93
82. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 77
83. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 21
84. త్యాగరాజ కీర్తనలు : సంకలనం - ప్రసన్న తెన్నేటి.
85&86. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 72
87. మహాన్యాసాది : రామానుజ జ్యౌతిషికేణ,
గోమఠం - బోధాయనోక్త మహన్యాసాదిఖండః, పుట - 56
88. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 103
89. ఉపనిషద్దర్శనము (మొదటిభాగము) : శ్రీనాథ వేంకట సోమయాజులు, నోరి - తైత్తిరీయోపనిషత్, అనువాకం-2, పుట - 24
90. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 1
91. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 10
92. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 21
93&94. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 11
95&96. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 102
97,98,99. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 98
100. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 99
101. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 100
102. శ్రీలలితా, విష్ణు సహస్రనామస్తోత్రములు :
సంకలనం - రాధాకృష్ణమూర్తి, పురాణపండ, శ్లోకం-137, పుట -13
103. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 99
104&105. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 101
106&107. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 105
108. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 12
109. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 40
110. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 49

111. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 52
112. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 82
113. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 83
114. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 86
115&116. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 19
117. మంగళమంజరి(వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 16
118. మంగళమంజరి(వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 17
119. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 35
120. వాసుదేవ మంగళ సంకీర్తన : సంకలనం - మైత్రామశర్మ త్రిగుళ్ళ., పుట - 25
121. మంగళమంజరి(వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 10
122&123. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 69
124. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 68
125. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 21
126. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 31
127. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 59
128. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 33
129&130. నారదభక్తిసూత్రములు : హిందీమూలము - హనుమాన్ ప్రసాద్, పోద్దార్. ఆంధ్రానువాదము - ఉదయభాస్కరమ్, బులుసు.సూ-55., పుట - 125
131&132. మంగళమంజరి (వ్రాతప్రతి) : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 20
133. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 28
134. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 29
135. వాసుదేవ మంగళ సంకీర్తన : సంకలనం - మైత్రామశర్మ త్రిగుళ్ళ, పుట - 15
136. వాసుదేవ మంగళ సంకీర్తన : సంకలనం - మైత్రామశర్మ త్రిగుళ్ళ., పుట - 51
137. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 48
138. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 14
139. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 32
140 & 141. సకలార్థసాగరము : దొరసామయ్య ఓ.వై., పుట - 52
142. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 15
143. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 25
144. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 34
145. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 57
146. మంగళమంజరి : విశ్వనాథశర్మ అప్పాల., పుట - 59

# 9. పూజపాట - షోడశోపచారాల తేట

వైదిక మార్గానుయాయులలో నిత్యకృత్యమైనది పూజ. దీన్ని అధికంగా షోడశోపచారాలతో నిర్వహిస్తారు. ఆ పూజా విధానాన్ని గానంచేసే విధంగా తిలక్ కామోద్ రాగం, ఆదితాళంలో శ్రీ విశ్వనాథ శర్మగారు పూజపాటగా రచించారు. ఇది 'మంగళ మంజరి' అనేగ్రంథంలో ముద్రించ బడింది.

పూజ, అర్చన అనేవి పర్యాయపదాలు. నవవిధ భక్తుల్లో అర్చన ఐదవస్థానంలో ఉంది. "ముగ్గు, సుగంధం, అక్షతలు, పుష్పం,ధూపం, దీపం, ఉపహారం, తాంబూలం అనే ఎనిమిది విధాలతో కూడినదిపూజ"[1] అని శ.ర.కారుడు వివరించారు.

ఇది మానసిక పూజ, బాహ్యపూజ అని రెండువిధాలు. మానసపూజ అంటే మానసికంగా మంత్రాలు మననం చేస్తూ భౌతిక వస్తురహితంగా స్వామిని అర్చించడం.

బాహ్యపూజలో ఒక్కొక్క ఉపచారానికి మంత్రయుక్తంగా ఆయా వస్తువులను భగవంతునికి సమర్పిస్తారు.

పంచోపచారాలు[2] : గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యాలు లేదా ధ్యాన, ఆవాహన, నైవేద్య, నీరాజన, నమస్కారాలు.

షోడశోపచారాలు[3] : ఆవాహనం, ఆసనం, పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం, స్నానం, వస్త్రం, యజ్ఞోపవీతం, గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం, ప్రదక్షిణం, నమస్కారం.

ధర్మ సింధువు ఆధారంగా 'సంక్షేపంగా దేవపూజా విధి'

**శ్లో॥ "స్నానే వస్త్రేచ నైవేద్యే దద్యాదాచమనం తథా।**
**దత్వా షోడశభీ ఋగ్భిః షోడశాన్న స్వసాహుతీః।**
**సూక్తేన ప్రత్యృచం పుష్పం దత్వా సూక్తేన సంస్తుయాత్॥**

సహస్రశీర్షేతి – షోడశర్చస్య సూక్తస్య నారాయణః పురుషో నుష్టుప్, అంత్యా త్రిష్టుప్, న్యాసే పూజాయాంచ వినియోగః"[4]

'ఒక్కొక్క ఉపచారానికి ఒక్కొక్క ఋక్ (ఋచ)ను పఠిస్తూ షోడశోపచారపూజ నిర్వహించ వచ్చును. సహస్ర శీర్షేతి మొదటి ఋక్ – ఆసనం సమర్పణతో ప్రారంభించి 'వేదాహమేతం' అనే పదహారవ ఋక్ నమస్కారంతో పదహారు ఉపచారాలు చేసి,

మంత్రపుష్పం, ఉద్వాసనలను నిర్వహించి, పురుషసూక్త విధానంతో స్వామికి సంక్షేప పూజను ఈవిధంగా నిర్వహించవచ్చునని ధర్మసింధువు చెబుతుంది.

చతుష్షష్టి ఉపచారాలు[5] : విశేషపూజలో ఈ ఉపచారాలు జాగరణం, మణిమయమందిరం, మణిమయ మంటపం, శిబిక, రత్నసింహాసనం, హేమపాద పీఠం, ఉల్లాభం, పాద్యం, అర్ఘ్యం, ఆచమనం, మధుపర్కం, తైలాలేపనం, ఉద్వర్తనం, ఉష్ణోదక స్నానం, పంచామృతస్నానం, పునరుష్ణోదక స్నానం, తీర్థోదకస్నానం, సకంచుక ప్రావరణ పరిధాన వసనం, హేమపాదుకలు, కేశపాశ బంధనం, సౌవీరాంజనం, ఆభరణాలు, తిలాంకాంగరాగ చందనాది సుగంధ ద్రవ్యాలు, సుగంధ చంపక తైలపటవా సాదికం, అక్షతలు, సింధూరం, పుష్పాలు, ధూపం, ఆజ్యదీప నీరాజనం, రత్నదీపం, కుంభారార్తికం, నైవేద్యం, హస్తప్రక్షాళనం, హస్తసముద్వర్తనం, పానీయం, ఫలనివేదన, తాంబూలం, దక్షిణ, ఛత్రం, చామరం, మణిమయ ముకురం, సహస్రదీప నీరాజనం, చతురంగ సైన్యం, దుర్గం, వ్యజనవీజనం, నాట్యం, డమర్వాది వాద్యాలు, గంధర్వ కన్యాగానం, నృత్యవాదిత్రగీతాలు, అశక్తత్వభ్యాపనం, భక్తగృహనివాసం, పాదపీఠం, పర్యంకం, పాదలాక్షారాజం, సుఖశయనం, ధ్యానం, అపరాధ క్షమాపణం, హృదయ నివాస ప్రార్థనం.

ఈవిధంగా వివిధ ఉపచారాలతో పూజించడం మన సంప్రదాయం. షోడశోపచార పూజ ప్రస్తుతం చాలా ప్రాచుర్యంలో ఉంది. ప్రతి ఉపచారానికి వేదోక్తంగాకాని, పురాణోక్తంగాకాని పూజను నిర్వహిస్తారు.

ప్రతి చరణంలో ఒక ఉపచారం వచ్చేటట్లుగా గానానుకూలంగా 'పూజపాట'ను శర్మగారు రచించారు.

శ్రీ పాండురంగాశ్రమం నుండి బాలభక్తి అనే గ్రంథం 1935లో వెలువడింది. దానిని విశ్వనాథశర్మగారి తండ్రి నారాయణబాబాగారు (భావానందస్వామి) రచించారు. దానిలో శ్రీరామునికి నిర్వహించే షోడశోపచార పూజలోని ప్రతి ఉపచారానికి ఒక కీర్తన రచించారు. తండ్రిలాగా తాను కూడా షోడశోపచారపూజను గేయంగా రచించాలని సంకల్పించి శర్మగారు ఈ "పూజపాట"ను రచించారు.

ఈపాట పిన్నలు, పెద్దలు (స్త్రీలు, పురుషులు) ఎవ్వరైనా రాగయుక్తంగా, భక్తితో పాడడానికి వీలుగా ఉంది. ఈప్రాంతంలో ఈ పాట పండిత పామర జనరంజకమై అలరారింది.

ఈ 'పూజపాట'ను సంపూర్ణంగా పరిశీలించినట్లయితే, పూజకు మంత్రాలు, వస్తువులకంటే భక్తిభావన ముఖ్యమనే విషయం ద్యోతకమవుతుంది.

**ప॥ "మా పూజగొనుమో ప్రభూ - దయజేసి**

**అ.ప॥ ఓ పాండురంగా - సకలోపచారాలతో**

**శ్రీ పాండురంగా - ప్రేమోపచారాలతో"[6]**

అంటూ స్వామిని దయతో, ప్రేమతో పూజను స్వీకరించమని ఆర్ద్రతతో అర్థించారు.

**ఎ). రూప సాక్షాత్కారం 'ధ్యానం'**

**చ॥ "శ్రీ రుక్మిణీనాథ। దరహాసమున రాధ**
**దరిజేరి - వెలుగొంద పరమానందముజింద**
**మురలీమోహన - పింఛధర - కృష్ణ గోవింద**
**మరువక నిన్నే మా మదిలో ధ్యానింతుము"[7] ॥మా॥**

రుక్మిణీనాథుడు, రాధామాధవుడు అని పాండురంగమూర్తికి, కృష్ణునికి అభేదం పాటించారు. ఆ మూర్తిని పై పాటలో ధ్యానించారు.

సంప్రదాయ పూజలలో ఏ సాకారమూర్తిని ఆరాధిస్తున్నామో, ఆ మూర్తి గుణగణాదులను కీర్తిస్తాం. ఇక్కడ మొదటి చరణంలో కవి ధ్యానం చేశారు. ఈ ధ్యానం షోడశోపచారపూజకు 'నాంది' లాంటిది. షోడశోపచార పూజలో మొదటిది ఆవాహనమే అయినా ఏ దేవుని పూజిస్తు న్నామో ఆదేవుని రూపాన్ని మనసులో నిలుపుకోవడానికి ధ్యానం చేసి పూజను ప్రారంభించడం ఆనవాయితి.

## 1. ఆనందపీఠంపై 'ఆవాహనం'

పురుషాకారంలో దేవునిపూజిస్తే పురుష సూక్తంతోను, స్త్రీరూపంలో పూజిస్తే శ్రీసూక్తంతోను పూజించడం వేదోక్త విధానం. పురాణోక్త పూజలో ఆయా ఉపచారానికి తగిన శ్లోకాన్ని పఠిస్తూ పూజను నిర్వహిస్తారు.

వేదోక్త, పురాణోక్త సంబంధమైన మంత్రాలను, శ్లోకాలనిచ్చి శర్మగారి 'పూజపాట' ఎంత శాస్త్రీయమైందో విశదమవుతుందనే ఉద్దేశంతో ఈ విధానాన్ని పాటిస్తున్నారు.

**వేదోక్తం : "సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్**
**సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్"[8]**

**పురాణోక్తం : "జ్యోతిశ్శాంతం సర్వలోకాంతరస్థ మోంకారాఖ్యం యోగి హృద్ధ్యానగమ్యం।**

**సాంగం శక్తిం సాయుధం భక్తిసేవ్యం సర్వాకారం విష్ణుమావాహయామి॥"[9]**

(అన్ని లోకాలలో ఉన్నవానిని, యోగుల మదిలో ధ్యానంవల్ల లభించేవానిని ఉపాయం, శక్తి, ఆయుధం కలిగి భక్తిచే సేవింపదగిన అన్ని రూపాలు తానై విశ్వమంతా వ్యాపించిన శాంతమూర్తిని, జ్యోతిర్మయుని ఆవాహనం చేస్తున్నాను.)

**చ॥ "ఏ కారణములేక - లోకాలనేలుదువు**
**ఆకారరహితా - బ్రహ్మాకారపరమాత్మ**
**ఆకారమున నిన్ను - ఆనందపీఠాన**
**ఆవాహనము సేతు మయ్యా మక్కువదీర" ॥మా॥[10]**

విష్ణువు స్థితి కారకుడు. ఆయన నిర్హేతుకంగా, నిర్వ్యాజంగా లోకాలను పాలిస్తాడు. అలాంటి భగవంతుడు ఆకారరహితుడు. నిరాకారుని సాకారునిగా ఆహ్వానించారు. ఆయనను ఆవాహనం చేసింది "ఆనందపీఠం"పై "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్"[11] ఆనందం పరమాత్మ రూపం. పరమాత్మను పరమాత్మ రూపంలోనే ఆకారాన్ని కల్పించి ఆవాహనం చేయడం కవి ప్రతిభను చాటుతుంది.

సత్+చిత్ స్వరూపుడైన నిర్గుణబ్రహ్మను, సగుణ బ్రహ్మగా ఆనందపీఠంపై ఆవాహనం చేయడంలో అలౌకిక స్వామికి లౌకికజీవి లౌకిక పూజనందించడం కనిపిస్తుంది.

## 2. హృదయ సింహాసనమే 'ఆసనం'

**వేదోక్తం : "ఓం పురుష ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యం**
**ఉతామృతత్వస్యేశానః, యదన్నేనాతిరోహతి॥"[12]**

**పురాణోక్తం : "కల్పద్రుమూలే మణివేది మధ్యే సింహాసనం స్వర్ణమయం విచిత్రం**
**విచిత్ర వస్త్రావృతమచ్యుత ప్రభో గృహాణ లక్ష్మీధరణీ సమన్వితః॥"[13]**

(శ్రీదేవి, భూదేవి సహితుడైన ఓ అచ్యుత ప్రభూ! కల్పవృక్షం కింద బంగారు రత్నమయ మణులతో తాపిన, వేదిక నడుమ వింతగా ఉన్న వస్త్రాలచే ఆవరింపబడిన రత్నసింహాసనాన్ని స్వీకరించుము ప్రభూ!)

**చ॥ "సిరిగల్గు దొరవీవు - నిరుపేదలము మేము**
**సరియైన పీఠమ్ము - సమకూర్చితేలేము**
**హరిప్రేమ తిలకించి - ఆసీనుడవుగమ్ము**
**అర్పింతుమయ్యా - సింహాసనముగ హృదయము"[14] ॥మా॥**

ఈ ప్రకృతంతా భగవంతుని 'సిరి' అంతా నీదే కాబట్టి మేం నిరుపేదలం. అంతా నీదైన లోకంలో నీకు అర్పించడానికి 'నాది' అనే పీఠం (వస్తువు) ఎక్కడ దొరుకుతుంది? నా హృదయంలో నీపై ప్రేమ ఉంది. ఆప్రేమ నిండిన నా హృదయాన్ని మాత్రమే నీకు సింహాసనంగా సమర్పించ గలను. ఆ 'హరిప్రేమ' (హరిభక్తి)ని చూసైనా, నా హృదయాన్ని ఆసనంగా స్వీకరించమన్నారు కవి. భక్త హృదయమే భగవంతునికి ఆసనం కదా! ఆయన అక్కడే తిష్ఠవేసుకుని ఉంటాడు. ఇది ఆధ్యాత్మిక సత్యం. పురాణోక్త శ్లోకంలో రత్న సింహాసనాన్ని భక్తుడు సమర్పించాడు. పూజపాటలో హృదయ సింహాసనాన్ని సమర్పించారుకవి. పూజ పాట సహజంగాను, భక్తిభావ భరితంగాను, ఆడంబర రహితంగాను కనిపిస్తూ విశిష్టంగా ఉంది.

## 3. పరమాత్మ పాదపద్మాలకు 'పాద్యం'

**వేదోక్తం : "ఏతావానస్య మహిమా అతోజ్యాయాగ్శ్చ పూరుషః**
**పాదోస్య విశ్వాభూతాని, త్రిపాదస్యా మృతం దివి"[15]**

**పురాణోక్తం : "నారాయణ నమస్తేస్తు నరకార్ణవ తారక**
**పాద్యం గృహాణ దేవేశ మమ సౌఖ్యం వివర్ధయ॥"[16]**

(నరక సముద్రాన్ని తరింపజేసే ఓ నారాయణ! పాద్యాన్ని స్వీకరించి, మా సుఖాన్ని పెంపొందించే దేవేశ నీకు నమస్కారం)

**చ॥ "పరిశుద్ధమగు చంద్ర - భాగోదకముదెచ్చి**
**మెరుగైన నవదూర్వాం కుర మంజరుల జేర్చి**
**పరమాత్మ నీ పాద పద్మాలు భక్తితో**
**ప్రక్షాళనము జేసి - పాద్య మర్పించెదము"[17]**

భగవంతుని పాద ప్రక్షాళనం కోసం సమర్పించే నీటిని 'పాద్యం' అంటారు. ప్రవహించే నది నీరు భగవంతునికి పాద్యంగా ఇవ్వడం శ్రేష్ఠం. అందుకే 'చంద్రభాగ'నది నీటిని తెచ్చి, (ఆయన పాదాలు పద్మాలలాంటివి. ఏ పళ్ళెంలోనే,

పీటపైనో పెడితే కందిపోతాయని భక్తుని (కవిగారి) భావన. అందుకే) “నవ దూర్వాంకుర మంజరుల”ను (లేత గరిక మొలకల గుత్తులను) చేర్చి వాటిపై స్వామి పాదాలుంచి పాద్యం సమర్పించారు. ఎంత సుకుమార భావన? ఎంతటి భక్తి భావం? ఎంతటి ఆదరం? బ్రహ్మ కడిగిన పాదాలకు పాద్యం ఇవ్వడంలో కవిచూపిన నైపుణ్యం విశిష్టమైనది.

## 4. ధర్మమోక్షదాయకం అర్ఘ్యం

**వేదోక్తం : “త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోస్యేహా భవాత్పునః**
**తతో విష్వఙ్వ్యక్రామత్ సాశనానశనే అభి॥”[18]**

**పురాణోక్తం : “వ్యక్తా వ్యక్త స్వరూపాయ హృషీకపతయేనమః**
**మయా నివేదితో భక్త్యా హ్యర్ఘ్యోయం ప్రతి గృహ్యతాం॥”[19]**

(వ్యక్తావ్యక్త రూపం కలిగి, ఇంద్రియాలకు అధిపతియైన నీకు నమస్కారం. నాచే నీవు అర్ఘ్యాన్ని స్వీకరించుము స్వామి)

**చ॥ “మురళీవాదనమందు - పరికింప కనువిందు**
**వరదాన గుణమందు - సరిలేరు జగమందు**
**మరిపించుతనువే - మా పరమైన క్షణమందు**
**కరనీరజాలు - అర్ఘ్యమునంద - మునుముందు”[20] ॥ము॥**

భగవంతుని హస్తాలు ప్రక్షాళనం చేయడానికి సమర్పించే జలం అర్ఘ్యం. విష్ణువు చతుర్భుజుడు. ఇది లౌకిక పూజ కాబట్టి కవి స్వామిని ద్విభుజునిగానే చిత్రించారు. (స్వామిని ద్విభుజునిగా చిత్రించినట్లు స్పష్టంగా కనబడుతున్నందువల్ల ద్విభుజునిగా చిత్రించినట్లు వ్యాఖ్యానించవలసి వచ్చింది.) స్వామి నాలుగు చేతులు ధర్మ, అర్థ, కామ, మోక్షాలనిచ్చేవి. కవికి అర్థ కామాలపై దృష్టి లేదు. అందుకే ధర్మాన్ని, మోక్షాన్ని ప్రసాదించే ద్విభుజాలకు (హస్తయోః అర్ఘ్యం సమర్పయామి) అర్ఘ్యం సమర్పించారు.

వాటిలో మొదటిహస్తం మురళీగానంతో ‘కనువిందు’ చేస్తుందన్నారు. ‘కను’ అనే మాటకు ఇక్కడ ‘చర్మచక్షువు’ అని అర్థం. ‘జ్ఞాననేత్రం’ అని అర్థం. లేకపోతే మురళీవాదనం ‘కనువిందు చేయడం అసాధ్యం. అది ‘వీనులవిందు’చేస్తుంది. జ్ఞాన నేత్రానికి విందు చేయడమంటే జ్ఞానాన్ని కలిగిస్తుంది. మోక్షాన్ని ప్రసాదిస్తుందని అర్థం. భగవంతుడు జ్ఞానస్వరూపుడు. ఆ ‘ఆత్మ’ జ్ఞానమే మోక్షం. ఒక హస్తం ఇలా మోక్షాన్ని ప్రసాదిస్తుంది.

మరోహస్తం 'వరదానం'చేస్తుంది. అంటే వరాలిస్తుందని ఒక అర్థం. 'వర' అంటే శ్రేష్ఠమైన అనే అర్థం గ్రహిస్తే 'శ్రేష్ఠమైనదాన' 'గుణాన్నిస్తుందని అర్థం. ధర్మాచరణలో 'దానం' ఒకటి. ఇది శ్రేష్ఠమైనది. భగవంతుని 'వరదాన' గుణానికి ఎవరు సాటిరాగలరు? అందువల్ల రెండోహస్తం పరంపరగా 'ధర్మ' గుణాన్ని ప్రసాదిస్తుంది. అందుకే కవి ధర్మ, మోక్షాలకోసం స్వామికి 'అర్ఘ్యం' సమర్పించారని చెప్పవచ్చు.

భగవంతుని 'తనువు' ఆనందస్వరూపం. అది అందరినీ మైమరపిస్తుంది. అలాంటి తనువులోని భాగాలైన హస్తాలూ ఆనంద స్వరూపాలే. వాటికి భక్తకవి శర్మగారు 'మునుముందు' అంటే 'మొదట స్వామి ఎదుట' కూర్చొని (అభిముఖంగా కూర్చొని) అర్ఘ్యం సమర్పించారు.

సాహిత్యం ఆలోచనామృతం. శర్మగారు నిక్కమైన భక్తకవి. ఆలోచించిన కొలది ఆయన కవిత్వంలో అద్భుతాలైన అర్థాలు, అంతరార్థాలు, విశేషార్థాలు దర్శనమిస్తాయి.

### 5. త్రిగుణాతీతునికి త్రికరణశుద్ధిగా (త్రిః) 'ఆచమనం'

**వేదోక్తం :** **"తస్మాద్విరాడజాయత - విరాజో అధి పూరుషః**
**స జాతో అత్యరిచ్యత, పశ్చాద్భూమి మథోపురః"[21]**

**పురాణోక్తం : "మందాకి న్యాస్తు యద్వారి సర్వపాప హరం శుభం**
**తదిదం కల్పితం దేవ సమ్యగాచమ్యతాం విభో॥"[22]**

(అన్ని దోషాలను తొలగించే గంగాజలం, శుభకరమైంది. ఆ నీటిని చక్కగా ఆచమనం చేయుము ప్రభూ)

**చ॥ "నెమ్మి తురాయి కురుల - నీటుగ కదలాడ**
**తమ్మి యందము మించు - తావక ముఖమందు**
**కమ్మని హరిగంగ - కరతలమున నింతు**
**ముమ్మారు - ఆచమనమును జేసి ప్రేమతో ॥మా॥"[23]**

పూజ ప్రారంభంలో కర్త ఆచమనం చేయడం. అదికూడా మూడుమార్లు ఆచమనం చేయడం సంప్రదాయసిద్ధం. మనం 'ఆచమనం' చేయడం త్రికరణశుద్ధికోసం మనస్సు. వాక్కు, శరీరాలను శుచిగా చేసుకోవడమే త్రికరణ శుద్ధి. ఇక్కడ భక్తుడు భగవంతునికి ఆచమనం సమర్పిస్తున్నాడు. భగవంతుడు సృష్టి, స్థితి, లయ కారకుడు.

ఆమూడు క్రియలు, ఆ క్రియలకు ఆధారమైన త్రిమూర్తులు స్ఫురించే విధంగా 'త్రిరాచమనం' చేయించడం ఒక దృష్టి. భగవంతుడు త్రిగుణా తీతుడు (సత్త్వ,రజ, తమో) అని స్ఫురింపజేయడం మరో దృష్టి. త్రివిధ జపాలను (వాచకం, ఉపాంశువు, మానసికం) కూడా ఈ 'ఆచమన' త్రయం స్ఫురింపజేస్తుంది. ప్రధానంగా భగవంతుని కర్పించే ఆచమనంలో త్రివిధ పరమేశ్వర లక్షణాలు (సత్తు, చిత్తు, ఆనందం) ధ్వనిస్తాయి. భక్తుడు సమర్పించే ఆచమనం కాబట్టి త్రివిధ భక్తులు బాహ్యం (పరోక్షజ్ఞానం), అనన్యం (అపరోక్షజ్ఞానం), ఏకాంతం (నిశ్చయ జ్ఞానం వల్ల కలిగే నిత్యానందానికి కారణం) ఈ ఆచమనంలో ప్రతిఫలిస్తాయి. ఇంకా సామాన్య భక్త మానవుడర్పించే 'ఆచమనం' త్రివిధవాసనలు (లోక, శాస్త్ర, దేహవాసనలు) తొలగాలనే సాధనగా కనిపిస్తుంది. విరాగి అర్పించే 'ఆచమనం'లో త్రివిధ ముక్తులు (కర్మముక్తి, జీవన్ముక్తి, విదేహముక్తి) కావాలనే కాంక్ష కనిపిస్తుంది. వాటితోపాటు త్రివిధ విరక్తులు (ఐహికం, ఆముష్మికం, మిశ్రమం) కూడా కనిపిస్తాయి. అంతేకాక భగవంతుని కర్పించే ఆచమనంలో ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులూ దర్శనమిస్తాయి. ఇలా ఎన్ని రకాలుగానైనా ఈ 'త్రిరాచమ'నాన్ని సమన్వయించవచ్చు. 'తమ్మి' (తామర) ప్రకృతికి ప్రతీక. ప్రకృతిని మించిన సౌందర్యం పరమాత్మునిది. అలాంటి స్వామికి 'హరిగంగ' (విష్ణుపాదోద్భవి)ను కరతలంలో నిలిపి, ముమ్మారు ఆచమనం చేయించడం పరమభక్తాగ్రేసరునికే సాధ్యమవుతుంది.

## 6. ఆయా పదార్థాల అభిషేకమే 'స్నానం'

**వేదోక్తం :** **"యత్పురుషేణ హ విషా। దేవా యజ్ఞ మతన్వత**
**వసంతో అస్యాఽసీదాజ్యమ్ గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః॥"**[24]

ఈ ఉపచారంలో పంచామృతస్నానం, ఫలోదకస్నానం, శుద్ధోదకస్నానం అనే మూడు విధాలున్నాయి.

**పంచామృత స్నానం :** పాలు, పెరుగు, నెయ్యి, తేనె, శర్కర ఈ ఐదు పంచామృతాలు. ఈ ఐదింటికి ఐదు వేదమంత్రాలున్నాయి.

**క్షీరం (పాలు) :** "ఆప్యాయస్వస మేతుతే విశ్వతస్సోమ వృష్ణియమ్।
భవావాజస్య సంగథే॥

**దధి (పెరుగు) :** దధిక్రావుణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః।
సురభినో ముఖాకరత్ప్రణ ఆయుగ్ం షితారిషత్॥

**ఆజ్యం (నెయ్యి) :** శుక్రమసి జ్యోతిరసి తేజోసి దివోవస్సవితోత్పునా।
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో స్సూర్యస్యరశ్మిభిః।

**మధు (తేనె) :** మధువాతా ఋతాయతే మధుక్షరన్తి సింధవః మాధ్వీర్నస్సన్త్వో
షధీః
మధునక్త ముతోషసి మధు మత్పార్థివగ్ం రజః మధు
ద్యౌరస్తునః పితా।
మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో
భవంతునః॥

**శర్కర :** స్వాదుః పవస్వదివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ
సుహవీతునామ్నే।
స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే
బృహస్పతయే మధుమాం అదాభ్యః॥[25]

**పురాణోక్తం : స్నానం పంచామృతైర్దేవ। గృహాణ పురుషోత్తమ।**
**అనాథ నాథ సర్వజ్ఞ। గీర్వాణ ప్రణతి ప్రియ॥[26]**

(దేవతల నమస్కారంపై ప్రేమకలిగి అనాథులకు ఏలికవై అన్నీ తెలిసిన పురుషోత్తమా! పంచామృత స్నానం గైకొమ్ము.)

**చ॥ "సంచిత పుణ్యాలు - సార్థకమును జెంద**
**పంచోపచారాల - పరిచర్య సేయుదుము**
**పంచాస్య పీఠాన - వేంచేసి - దయతోడ**
**పంచామృత స్నాన - మాచరించుము - తండ్రి"[27] ॥మా॥**

పంచామృతాలు శరీరానికి పుష్టిని, సౌష్ఠవాన్ని, సౌందర్యాన్ని కలిగిస్తాయి. ఇలాంటి పంచామృతా భిషేకాన్ని సింహాసనంపై కూర్చోబెట్టి, సంచిత పుణ్యాలు (కూడబెట్టిన పుణ్యం) సార్థకం చెందేటట్లు, పంచోపచారాలతో (గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యం) సేవజేసి, అభిషేకిస్తాను. స్వీకరించుమని శర్మగారు త్రికరణ శుద్ధితో ప్రార్థించారు.

**ఫలోదకస్నానం :** "యాః ఫలినీర్యాఅ ఫలాఅ పుష్పా యాశ్చపుష్పిణీః।
బృహస్పతి ప్రసూతాస్తానో ముంచన్త్వగ్ం హసః॥"[28]

**శుద్ధోదక స్నానం :** "ఓం ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జేదధాతన
మహేరణాయ చక్షుషే। యోవశ్శివ తమోరసః। తస్య భాజ
యతే హనః ఉశతీరివ మాతరః। తస్మాదరంగ మామవో
యస్య క్షయా యజిన్వథ ఆపోజనయథాజనః॥"[29]

**పురాణోక్తం :** "నదీనాంచైవ సర్వాసాం। మయానీతం జలం శుభం
అనేన స్నాన మంత్రేణ। మంత్రైర్వారుణ సంభవైః॥"[30]

(వరుణాను వాకాలచే అన్ని నదులనుండి తేబడిన శుభకరమైన నీటిని గొనుము ప్రభూ)

**చ॥ "ఘనహేమకలశాల - గంగోదకము దెచ్చి**
**పునుగు - జవ్వాజి - కర్పూరాదులను జేర్చి**
**మనసార నమకాది మంత్రాలు పఠియించి**
**ఆనందముగ నిన్ను - అభిషేకింతుము స్వామి"[31] ॥మా॥**

బంగారు కలశాలతో పవిత్రమైన గంగనీరు దెచ్చి, దానిలో సుగంధద్రవ్యాలు చేర్చి నమకాది మంత్రాలు చదివి అభిషేకించేస్తానన్నారు శర్మగారు. (ఇక్కడ పవిత్రమైన గంగనీరు - పవిత్రమైన మనసైతే, అందులోని సుగంధద్రవ్యాలు భక్తి, శ్రద్ధ, ఆత్మనివేదనం, ఇవన్నీ కలిపి స్వామికి వినిపించేటట్లు మంత్రాలు చదివి ఆనందంగా అభిషేకిస్తాను అని అంతరార్థం గోచరమవుతుంది.)

పునుగు, జవ్వాజి, కర్పూరం శరీరానికి సువాసనను, తేజస్సును, పుష్టిని కలిగిస్తాయి. ఇది రాజసమైన స్నానం.

'నమకమ్' శివునికి అభిషేకం చేసే సమయంలో చదివే మంత్రం ఇక్కడ కృష్ణునికి చేసే పూజలో ఈ మంత్రంతో అభిషేకిస్తాననడంలో శర్మగారి హరిహరాద్వైతం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

## 7. అలంకారార్థం - 'వస్త్రం'

**వేదోక్తం : "సప్తాస్యా సన్పరిధయః త్రిస్సప్తసమిధః కృతాః,**
**దేవాయదృజ్ఞం తన్వానాః, అబధ్నన్పురుషం పశుమ్॥"[32]**

**పురాణోక్తం : "వేదసూక్త సమాయుక్తే యజ్ఞసామ సమన్వితే**
**సర్వవర్ణ ప్రదేదేవ వాససీ తే వినిర్మితే॥"[33]**

(వేదసూక్తాలతో కూడి యజ్ఞంలోని సామవేద సూక్తాలచే ఒప్పి, అన్ని రంగులచే అందమైన రెండు వస్త్రాలు (కట్టుపంచె, కప్పుపంచె) గైకొమ్ము ప్రభూ)

**చ॥ "చనువున – దరిజేరి – కనులార – తిలకించి**
**తనువెల్ల తడియొత్తి తగ ముంగురులు దువ్వి**
**వినయాన నునుమేన – విరి తైలమును రాచి**
**కనకాంబరాలిత్తు – కట్టుకో – నా స్వామి – మా॥"[34]**

శర్మగారు ఒక్కసారిగా యశోదాదేవి పాత్రలో లీనమయ్యారు. యశోద కృష్ణుని అలంకరించిన విధాన్ని గుర్తుజేసుకుని, ఆవిధంగా చేయాలని ఆ మూర్తిని బాలకృష్ణునిగా భావంలో నిలుపు కొన్నారు. ఇది వాత్సల్యభక్తి.

అలంకరించేవేళ చనువుతో అలంకరించడం మాతృమూర్తివల్లే అవుతుంది. కనులార చూసుకుని, శరీరానికి తడిలేకుండా తుడిచి, ముంగురులు సరిజేసి, మృదువైన శరీరానికి పుష్పతైలాన్ని రాసి, పీతాంబరాలు ఇస్తాను కట్టుకో స్వామి అన్నారు శర్మగారు. 'విరితైలం' శరీర పరిమళం కోసం. విష్ణువు పీతాంబరధారి కాబట్టి ఆయనకు కవి కనకాంబరాలు ఔచిత్య వంతంగా ఉంది.

**8. బ్రహ్మత్వ సిద్ధికోసం 'బ్రహ్మసూత్రం' (యజ్ఞోపవీతం)**

**వేదోక్తం : "తం యజ్ఞం బర్ హిషి ప్రౌక్షన్న్, పురుషం జాతమగ్రతః**
**తేనదేవా అయజంత, సాధ్యా ఋషయశ్చయే"[35]**

**పురాణోక్తం : "బ్రహ్మ విష్ణు మహేశానాం నిర్మితం బ్రహ్మ సూత్రకం**
**గృహాణ భగవన్ విష్ణో సర్వేష్ట ఫలదోభవ॥"[36]**

(ముమ్మూర్తులచే నిర్మింపబడిన, బ్రహ్మసూత్రం అనే యజ్ఞోపవీతాన్ని స్వీకరించి, అన్ని కోరికలను తీర్చేవాడవు కమ్ము)

**చ॥ "బ్రహ్మను గన్నయ్య। బ్రహ్మమె నీవయ్య।**
**బ్రహ్మ భావమునందు – భాసిలమముజేసి।**
**బ్రహ్మత్వ సిద్ధికై – బ్రహ్మరూపమ్మైన।**
**బ్రహ్మసూత్రము – సగుణ బ్రహ్మమా – ధరియించు – మా॥"[37]**

బ్రహ్మకు తండ్రి, బ్రహ్మమెస్వామి, బ్రహ్మ భావంలో మమ్ము భాసిల్లజేసి, బ్రహ్మత్వ

సిద్ధికోసం, బ్రహ్మరూపమైన, బ్రహ్మసూత్రాన్ని (యజ్ఞోపవీతాన్ని) సగుణబ్రహ్మమైన నీవు స్వీకరించమని కోరారు.

బ్రహ్మోపదేశం ద్వారా వేదాధ్యయనాధికార అర్హతను, బ్రహ్మత్వసిద్ధి కోసం యజ్ఞోపవీతధారణ చేస్తారు.

బ్రహ్మను కన్నతండ్రికి, బ్రహ్మసూత్రం ఇవ్వవలసి వచ్చినపుడు 'సగుణ బ్రహ్మమా స్వీకరించ మ'నడంలో నిర్గుణ బ్రహ్మకు ఈ భౌతికమైన అర్చనావిధానం ఉండదని సగుణోపాసన నుండి నిర్గుణోపాసన దాకా ఎదిగి జీవుడు ముక్తినొందాలనే భావాన్ని దీనిలో ధ్వనింపచేశారు.

## 9. స్వామి అలంకార ప్రీతికి 'శ్రీ చందనం'

**వేదోక్తం : "తస్మాద్య జ్ఞాత్సర్వ హుతః, సంభృతం వృషదాజ్యమ్**
**పశూగ్ స్తాగ్శ్చక్రే వాయవ్యాన్। ఆరణ్యాన్ గ్రామ్యాశ్చయే॥"[38]**

**పురాణోక్తం : "శ్రీఖండం చందనం దివ్యం గంధాఢ్యం సుమనోరం।**
**విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం॥"[39]**

(దేవలోకానికి సంబంధించిన చందన వృక్షపు గంధాలను నీప్రీతికై గొనుము ప్రభూ)

**చ॥ "కమనీయ శ్రీ చందనము - ఫాలమున దీర్చి**
**కస్తూరి తిలకమ్ము -కడువేడ్కతో దిద్ది**
**ఘుమ ఘుమ లాడ - కుంకుమబొట్టు - సవరించి**
**కమలాక్షముల చుట్టు - కాటుక నర్పింతు... మా॥"[40]**

శ్రీచందనం ఫాలంపై అద్ది, కస్తూరి తిలకాన్ని ఎంతో ప్రేమగా దిద్ది, మేనంతా సువాసన వెదజల్లుతుండగా, కుంకుమబొట్టు పెట్టి, నయనాల చుట్టు కాటుకపెట్టి స్వామి అందాన్ని మరింత ఇనుమడింపజేశారు శర్మగారు. ఆ అలంకరణలో వాత్సల్యభక్తి గోచరమవుతుంది.

స్వామికి కుబ్జ చందనం ఇచ్చినందుకు ఆమె కురూపం తొలగించి, ఆమెను సౌందర్యవతిగా చేసిన కథ భాగవతంలో కనిపిస్తుంది. ప్రసిద్ధ నారసింహక్షేత్రం సింహాచలంలో చందనంతో స్వామిని సేవిస్తారు. ఈఘట్టాలు స్వామికి చందనంపైగల

ప్రీతిని వ్యక్తపరుస్తున్నాయి. పైపాటలో ఒక చందనమే కాక కస్తూరి, కుంకుమ, కాటుక మొదలైన వాటి అలంకరణవల్ల స్వామిని అలంకరించి, 'విష్ణువు యొక్క అలంకార ప్రీతి'ని కవి తృప్తిపరచారు.

## 10. ఆకర్షణ, అనుగ్రహాల కోసం 'పుష్పం'

**వేదోక్తం : "తస్మాద్యజ్ఞా త్సర్వహుతః – ఋచ స్సామాని జజ్ఞిరే।**
**ఛన్దాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ – యజుస్తస్మాద జాయత॥"[41]**

**పురాణోక్తం : "మల్లికాది సుగంధీని మాలత్యా దీనివై ప్రభో**
**మయాహృతాని పూజార్థం పుష్పాణి ప్రతి గృహ్యతాం॥"[42]**

(నీపూజకై సువాసనగల జాజిపూలు, మల్లెపూలు మొదలైన పుష్పాలు తెచ్చాను స్వీకరించు ప్రభూ!)

**చ॥ "మేలైన తులసీదళాలతో దివ్యవన**
**మాల – నీగళమందు కేలనర్పణజేసి**
**చాల ప్రేమతో జెప్పి సాహస్ర నామాలు**
**పూలతో పదనీర జాల పూజింతుము ॥మా॥"[43]**

మంచి తులసీదళాలతో దివ్యమైన వనమాలను స్వామికంఠంలో అలంకరించి, సహస్ర నామాలు చెపుతూ పూలతో పదనీరజాలను (పాదపద్మాలను) ప్రేమగా ఆరాధిస్తాం అన్నారు శర్మగారు.

వనమాలను ఇష్టంగా ధరించడం వల్ల ఆయన వనమాలి అయ్యాడు.

తులసీదళ నిర్మితమైన వనమాలను ఆయన గళంలో అలంకరించడం, సహస్ర నామాలతో పాద పూజ చేయడం అనే రెండంశాలు పూజపాటలో మనకు కనిపిస్తున్నాయి. వనమాల అంటే ఆకులు, పువ్వులు కూర్చి కట్టినమాల. ఆకులలో ఏఆకులైనా చేర్చవచ్చు (దవనం మొ॥). కాని కవి తులసీదళాలతో కూర్చిన వనమాలను స్వామికి సమర్పించారు. తులసిని లక్ష్మి అవతారంగా భక్తులు పూజిస్తారు. తులసి తులలేని భక్తికి చిహ్నం. (శ్రీకృష్ణతులాభారంలో రుక్మిణి తులసీదళాన్ని త్రాసులో ఉంచడం, స్వామి దానితో తూగడం తెలిసిందేకదా!) తులసిని విష్ణువు హృదయంపై నిలిచేటట్లుగా వనమాలగా చేసి సమర్పించారు. సహస్రనామాలతో పాదపూజ చేయడం వల్ల అనేక నామరూపాలలో స్వామిని మనోనేత్రంద్వారా దర్శించడం

కనిపిస్తుంది. వనమాలను అర్పించడం ద్వారా స్వామి హృదయాన్ని ఆకర్షించడం పాదపూజద్వారా ఆయన అనుగ్రహాన్ని పొందడం అనే ఫలాలు భక్తునికి లభిస్తాయి.

## 11. ఇంద్రియ తర్పణకు 'ధూపం'

**వేదోక్తం :** **"తస్మాదశ్వా అజాయన్త - యేకోచో భయాదతః।**
**గావోహ జజ్ఞిరే తస్మాత్ - తస్మాజ్జాతా అజావయః॥"[44]**

**పురాణోక్తం :** **"దశాంగం గుగ్గులూపేతం సుగంధం సుమనోహరం।**
**ధూపం గృహాణ దేవేశ సర్వదేవ నమస్కృత॥"[45]**

(సర్వ దేవతలచే నమస్కరింపబడే స్వామీ! మంచి వాసన కలిగి, దశ విధాలైన గుగ్గిలంతో కూడిన ధూపాన్ని గైకొమ్ము)

**చ॥ "గోపీ జనావాసా। గోవింద। సర్వేశ।**
**చూపింతు। సాంబ్రాణి - ధూప మాఘ్రాణించు"[46]**

సాంబ్రాణి ధూపాన్ని ఆఘ్రాణించమని కోరారు కవి. ధూపం అంటే వాసనగల పొగ (శ.ర.) అని అర్థం. సువాసనతో కూడిన పొగను స్వామిచే ఆఘ్రాణింపచేయడం వల్ల ఇంద్రియ తర్పణం జరుగుతుంది. దీనిద్వారా స్వామి ఆనందిస్తాడు. ఇంద్రియ తర్పణం అనే మానవభావాన్ని భగవంతునిలో దర్శించడం కనబడుతుంది.

## 12. జ్ఞాన స్వరూప దర్శనం కోసం 'దీపం'

**వేదోక్తం :** **"యత్పురుషం వ్యదదుః కతిధా వ్యకల్పయన్**
**ముఖం కి మస్య కౌ బాహూ - కావూరూ పాదావుచ్యేతే॥"**

**పురాణోక్తం :** **"ఘృతాక్తవర్తిసంయుక్తం। వహ్నినా యోజితం ప్రియం।**
**దీపం గృహాణదేవేశ। త్రైలోక్య తిమిరాపహ॥"[48]**

(ముల్లోకాల చీకట్లు తొలగించే దేవేశా। నేతితో తడపబడిన వత్తితోగూడి, అగ్నిచే కూర్చబడిన ప్రియమైన దీపాన్ని గ్రహించు)

**"నీ పాదములముందు -దీపాలు వెలిగింతు**
**గోపాల - కరుణించి - కొనుమయ్య - దీవించి"[49]**

భగవంతుడు అనంత కాంతిమంతుడు. ఆయనను చర్మ చక్షువులతో దర్శించ లేము. దీపం ఆయన కాంతిని ప్రతిఫలిస్తుంది. (దీపంజ్యోతి పరబ్రహ్మ) దీపాలను

ఆయన పాదాలముందు వెలిగించడంవల్ల స్వామి పాదదర్శనం లభిస్తుంది. తద్వారా మనలో జ్ఞానంకలిగి, పరమాత్మ దర్శన లాలస పొందుతుంది. జ్ఞాన స్వరూపియైన భగవంతుని దర్శించడానికి వెలిగించే దీపమేఇది.

## 13. భగవన్నివేదనమే 'నైవేద్యం'

**వేదోక్తం :** **"బ్రాహ్మణో స్యముఖమాసీత్ - బాహూరాజన్యః కృతః।**
**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥"[50]**

**పురాణోక్తం : "రాజాన్నం సూప సంయుక్తం। శాకచోష్య సమన్వితం।**
**ఘృతభక్ష్య సమాయుక్తం। నైవేద్యం ప్రతి గృహ్యతాం॥"[51]**

(పప్పు, శాకం, పులుసు, నెయ్యి, భక్ష్యాలతో కూడిన రాజులు భుజింపదగిన అన్నాన్ని నైవేద్యంగా స్వీకరించు)

**చ॥ "పాలు - మీగడ - వెన్న పక్వాన్నమధురాలు**
**శాల్యన్నపేయాలు - చవులూరు - శాకాలు**
**చాలుగ పచ్చళ్ళు - పలుఫలహారాలు**
**చనువున వడ్డింతు మనసార భుజియించు."[52]**

పాలు, మీగడ - వెన్న - మధురపదార్థాలు, వరి అన్నం, నోరూరించే శాకాలు, పచ్చళ్ళు అనేక రకాలను ఫలాహారాలు ప్రేమతో వడ్డిస్తాను. తృప్తిగా భుజించమని ప్రార్థించారు.

ఆహారపదార్థాలను గాయత్రి మంత్రంచే ప్రోక్షణచేసి, స్వామికి నివేదించి అది ప్రసాదంగా స్వీకరించటం మన సంప్రదాయం.

నివేదింపదగినది నైవేద్యం. నివేదనం అంటే సమర్పణం అని, ఎఱుక (తెలియపరచడం, జ్ఞానం) అని అర్థం. ఈ చరాచర సృష్టిలోని పదార్థాలన్నీ భగవంతునివే. ఆయన సృష్టించిన వాటిపైన ఆధారపడే ఎనభైనాలుగు లక్షల జీవరాసులు జీవిస్తున్నాయి. మానవుడు ఆలోచన, వాక్కుగల జీవి. అందుకే తాను అనుభవించే పదార్థాలన్నీ భగవంతునివే అనే జ్ఞానం కలిగి ఉండాలి. మన జఠరాగ్నికి ఆహుతులుగా సమర్పించే పదార్థాలు (భక్ష్య భోజాద్యులు) అన్నీ భగవంతునివే. అందువల్ల ఆ విషయాన్ని స్వామికి ముందుగా నివేదించి (తెలిపి) తర్వాత మనం గ్రహించాలి. అలా భగవంతునికి తెలియపరచడం, సమర్పించడమే నైవేద్యం. మానవుడు

ఇష్టంగా భుజించే పదార్థాలన్నీ 'పాట'లో చేర్చి భగవంతునికి నైవేద్యం పెట్టడం వల్ల మానవుని ఆనందానికి కారణం భగవంతుడే అని ధ్వనింపజేశారు కవి.

## 14. వాసనారాహిత్యం కోసం 'తాంబూలం'

**వేదోక్తం :** **"చన్ద్రమా మనసోజాతః - చక్షో స్సూర్యో అజాయత।**
**ముఖాదిన్ద్రశ్చాగ్నిశ్చ - ప్రాణా ద్వాయురజాయత॥"[53]**

**పురాణోక్తం : "పూగీఫలైస్స కర్పూరై ర్నాగవల్లీదళైర్యుతం**
**ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతామ్॥"[54]**

(ముత్యపుపొడి, కర్పూరం, వక్క, తమలపాకులతో కూడిన తాంబూలం స్వీకరించు ప్రభూ)

ఒకే చరణంలో హస్తపాద ప్రక్షాళనం, పానీయం తాంబూలం సమర్పించారు.

**చ॥ "కరపాదములు గడిగి - కమ్మని - జలమిచ్చి**
**కర్పూర విడియమ్ము - అర్పింతు కరమందు**
**కానుక లిడలేను - మానసమును గొమ్ము**
**కమలాక్షములజార - కరుణాసముద్రాలు"[55]**

భోజనానంతరం స్వామి కాళ్ళు చేతులు కడిగి, కర్పూరాది సుగంధి ద్రవ్యాలుంచిన తాంబూలం అర్పించారు. కానుకలు పెద్దగా సమర్పించలేను. నా మనసునే కానుకగా స్వీకరించు. సముద్ర మంత కరుణను నీ నయనాలలో కురిపించమని వేడుకున్నారు.

కర్పూర మిశ్రిత తాంబూలాన్ని స్వామి కర్పించడంలో సుగంధ భరితమైన వస్తువులర్పించడాన్ని ధ్వనింపజేశారు కవి. వాసనలన్నీ భగవంతునికర్పిస్తే మనలో 'వాసనా' రూపంలో ఉన్న కర్మఫలాలు నశిస్తాయనే విశ్వాసంకవిలో ఉంది. అందువల్ల ఆయన మనస్సునే స్వామికి కానుకగా సమర్పించారు. స్వామి కరుణకోసం తపించారు.

## 15. త్రిగుణాతీతత్వ సాధన కోసం 'ప్రదక్షిణం'

**వేదోక్తం :** **"నాభ్యా ఆసీ దన్తరిక్షమ్ - శీర్ష్ణోద్యౌ స్సమవర్తత।**
**పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్ - తథా లోకాగ్ం అకల్పయన్॥"[56]**

**పురాణోక్తం : "యానికానిచ పాపాని। జన్మాంతర కృతానిచ।**
**తానితాని ప్రణశ్యంతి। ప్రదక్షిణ పదే పదే॥**

**పాపోऽహం పాపకర్మాహం। పాపాత్మా పాపసంభవః।**
**త్రాహిమాం కృపయాదేవ। శరణాగతవత్సల॥**
**అన్యథా శరణం నాస్తి। త్వమేవ శరణం మమ।**
**తస్మాత్ కారుణ్య భావేన। రక్ష రక్ష జనార్దన॥"[57]**

(ప్రతి ప్రదక్షిణకు పలు జన్మలలో చేసిన పాపాలు అన్నీ నశిస్తాయి. పాపాలను చేసిన పాపాత్ముడును, పాపాల పుట్టను, శరణుపొందిన వారిని చేరదీసే స్వామీ కృపతో నన్ను రక్షించు. నాకు వేరొక దారిలేదు. నీవు నాకు దిక్కు జనార్దన రక్షించు.)

**చ॥ "కమ్మగ హరినామ - గానసుధన్ గ్రోలి**
**కనులార - శ్రీపాద కమలాలు దర్శించి**
**ముమ్మారు నీచుట్టు - ముమ్మరముగ దిరిగి॥"[58]**

దేవతాదులను ఉద్దేశించి కుడికి తిరిగి రావడాన్ని ప్రదక్షిణం అంటారు. దీన్నే 'వలగొనడం' అనవచ్చు.

స్వామికి ప్రదక్షిణం చేసేటప్పుడు పరధ్యానం లేకుండా ఉండడం కోసం స్వామిపై మనసు నిలిపి ప్రదక్షిణించాలి. హరినామ స్మరణ జేస్తూ, భగవంతుని పాదాలపై దృష్టి నిలిపి, మూడుసార్లు ప్రదక్షిణం చేసినట్లుగా వర్ణించారు కవి. భక్తుడు ఒక్కొక్క ప్రదక్షిణంలో ఒక్కొక్క గుణాన్ని (మొదటి ప్రదక్షిణలో తమోగుణం, రెండోదానిలో రజోగుణం, మూడోదానిలో సత్త్వగుణం) వదలి పెడుతూ త్రిగుణాతీతునిలో లగ్నం కావడంకోసం తాను త్రిగుణాతీతుడు కావాలని బోధిస్తుంది ప్రదక్షిణం.

## 16. స్వీయ సమర్పణం 'నమస్కారం'

**వేదోక్తం : "వేదాహ మేతమ్ పురుషం మహాన్తమ్ - ఆదిత్యవర్ణం తమసస్తుపారే।**
**సర్వాణి రూపాణి విచిత్య ధీరః - నామాని కృత్వా-భివదన్ యదాస్తే॥"[59]**

**పురాణోక్తం : "ఉరసా శిరసాదృష్ట్యా, మనసా వచసా తథా**
**పద్భ్యాంకరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే॥"[60]**

**చ॥ "సమ్ముదమున జేతు - సాష్టాంగ వందనము"[61]**

నమస్కారం అంటే చేమోడ్పు. చేతులు జోడించి మనసావాచా కర్మణా తనను తాను భగవంతు నికి సమర్పించుకోవడమే నమస్కారం. నమస్కారం నిల్చొనికాని,

కూర్చొనికాని చేస్తారు. సర్వాంగములతో నమస్కారం చేయడాన్ని సాష్టాంగ నమస్కారం అంటారు. దీనిలో భౌతిక సమర్పణం భాసిస్తుంది. వక్షస్థలంచే, శిరస్సుచే, దృష్టిచే, మనస్సుచే, వాక్కుచే, చేతులచే, చెవులచే నమస్కరించడం అంటే ఏకాదశేంద్రియాల ఉన్మాదాన్ని పరిమార్చి, వాటిని స్వామివైపు మళ్ళించడం సాష్టాంగ నమస్కారం యొక్క ఉద్దేశం. భూమిపై బోర్లాపడుకొని చేతులు జోడించి స్వామికి భక్తుడు తనను తాను సమర్పించుకోవడం ఈసాష్టాంగ నమస్కారంలో మనంచూడవచ్చు.

ఇలా ధ్యానంతో స్వామి రూపాన్ని మనసులో నిలుపుకోవడంతోభక్తుడు సాధన ప్రారంభించి, స్వామిని ఆవాహనం చేసి, ఆయనకు ఆసనం సమర్పించి, అర్ఘ్యపాద్యాలిచ్చి, ఆచమనీయం చేయించి, అభిషేకం (స్నానం) నిర్వహించి, వస్త్రయజ్ఞోపవీతాలను సమర్పించి, గంధపుష్పాలచే అలంకరించి, ధూప మాఘ్రాణింపజేసి, దీప సహాయంతో స్వామిపాదాలు దర్శించి, నివేదనంచేసి, తాంబూలమర్పించి, ప్రదక్షిణ నమస్కారాలతో భక్తుడు గుణాతీతుడై త్రిగుణాతీతునికి తనను తాను సమర్పించుకోవడం ఈ షోడశోపచార పూజలోని పరమార్థం.

పైన వివరించిన షోడశోపచారాలు శ.ర. ఆధారంగా చెప్పినవి. స్వామి ఉపచారాలతో ఇంకా కొన్నిటిని శర్మగారు తమపాటలో పొందుపరచారు.

మధుపర్కం, అక్షతలు, ఆభరణాలు, నీరాజనం, మంత్రపుష్పం అనే వాటిలో అక్షతలు, నీరాజనం, మంత్రపుష్పాలు చాలా ప్రాచుర్యంలో ఉన్నాయి. వాటిని పరిశీలిద్దాం.

### అ). లౌకిక మాధుర్యం 'మధుపర్కం'

మధుపర్కం అంటే పెరుగుతో కలిసిన తేనె లేదా పెళ్ళిలో వధూవరులకిచ్చే వస్త్రం. ఇక్కడ మాత్రం తేనె కలిసిన పెరుగని అర్థం. ఈ ఉపచారం షోడశోపచారాల్లో లేదు. ఇది లౌక్యోపచారం. స్వామి అభిషేకానికి ముందు అలసిపోకుండా ఉండడానికి "మధుపర్కాన్ని" ఆరగించమన్నారు కవి.

**చ॥ "ఆలయమున నీకు - అభిషేక మొనరింప**
**పిలిచిరి -బంగారు పీఠమ్ముపై జేర**
**ఆలస్యమగునేమొ? అలసి పోదువు స్వామి**
**హాయిగా మధుపర్క మారగించుము వేగ॥మా॥"[62]**

(మధుపర్కోపచారాన్ని చేర్చికవి లౌకిక మాధుర్యాన్ని లోకుల కందించారు)

### ఆ). ఆనందదాయకాలు 'అక్షతలు'

**పురాణోక్తం :** **"అక్షతాన్ ధవళాకారాన్ శాలీయాన్ తండులాన్ శుభాన్।**
**అక్షతాన్ మే మయాదేవ।ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్॥"[63]**

(నాశం పొందనివి, తెల్లనివి, శుభకరం, వరికి సంబంధించినవి అయిన అక్షతలు నీప్రీతికై స్వీకరించు ప్రభూ)

**చ॥ "దీక్షతో జగమెల్ల –రక్షించు దొరవైన**
**పక్షివాహన భక్త పక్షపాతివి దేవ**
**అక్షయ సుఖమిమ్ము – అఖిలోపచారాల**
**అక్షతలర్పింతు మయ్యా యేమనుకోకు ॥మా॥"[64]**

దీక్షబూని విశ్వాన్ని రక్షిస్తున్నావు. భక్త పక్షపాతివి కాబట్టి ఆ భక్తినే ఆధారంగా తీసుకొన్న నేను సమస్త ఉపచారాల పేరిట అక్షతలు సమర్పిస్తున్నాను. నాకు అక్షయసుఖాన్ని (మోక్షం) ఇవ్వమని ప్రార్థించారు శర్మగారు.

బీజం నాటి వృక్షం కాక్షించడం లోకసంప్రదాయం. ఇక్కడ శర్మగారు భక్తి బీజం నాటి కల్పతరువులాంటి మోక్షంను కోరుకున్నాడు. నిత్యపూజా విధానంలో ఏ వస్తువైనా సమయానికి లేకుంటే దానికి ప్రత్యామ్నాయంగా అక్షతలు సమర్పించడం పరిపాటి. (వస్త్రార్థే అక్షతాన్, యజ్ఞోపవీతార్థే అక్షతాన్) క్షతము (నాశం) లేనివి అక్షతలు. ఇవి భక్తునికి గాని బాధ కలిగించవు పైగా ఉపచారానికి తోడ్పడి ఆనందదాయకాలవుతాయి.

**ఇ). అలంకార ప్రియునికి 'ఆభరణాలు'**

**పురాణోక్తం :** **"హిరణ్యహార కేయూర। గ్రైవేయ మణికంకణైః।**
**సుహారం భూషణైర్యుక్తం। గృహాణ పురుషోత్తమ॥"[65]**

(ఓ పురుషోత్తమా। కిరీటాలు, హారాలు, భుజకీర్తులు, కంఠాభరణాలు, మణులతో ఉన్న కంకణాలు మొదలగు భూషణాలతో అందమైన హారాన్ని చేకొనుము ప్రభూ!)

**చ. "బంగారు మొలనూలు – బర్హి పింఛపుదండ**
**చెంగు చెంగున మ్రోగు – సిరి సిరి మువ్వలు**
**రంగైన కడియాలు – రతనాల హారాలు**
**సింగారింతుము నీకు – చిన్మయాభరణాలు"[66]**

మొలనూలు, నెమలిపింఛం, దండ, మువ్వలు, హారాలు మొదలగు ఆభరణాలు స్వామికి సమర్పిస్తున్నాను. అంటూనే "చిన్మయా" నీకు ఆభరణాలు అన్నారు శర్మగారు. 'చిన్మయుడు' అనగా అఖండ జ్ఞాన స్వరూపమైన పరబ్రహ్మ అని అర్థం. విశ్వవ్యాపకుడైన స్వామికి ఆభరణాలు అందించడం సాధ్యంకాదు. 'అజ్ఞానంతో వున్న మేము కర్మలు ఆచరిస్తున్నామని అనుకుంటావేమో' కాదు జ్ఞానస్వరూపుడైన నిన్ను భక్తి భావంతో ఆభరణాలు సమర్పించడం తథ్యమనే దృఢవిశ్వాసంతో, అంతరంగంతో 'చిన్మయ' పదప్రయోగం శర్మగారు ఈసందర్భంలో ప్రయోగించారు.

**ఈ). సంగీత సాహిత్య ఆరాధనం 'నీరాజనం'**

**పురాణోక్తం :** **"నీరాజనం గృహాణేదం పంచవర్తి సమన్వితం**
**తేజోరాశిమయా దత్తం గృహాణత్వం సురేశ్వర॥"[67]**

(ఓ సురేశ్వరా! ఐదు వత్తులతో గూడి కాంతివంతంగా హారతినిస్తున్నాను గైకొమ్ము ప్రభూ)

కర్పూర హారతితోపాటు అనేకరకాలైన హారతులను ఇస్తూ, చక్కని రాగాలతో పాటలు పాడుతూ, నృత్యం చేస్తారు. శర్మగారు నీరాజనసేవలో భాగంగా దాదాపు 100కుపైగా మంగళారతులు రచించారు. ఈ చరణంలో స్వామిని ప్రేమగా తన నీరాజనం స్వీకరించమని కోరుకున్నారు.

**చ॥ "కూరిమి నిను గోర - కోరిక నెరవేర**
**భారము నీదేర - పరదేవతా రార**
**సారె సారెకు ప్రేమ - సంగీత మొప్పార**
**నీరాజనముతోడ - ఆరాధింతుము దేవ॥కూ॥"[68]**

సారె సారెకు - మాటిమాటికి ప్రేమ సంగీతం ఉప్పొంగ నీరాజనం ఇస్తూ ఆరాధిస్తానని వేడు కున్నారు. కవి సంగీత, సాహిత్యాలు తెలియటంవల్ల ఆరెండింటిని తన భక్తితో రంగరించి స్వామికి సమర్పించారు. 'భారం నీదే స్వామి' అంటూ (అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ) శరణుకోరారు. ఘంటానాదం చేస్తూ నీరాజన మంత్రంగాని, శ్లోకంగాని, పాటనుగాని పాడడం ఈ ఉపచారంలో ఉంటుంది. అంటే సాహిత్యానికి తోడు సంగీతాన్ని కూర్చడమన్నమాట. ఇలా సంగీత సాహిత్యాలతో ఆరాధించడమే నీరాజనోపచారం యొక్క పరమార్థం.

**ఉ). వరాల వర్షం 'మంత్రపుష్పం'**

**చ॥ "ఓం ధాతా పురస్తాద్యముదాజహార। శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః।
తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పన్థా అయనాయ విద్యతే॥"[69]**

**పురాణోక్తం : "యజ్ఞేశాచ్యుత గోవింద। మాధవానంతకేశవ।
కృష్ణ విష్ణో హృషీకేశ। వాసుదేవ నమోస్తుతే॥"[70]**

(యజ్ఞేశ, అచ్యుత, గోవింద, మాధవ, అనంత, కేశవ, కృష్ణ, విష్ణో, హృషీకేశ, వాసుదేవ నీకు నా నమస్కారం)

**చ॥ "సరగున రావయ్యా। మొరవిని కృష్ణయ్య
సరసకు వేంచేసి – వరముల నిడుమయ్య
మరువకుమా? నన్ను చరణాల కర్పింతు
మురళీధరా మంత్ర పుష్పాంజలిని – స్వామి"[71]**

కృష్ణయ్యా! మా మొరవిని, తొందరగా వచ్చి, మేమిచ్చే మంత్రపుష్పాలనుస్వీకరించి వరాలిమ్మని కోరారు కవి.

మంత్రయుక్త పుష్పాలను స్వామి పాదాలకు సమర్పించడం మంత్రపుష్పం. వరాల కోసం మంత్రపుష్పం సమర్పించడం అనే భావం కనిపిస్తున్నా, కవి కోరే వరం కేవలం కైవల్యం. అదే తురీయ పురుషార్థం. మోక్షం. శర్మగారు శారీరకంగా ఆశ్రమంద్వారా ప్రజాసేవ చేస్తున్నారు. మానసికంగా భగవన్నామ స్మరణం చేస్తూ, ఆధ్యాత్మికంగా ఆపరాత్పరుని చేరడానికి సాధన సాగించారు. అందువల్ల ఇహపర సాధకమైన వరాలిమ్మని భగవంతుని కోరారు. ఆ వరాల వర్షాన్ని భగవంతుడు మంత్రపుష్పాలను స్వీకరించి తప్పకుండా కురిపిస్తాడని కవి విశ్వాసం.

**ఊ). పరోపకారార్థం 'ఫలశ్రుతి'**

**చ॥ "వినుమయ్య గోవింద – విశ్వేశకృతపూజ
విని సంతసము నొంది – మనసార దీవించు
దినదినమీ పూజలను సల్పువారికి
కలుగగ సౌఖ్యాలు తొలగగ పాపాలు॥ ॥మా॥"[72]**

ఈ పూజపాట చదివేవారి పాపాలు తొలగించమని, సౌఖ్యాలు కలిగించమని వేడుకున్నారు. ఇదిచక్కటి ఫలశ్రుతి, మంగళాశాసనం, మంగళాంతం.

అన్నమాచార్యుల వారు చెప్పినట్లుగా "షోడశ కళానిధికి షోడశోపచారములు"[73] శర్మగారు సమర్పించారు.

ఈ పూజ సంప్రదాయం నాటినుండి నేటివరకు సాగివస్తూంది. అందరి గమ్యం మోక్షమే. పూజ సాధనం, మోక్షం సాధ్యం. "పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః[74] 'మానవుడు తన తనువును, మనమును, ధనమును భగవానుని పూజా సామగ్రిగా భావించి అత్యంత శ్రద్ధాపూర్వకంగా యథావిధిగా ఆ సామగ్రులతో భగవానుని ప్రతిమనుగాని, విశ్వరూప పరమాత్మనుగాని పూజిస్తూ ఉండాలి. ఎప్పుడు మనస్సు భగవానుని పూజలో సంలగ్నమవుతుందో అప్పుడు అది తనంతతానే బంధనకారకులైన లౌకిక విషయాల నుండి తొలగిపోతుంది. భగవానుని పూజను కాయికంగాను, మానసికంగాను చేయాలి. ఆ క్రియవల్ల భగవానునికి పరమపదం ప్రాప్తిస్తుంది'. అని పై నారద భక్తి సూత్రం వివరిస్తూంది. ఆపరమ పదమే పూజవల్ల లభించే సుఖం ఆ సుఖం ఈపూజపాటను చదివేవారికి కూడా కలగాలని కవికాంక్ష. ఇది పరోపకారార్థం చెప్పిన ఫలశ్రుతి.

**జ్ఞాపికలు**

1. శబ్దరత్నాకరము : సీతారామాచార్యులు, బహుజనపల్లి పుట - 52
2. శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు : ప్రచురణ - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అయిదవ సంపుటము పుట - 17
3. శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు : ప్రచురణ - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఎనిమిదవ సంపుటము పుట - 84
4. ధర్మసింధువు : శ్రీ కామశాస్త్రి, కొల్లూరి పుట - 441
5. శ్రీ దేవీనవరాత్ర పూజాకల్పము : సంకలనం : రాజేశ్వర శర్మ, పార్నంది - పీఠిక పుట - 13

6,7. మంగళ మంజరి - విశ్వనాథశర్మ, అప్పాల పుట - 2

8. మహాన్యాసాది : సంకలనం - రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట - 33
9. శ్రీ సత్యనారాయణవ్రతకల్పము : పండిత పరిష్కృతము పుట - 28
10. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట - 2
11. ఉపనిషద్దర్శనము : శ్రీనాథ వేంకటసోమయాజులు, నోరి (మొదటి భాగము), తైత్తిరీయోపనిషత్, భృగువల్లి, అనువాకం-6 పుట 59
12. మహాన్యాసాది : సంకలనం - రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట 33
13. పూజాహోమకల్పతరువు: సంకలనం - విష్ణుసేవానన్ద బ్రహ్మచారి పుట 11

14. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుటలు 2,3
15. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 33
16. శ్రీ సత్యనారాయణవ్రతకల్పము : పండిత పరిష్కృతము పుట – 29
17. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 3
18. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 33
19. శ్రీ సత్యనారాయణవ్రతకల్పము : పండిత పరిష్కృతము పుట – 29
20. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 3
21. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 33
22. శ్రీ సత్యనారాయణవ్రతకల్పము : పండిత పరిష్కృతము పుట – 29
23. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 3
24. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 33
25. పూజాహోమకల్పతరువు : సంకలనం – విష్ణుసేవానన్ద, బ్రహ్మచారి పుట – 14
26. శ్రీ సత్యనారాయణవ్రతకల్పము : పండిత పరిష్కృతము పుట – 30
27. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 4
28, 29. పూజాహోమకల్పతరువు : సంకలనం – విష్ణుసేవానన్ద, బ్రహ్మచారి పుట – 14
30. శ్రీ సత్యనారాయణవ్రతకల్పము : పండిత పరిష్కృతము పుట – 30
31. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 4
32. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 33
33. శ్రీ సత్యనారాయణవ్రతకల్పము : పండిత పరిష్కృతము పుట – 31
34. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 4
35. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 33
36. పూజాహోమకల్పతరువు : సంకలనం – విష్ణుసేవానన్ద, బ్రహ్మచారి పుట – 15
37. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 5
38. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 34
39. పూజాహోమకల్పతరువు : సంకలనం – విష్ణుసేవానన్ద, బ్రహ్మచారి పుట – 15
40. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 5
41. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 34
42. పూజాహోమకల్పతరువు : సంకలనం – విష్ణుసేవానన్ద, బ్రహ్మచారి పుట – 19
43. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 5
44. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 34
45. పూజాహోమకల్పతరువు : సంకలనం – విష్ణుసేవానన్ద, బ్రహ్మచారి పుట – 19
46. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట – 6
47. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట – 34
48. శ్రీ హరిహరసేవాలహరి : సంకలనం –

సీతారామ సిద్ధాంతి, గౌరీభట్ల - రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల పుట - 119

49. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట - 6
50. మహాన్యాసాది : సంకలనం - రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట - 34
51. శ్రీ హరిహరసేవాలహరి : సంకలనం - సీతారామ సిద్ధాంతి, గౌరీభట్ల - రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల పుట - 119
52. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట - 6
53. మహాన్యాసాది : సంకలనం - రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట - 34
54. శ్రీ హరిహరసేవాలహరి : సంకలనం - సీతారామ సిద్ధాంతి, గౌరీభట్ల, - రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల పుట - 120
55. మంగళ మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట - 6
56. మహాన్యాసాది : సంకలనం - రామానుజ జ్యౌతిషిక, గోమఠం పుట - 34
57. పూజా హోమ కల్పతరువు : సంకలనం - విష్ణుసేవానన్ద, బ్రహ్మచారి, పుట - 25
58. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. పుట - 7
59. మహాన్యాసాది : సంకలనం - రామానుజ జ్యౌతిషిక, పుట - 34
60. పూజాహోమ కల్పతరువు : సంకలనం - విష్ణుసేవానన్ద, బ్రహ్మచారి, పుట - 44
61. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. పుట - 7
62. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. పుట - 3
63. శ్రీహరిహర సేవాలహరి : సంకలనం – సీతారామ సిద్ధాంతి, గౌరీభట్ల, రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల, పుట–116
64. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. పుట - 5
65. శ్రీ హరిహరసేవాలహరి : సంకలనం – సీతారామసిద్ధాంతి, గౌరీభట్ల, రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల, పుట–116
66. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. పుట - 5
67. శ్రీ హరిహరసేవాలహరి : సంకలనం – సీతారామసిద్ధాంతి, గౌరీభట్ల, రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల, పుట–120
68. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. పుటలు - 6, 7
69. మహాన్యాసాది : సంకలనం - రామానుజజ్యౌతిషిక, పుట - 34
70. శ్రీ హరిహరసేవాలహరి : సంకలనం – సీతారామసిద్ధాంతి, గౌరీభట్ల, రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల, పుట–120

71&72. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల. పుట - 7

73. అన్నమాచార్య కీర్తనలు : సంకలనం - ప్రసన్న, తెన్నేటి, పుట–139
74. నారదభక్తి సూత్రములు : హిందీమూలము, హనుమాన్ ప్రసాద్, పోద్దార్ ఆంధ్రానువాదము : ఉదయభాస్కర్, బులుసు, సూ–16, పుట - 46

# 10. మేలుకొలుపు, లాలి, జోలపాటలు - విషయాను శీలనం

విశ్వనాథశర్మగారు మంగళహారతులే కాక ఒక మేలుకొలుపు, ఒక లాలిపాట, ఒక జోలపాటను కూడా రచించారు.

శర్మగారు సుప్రభాతాలు రచించారు. మేలుకొలుపులూ రచించారు. సుప్రభాత రచనా విధానం సంస్కృత సంప్రదాయాన్ననుసరించిందైతే, మేలుకొలుపులు దేశీయ సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకొన్నట్టిది.

"భక్తి గేయములందు మరియొక శాఖ మేలుకొలుపు పాటలు స్త్రీలు పురుషులు తమ తమ దైవతములను ప్రాతఃకాలముననే లేచి మేలుకొలుపులు పాడుచు ధ్యానించుచు తమ తమ పనులు నెరవేర్చుకొందురు. గుడిగోపురములందు ప్రభాతసేవలో నీ మేలుకొలుపులు పాడెడు అలవాటుగలదు. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న ప్రభాతపదములు మేల్కొలుపులైయుండునని తలంపు వచ్చును. 'మేలుకో'యని చివరన నుండు మాటవలననివి మేలు కొలుపులైనవి. వీనినే భూపాలములందురు కూడ."[1]

## 1. జీవుల రక్షణకు పిలుపు "మేలుకొలుపు"

రేగుప్తిరాగంలో మేలుకొలుపు పాటను రచించారు.

**ప॥ శ్రీనివాస - ముకుంద - మురళీగానలోల - భవాబ్ధితారక**
**దీనబంధో - దివ్యవైభవ - మాననీయహరే - కృష్ణా - మేలుకో"[2]**

అంటూ ప్రారంభించి,

**చ॥ సొమ్మసిల్లిన జీవకోటుల - గ్రమ్ముకొన్నది - చిమ్మచీకటి**
**మిమ్ముదలచిన విచ్చుచున్నది - మేలుకొనవయ్యా కృష్ణా ॥శ్రీ॥**

జీవకోటి అజ్ఞానంలో ఉండి, అలసి, సొలసి పోతుంది. మేలుకొని తేజోవంతం, జ్ఞానవంతం చేయమని వేడుకున్నారు. జీవులను ఉద్ధరించాలంటే భగవంతునివల్లే అవుతుంది. అందువల్ల కవి ఆయనను మేల్కొల్పుతున్నాడు.

**చ॥ అంతరంగ విలాసములలో - ఆరితేరి సుఖింతు వెల్లపు**
**డాంతరంగిక దాసదాసుల - నాదు కొనుమయ్యా కృష్ణా ॥శ్రీ॥**

అంతరంగ విలాసం అంటే మానసిక క్రీడ. దానిలో ఉండి ఎల్లప్పుడు ఆనందిస్తూ

ఉంటావు. అలా అంతరంగ విలాసాన్ని నెరపే నీవు నీ ఆంతరంగిక దాసులమైన మమ్ములను ఆదుకొమ్మని వేడుకున్నారు కవి.

**చ॥ మల్లెతావుల తోడచల్లని - పిల్లగాడుపులుల్ల సిల్లుచు**
**ఎల్లెడల నీ తేజమగుపడ - కొల్లగొనునయ్యా కృష్ణా ॥శ్రీ॥**

సువాసనలు గల పిల్లగాలులతో కలిసి అంతటా వున్న నీ తేజస్సును దోచుకుంటాయేమొ స్వామి! మేలుకో అని ప్రార్థించారు.

**చ॥ జాలికల్గిన ఏలికవు నీ - పాలబడి మను జీవజాలము**
**మేలమాడక జోలివీడక యేలుకొనుమయ్యా కృష్ణా ॥శ్రీ॥**

కరుణాసాగరుడైన ప్రభువు స్వామి. నీ యేలికలో ప్రాణికోటి బ్రతుకుతుంది. కావున పరిహాసం చేయక, బంధాన్ని వదలక యేలుకోమని వేడుకున్నారు.

**చ॥ పాండురంగాశ్రమ నిశాంతము - భక్త హృదయతమో నిశాంతము**
**మెండుకొనగా నిండుకొలువున - మేలుకొనుమయ్యా కృష్ణా ॥శ్రీ॥**

పాండురంగాశ్రమంలోని వేకువ భక్త హృదయాలలోని తమస్సును తొలగించే వేకువై అతిశయించేటట్లుగా మేలుకొమ్మని ప్రార్థించారు.

భగవంతుడు సుషుప్త్యవస్థలో ఉన్నట్లుగా భావించి కవి ఆయనను మేలుకొల్పులు పాడడం సహజం. ఆయన నిద్రలో మునిగితే లోకం అంధకారంలో మునుగుతుంది. జీవులు అజ్ఞానాంధ కారంలో కొట్టుమిట్టాడుతాయి. ఇలా అజ్ఞానాంధకారంలో మునిగి ఉన్న జీవుల అజ్ఞానాన్ని తొలగించడానికి స్వామిని మేలుకొల్పడం శర్మగారి 'మేలుకొలుపు' పాటలోని సారం. మీ స్మరణ చేతనే జీవులను కమ్ముకున్న చిమ్మచీకటి వీడిపోతుందని, నీ తేజో రూపాన్ని దర్శింపజేసి మమ్ములను (మానవులను) ఆదుకొమ్మని, నీవు కరుణామయుడవు కాబట్టి, స్థితి కారకుడవు కాబట్టి మమ్ములను రక్షించమని ప్రార్థించారు. నీవు మేలుకుంటే తప్ప లోకాలు మనజాలవని, మా అజ్ఞానాంధకారాన్ని తొలగించడానికి తప్పకుండా మేలుకోవాలని కవి భగవంతుని అర్థించాడు. అలా ఈ 'మేలుకొలుపు' జీవుల రక్షణకోసం కవి స్వామిని పిలిచే పిలుపులా భాసిస్తుంది.

## 2. భక్తజనతాపహారి "లాలిపాట"

శిశువును ఊయలలో పడుకోబెట్టి ఊయలనూపుతూ పాడేపాట లాలిపాట.

స్వామికి చేసే పరిచర్యలలో ఇది "ఊయలసేవ" కాఫిరాగం అటతాళంలో రచించిన శర్మగారి లాలిపాటను పరిశీలిద్దాం.

**ప॥ "లాలి వనమాలీ! మదాళీ విలోలాలక ॥లా॥**

**అ॥ లీలా కలితాజాండ - సమాలోకన ఖేలా! జయ ॥లా॥**

**చ॥ చిన్ని కొడుకన్నా ప్రియ - మెన్నుకొని నిన్నెప్పు**
**చెన్నార యశోదా - గనుగొన్న పున్నె మెన్నందగు ॥లా॥**

**2. బూటకపు బూచియని - బోటులను మాటమది**
**నాటెనని యాటాడవో - మాటాడవో దీటుగను ॥లా॥**

**3. పలుకులను దివ్యామృత - మొలుకురా చిలుకనుడి**
**కులికెదవో తలకెదవో - కలకమెయి పులకరించు ॥లా॥**

**4. వాదా? నిద్రరాదాయన - మోదమ్మున నల్దిక్కుల**
**బోదారుడు రాధాయిదె - నీదాపున రాధాప్రియ ॥లా॥**

**5. శ్రీపాండురంగాశ్రమ - శ్రీపాద సుఖాపాదక**
**తపాపహ। మా పాలిటి - గోపాలక। గోపీ ప్రియ"[3] ॥లా॥**

భగవంతుడు తన లీలలో భాగంగా బ్రహ్మాండాన్ని సృష్టించాడు. తాను సృష్టించిన అజాండాన్ని తానే లీలగా దర్శిస్తూ ఉన్నాడు. శిశువుగా ఊయలలో ఉన్న స్వామికి లాలిపాడుతున్నారు కవి. 'ఓ కన్నయ్యా! స్త్రీలు ఒక బూటకపు బూచిని చూపి బెదిరించడం వల్ల ఆమాట మనసులో నాటుకొని ఆటలు, మాటలు మానేశావా? నీవు చిలుక పలుకులు పలికితే వాటినుండి దివ్యామృతం ఒలుకుతుంది. 'ఓ రాధాప్రియ! నీకు నిద్ర రావడంలేదా? పాండురంగాశ్రమంలో నీపాదం మోపడంవల్ల సుఖాన్ని కలిగించే వాడా! మా తాపాన్ని పోగొట్టేవాడా! ఓ గోపీప్రియ! నీకు లాలి!' అంటూ స్వామికి లాలిపాట పాడడంలో భగవత్ స్పృహను కవి కోల్పోలేదు.

భక్తజన తాపహారిగా, సుఖదాతగా భగవంతుని భావించి కవి ఈ లాలిపాటను రచించారు.

## 3. ఆనందదాయిని "జోలపాట"

శిశువును నిద్రపుచ్చడానికి తల్లిగాని, ఇతర పెద్దలుగాని పాడేపాట జోలపాట,

భగవంతుని శిశువుగా భావించి జోలపాడితే అది పవళింపు సేవ. శ్రీరాగంలో జోలపాటను రచించి స్వామికి పవళింపు సేవచేశారు కవి.

**"జోజో దయాపాంగ - జో పాండురంగా**
**జోజో జితానంగ - సుమకోమలాంగా"[4]    ॥జో జో॥**

కరుణాదృష్టి గలిగిన పాండురంగా, మన్మథుని జయించినవాడా, పుష్పం లాంటి కోమలమైన అంగాలు కలవాడా పడుకొమ్మని స్వామిని వేడుకున్నారు.

స్వామి సగుణ చిత్రణం

**చ॥ పదినూర్ల పడగల - పాప నీసెజ్జ**
**పద్మావతీ దేవి - పాదముల పజ్జ**
**సదసచ్చరాచర - జగము నీ బొజ్జ**
**నొదిగి యిందుండుమా? యొజ్జలకు నొజ్జ    ॥జో జో॥**

పదివేల పడగల శేషుడు నీకు తల్పమని, పద్మావతీ దేవి నీ పాదాలచెంత ఉంటుందని, చరాచర సృష్టియంతా స్వామి ఉదరంలో ఉందని గురువులకే గురువు అయిన స్వామికి జోల పాడారు. దీనిలో స్వామి శేషశయనం, శ్రీసేవ, విశ్వంభరత్వం, జ్ఞాన స్వరూపాలను శబ్ద చిత్రాలలో దర్శింపజేశారు కవి.

**చ॥ పూలడోలిక నీకు - పొత్తి గావించి**
**బాల భావమున నీ - ప్రకృతి నందుంచి**
**జోల బాడుచుకేల - డోలగదలించి**
**నాలోన నేన - యానందింతు మించి ॥జో జో॥**

సన్నని వస్త్రాన్ని పూలడోలికగా చేసి, చిన్న బాలునివని భావించి, జోలపాడుతూ ఉయ్యాలను ఊపుతూ, ఆనందిస్తానన్నారు. లోకంలోని ప్రతిప్రాణి కదలికకు అంటే చైతన్యానికి మూలం స్వామి. అలాంటి స్వామినే కదిలించ గలిగినపుడు కలిగే ఆనందం వర్ణనాతీతం.

ఆ ఆనందాన్ని కవి ఈ జోలపాట ద్వారా వ్యక్తపరచారు.

**చ॥ అమరునీ నెలవు - భావానందదమ్ము**
**రమణీయ శ్రీ పాండురంగాశ్రమమ్ము**
**తమము బోద్రోలి విశ్రాంతి మోదమ్ము**
**కమలాక్ష! రుక్మిణీకాంత। మాకిమ్ము - ॥జోజో॥**

రుక్మిణీధవుడవైన ఓ కమలాక్ష! భావానందాన్నిచ్చే నీ నెలవు శ్రీ పాండురంగా శ్రమం. అంధకారాన్ని (అజ్ఞానాంధకారం) తొలగించి, మాకు ఆనందాన్ని ప్రసాదించమని స్వామికి జోల పాడుతూ అర్థించారు. ఈ జోలపాటలో భగవంతుని శిశువుగా గాక సాక్షాత్తు విష్ణువునుగానే అభివర్ణించారు.

'మేలుకొలుపు' పాటలో జీవుల రక్షణకోసం రమ్మని స్వామిని ఆహ్వానిస్తూ మేలుకొల్పడం : భక్తజనుల తాపాన్ని హరించమంటూ స్వామికి లాలిపాట పాడడం మాకు ఆనందాన్ని ప్రసాదించమంటూ జోలపాట పాడడం గమనిస్తే – భగవంతుడు జీవరక్షకునిగా, జీవుల బాధానివారకుడుగా, ఆనంద ప్రదాతగా దర్శనమిస్తాడు. ఈ మూడు పాటల ద్వారా పరాత్పరుని మెప్పించి, భక్తజనాళి కోసం ఇహపరాలను సాధించయత్నించారు.

ఈవిధంగా శర్మగారు మంగళహారతులు, మేలుకొలుపులు, పాటలు, జోలపాటలు సంగీత సాహిత్య మేళవింపులతో రచించి, పాఠకుల, శ్రోతల మనో నేత్రాలకు స్వామి సగుణ, నిర్గుణ రూపాలను దర్శింపజేసి బ్రహ్మానందం పొందేభాగ్యం కలిగించారు.

ఆపాతమధురమైన సంగీతంలో రంగరించి, ఆలోచనామృతమైన సాహిత్యాన్ని లోకాని కందించిన సంపూర్ణ సరస్వతి శ్రీ శర్మగారు.

శర్మగారి సాంప్రదాయక రచనలలో పోతన భక్త్యావేశం, రచనా విధానం దర్శనమిస్తే, ఆయన హారతులు, మేలుకొలుపు, లాలిపాట, జోలపాటలలో అన్నమాచార్యుల భక్తి పారవశ్యం, గేయ రచనా ఫణితి దర్శనమిస్తాయి. శ్రీశర్మగారు అటు మార్గకవితారీతిలోను, ఇటు దేశికవితా విధానంలోను తన లేఖినిని నడిపింపజేసి, భక్తి భావ ప్రదర్శనకు ఏ రచనా రీతైనా తగినదేనని నిరూపిస్తూ తన సాహిత్య ప్రస్థానాన్ని సాగించారు.

ఏ ప్రక్రియను చేబూనినా, దానిని సగుణబ్రహ్మను ధ్యానిస్తూ, ఆరాధిస్తూ, నిర్గుణబ్రహ్మ దర్శనం దాకా తన ఆధ్యాత్మిక ప్రస్థానాన్ని సాగించారు. ఇలా తురీయ పురుషార్థ సాధనకోసమే తన కలాన్నీ, గళాన్నీ వినియోగించారు శర్మగారు. "సతరతిసతరతి స లోకాం స్తారయతి"5 అన్న చందాన తానుతన కవితా సుమాలతో స్వామిని అర్చించి, తాను తరించడమే కాక తన మార్గంలో పయనించి, తనరచనా

సుమాలను తన లాగానే స్వామికి అర్పించిన భక్త జనావళిని తరింపజేశారు. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ"[6] అన్న ఆదిశంకరుల వాక్కును ఆచరణలో చూపుతూ భక్తిద్వారా ముక్తిని పొందవచ్చునని ఋజువు చేశారు.

## 4. విశ్వనాథ ముద్ర - "విశ్వము"

త్యాగరాజాదులలాగా హారతులలో తన ముద్రను 'విశ్వము' అనే నామంతో నిలుపుకున్నారు. తన పేరైన 'విశ్వనాథ' అనే అర్థంలో ఆపదాన్ని తక్కువగా వాడారు. కాని చాలా సార్లు 'విశ్వము' అంటే ప్రపంచం అనే అర్థంలోనే ఉన్నా 'విశ్వము' అనే ముద్రణలో ఆయన పేరు (విశ్వనాథశర్మ) స్ఫురిస్తుంది.

**1.** **"మానవా – విశ్వములో హాయిగా విహరింప కృపతో"[7]**

**2.** **"నీల మోహనాంగ, ప్రేమ జాలువార – నీ విశ్వము**
**నేలుమయ్యా, భవ్య సుగుణజాల! కృష్ణ – శైలభార"[8]**

**3.** **"విశ్వమంత నీ – వేణుగానమే**
**వినబడ మోహన – రాగమయా"[9]**

**4.** **"పరిపూర్ణ తమావతార। పలుకరా – హరీ**
**చిరు విశ్వము పైన ప్రేమ చిలుకురా"[10]**

**5.** **"ప్రతి యణువులోన నీవే – భాసిలుము – విశ్వము నిండ**
**పరమాత్మ – హరి – గోవిందా – పాలించు బాలముకుంద"[11]**

**6.** **"వేణువు నూదుచు, విశ్వములోన**
**విహరించుమురా। విహగే శయానా"[12]**

**7.** **"మురళీధర। విశ్వములో నీ మృదు**
**చరణములే – నిలుపుమా?"[13]**

**8.** **"భావ నిలయమున – పాయక నిలిచి**
**నీ విశ్వానికి –సేవ యొసగుమా?"[14]**

**9.** **"కనికరమూని – భవార్ణవమందున**
**మునుగు – విశ్వమును బ్రోవగా"[15]**

**10.** **"నీ విశ్వానికి – నేత్రోత్సవమై**
**నిలువుము – ప్రేమధుని – గోవిందహరి"[16]**

11. "ఆసలీడేర్చురా! హాయి చేకూర్చురా
అద్వయానందమున - విశ్వమును - ముంచరా![17]

'విశ్వనాథుని' మొరవినుమని వ్రాయడమే కాదు 'విశ్వము'ను ఏలుమని వ్రాయటం వల్ల 'సర్వేజనా స్సుఖినోభవంతు' అని దీవించే మహాత్ముని హృదయంతో పాటుశర్మగారి రచనాముద్ర వీటిలో కన్పిస్తుంది.

తాను రచించిన రచనలో పేరు ముద్రగా నిల్పుకోవడం పూర్వకాల సంప్రదాయం. నారాయణ తీర్థులు, త్యాగబ్రహ్మం అన్నమయ్య, రామదాసు మొదలైన వారు అలా చేశారు. ఆసంప్రదాయాన్ని శర్మగారు అనుసరించారు.

## 5. ఉపసంహారం

ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణా ప్రాంతం ఆర్థికంగా వెనకబడివుంది. అయినా ఈ ప్రాంతంలో కవులకు, పండితులకు కొరత లేదని సురవరం ప్రతాపరెడ్డిగారు పరిశోధనాత్మకంగా నిరూపించారు.

తెలంగాణాలోని జిల్లాలలోకెల్ల మెదక్ జిల్లాకు ఒక ప్రత్యేకత ఉంది. ఇక్కడ పూర్వం నుంచి సంస్కృతభాషా అధ్యయనం, ప్రచారం విరివిగా సాగింది. నిజాం పరిపాలనాకాలంలో కూడా ఉర్దూ ధాటికి కనుమరుగు కాకుండా సంస్కృతభాష తన ఉనికిని నిలుపుకుంది. ఇప్పటికి మెదక్‌జిల్లాలో సంస్కృతాంధ్ర పండితులు అధికంగానే కనపడతారు. 20వశతాబ్దంలో ఇక్కడ అనేకమంది కవి పండితులు తమ సాహిత్య కృషిని సాగించారు. అలాంటి వారిలో విశ్వనాథ శర్మగారు ప్రథమగణ్యులు.

విశ్వనాథశర్మగారి జీవితాన్ని రెండు కోణాలనుండి దర్శించవచ్చు. ఒకటి ఆశ్రమ జీవితం. రెండు సాహిత్య జీవితం. ఆయన వ్యక్తిగత జీవితం ఆయనకు ఉన్నా, అదికూడ ఆశ్రమజీవితంతో పెనవేసుకుని పోయింది. తన పదహారవ ఏటనే ఆశ్రమబాధ్యతలు స్వీకరించడంవల్ల, ఆశ్రమంతో మమేకమై తమ జీవితాన్ని సాగించారు. ఆశ్రమ నిర్వహణలో మానవసేవ చేస్తూ, వారిలో మాధవుని దర్శించారు. ఆయన వారసత్వపరంగాను, స్వతహాగాను అద్వైతి. తను, ఇతరులు భిన్నులని భావించేవారు కాదు. అలాగే భగవంతునికి జీవులకు భేదాన్ని పాటించేవారుకాదు. ఇది ఆయన వైయక్తిక జీవితానికి సంబంధించినది.

సాహిత్య జీవితంలోనూ అద్వైతే. శివకేశవులకు అభేదాన్ని పాటించడమే (శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే) కాక జీవాత్మ, పరమాత్మలకు కూడ అభేదాన్ని పాటించి రచనలు కావించారు. అందువల్ల మూడు అధ్యాయాలలో ఆయన ఆశ్రమ జీవితాన్ని సమగ్రంగా పరిశీలించాను. ఒక ఆశ్రమ నిర్వాహకుడికి ఉండవలసిన సద్గుణాలన్ని ఆయనలో ఉన్నాయి. కాబట్టి వాటన్నింటిని రెండవ అధ్యాయంలో కూలంకషంగా పరిశీలించాను. పాండురంగాశ్రమాన్ని నిర్వహిస్తున్న కాలంలో ఆయన చేసిన ప్రజాసేవ, భగవత్సేవ అజరామరమైనది. అక్కడ నిర్వహించే కార్యక్రమాలు ముఖ్యంగా భజనలు, ఆషాఢ ఉత్సవాలు శర్మగారిని ఒక నిష్కామకర్మ యోగిగా మనముందుంచు తాయి. ప్రజల భౌతిక, ఆధ్యాత్మిక ఉన్నతికోసం తండ్రి భావానంద స్వామివారి లాగానే నిరంతర, నిర్విరామకృషి సల్పారు. ఆయన జన్మించినదాదిగా భౌతిక కాయాన్ని వదిలేవరకు ఆశ్రమానికి అంకితమై జీవించారు. ఇలాంటి ఉన్నతమైన జీవితాన్ని గడపడంవల్ల నాపరిశోధనలో మొదట మూడు అధ్యాయాలలో ఆయన జీవనరేఖలను ప్రతిఫలింపజేసాను.

నా పరిశోధనలోని నాలుగవ అధ్యాయం నుండి పదవ అధ్యాయం వరకు ఆయన రచనలను (ముద్రిత, అముద్రిత) కూలంకషంగా పరిశోధించాను. ఆయన రచనల్లోకెల్ల తలమానికమైనది 'శ్రీ పాండురంగశతకము' అందువల్ల దానిని మొదట పరిశోధనకు గ్రహించి దానిలోని పరమార్థాన్ని వివేచించాను. దీనిలోని అంతస్స్రోత్రం భక్తియే అయిన దానిలో శర్మగారు ఆత్మ పరమాత్మల తత్త్వాన్ని పాండురంగని దయాతత్త్వాన్ని వివరించారు. తమ పద్యాలలో 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అనే ఆదిశంకరులు ప్రతిపాదించిన తత్త్వాన్ని వివరించడమే కాక, అద్వైత తత్త్వ ప్రతిపాదన చేశారు. దశావతార చిత్రణం, నవవిధభక్తుల ప్రపంచనం ఆయా పద్యాలలో చోటుచేసుకున్నప్పటికి ప్రధానంగా ఈ శతకంలో శర్మగారు పరమ అద్వైతిగా కనిపిస్తారు.

'శ్రీ శివలింగ విలాసం'లో మన సమాజానికి అవసరమైన మత సామరస్యాన్ని చిత్రించారు. దీనిలోను శివకేశవులకు అభేదాన్ని పాటించడమే కాక అద్వైత భావాలకే ప్రాధాన్యం ఇచ్చారు. నామస్మరణ శతకంలో ముక్తి పొందే మార్గం భగవన్నామస్మరణమే అనే నిశ్చయాత్మకబుద్ధితో రచన సాగించారు. అలాగే పాండురంగ వర్ణమాలలోను, సద్భావలహరిలోను భక్తి భావాలతో పాటు వైరాగ్య భావాన్ని ప్రస్ఫుటంగా,

ద్యోతకమయ్యే విధంగా రచించారు. 'కేశవాది నామమాల' 'రామనామ రహస్యము' లలో భగవన్నామ స్మరణ ప్రాధాన్యాన్ని చిత్రించారు. ఆనాటి భగీరథుడు గంగావతరణం కోసం ఎంతకృషి చేశాడో, అంతే 'ఆవేదన'తో ఆశ్రమ ప్రాంతంలో గంగావతరణం కావించారు. ఈ సాహిత్య కృషి అంతా ఐదవ అధ్యాయంలో సాగింది.

ఆయన ఎంత అద్వైతి అయినా సాహిత్య రచనలోకి వచ్చే సరికి పాండిత్య ప్రదర్శనకు ప్రాధాన్యం ఇచ్చే చిత్రకవిత్వాన్ని కూడ సృష్టించారు. ఆ చిత్ర కవిత్వంలో కూడ భక్తి బంధురంగా పద్యరచన గావించారు. బంధకవిత్వం, గర్భకవిత్వంలో కూడ భగవద్రూపాన్నే శర్మగారు దర్శించారు. చిత్ర కవిత్వాన్ని ప్రత్యేకంగా ఆరవ అధ్యాయంలో పరిశీలించాను.

ఏడవ అధ్యాయంలో సంస్కృతరచనలను స్వీకరించి, స్థూలంగా సమీక్షించాను. ఆయన సంస్కృత రచనలో సుప్రభాతాలు, స్తోత్రాలు, అష్టకాలు, భావనవనీతమ్, నవకమ్, ఒక శతకం అనే వాటిని పరిశీలిస్తే వాటిలోని అంతస్సూత్రం భక్తి తత్త్వంగా ద్యోతకమయింది. ఈ సంస్కృత రచనలో కవికి సర్వదేవతలు సమానంగానే దర్శనమిచ్చారు. చివరకు భగవద్భక్తులు కూడ దైవ స్వరూపులుగా కనిపించారు.

ఆయన రచనల్లోకెల్ల విశిష్టమైనవి, విస్తృతమైనవి మంగళహారతులు. ఇవి పామరజన రంజకమైనవి. అయినప్పటికి పండితులు గూడ హర్షించేవిధంగా గంభీరమైన భావాలతో సరళమైన భాషతో రచన సాగింది. ఆయా హారతులలో శ్రీకృష్ణుని, పాండురంగని, శ్రీరాముని, ఆంజనేయుని భౌతిక, మానసిక చిత్రణ గావిస్తూ, మంగళహారతులు రచించారు. శివపరమైన హారతులలో శివునిగురించి, విఘ్నేశ్వరుని గురించి రచించారు. స్త్రీ దేవతలకు సంబంధించిన హారతులు భగవద్భక్తులకు సంబంధించిన హారతులు అన్నీకూడ భక్తి బోధకాలుగా, ముక్తిదాయకాలుగా ఉన్నాయి. ఈ హారతులు సంగీత, సాహిత్య మేళవింపులతో గుబాళిస్తున్నాయి. వీటిలో భక్తి, వేదాంత భావాలు చోటుచేసుకోవడమే గాక, ఆయా భావాలు పరిశీలిస్తే అద్వైత తత్త్వం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. మొత్తంమీద పండిత, పామర రంజకమైన మంగళహారతులలో అద్వైత తత్త్వమే అంతర్లీనంగా కనిపిస్తుంది.

మానవజీవితంలో అందులోను ఆధ్యాత్మిక జీవితంలో అత్యంత ప్రాధాన్యం వహించేది పూజ. పూజా విధానం అనేక రకాలుగా ఉన్నా నిత్యపూజలో భక్తులు

షోడశోపచారాలకే పెద్దపీట వేస్తారు. భగవదర్చనలోని పదహారు ఉపచారాలను ప్రధానంగా గ్రహించి శర్మగారు తేటతెలుగులో పూజపాటను భక్తి ముక్తిదాయకంగా రచించారు. అయితే శర్మగారి పూజపాటలో భక్తి భావ ఉల్బణంవల్ల షోడశోపచారాలకు తోడు మరో ఆరు ఉపచారాలు అదనంగా చేరాయి. వాటిలో కొన్ని నిత్యపూజలో పాటించేవే. శబ్దరత్నాకరం ఆధారంగా షోడశోపచారాలను గ్రహించి పూజపాటను పరిశోధించాను. షోడశోపచారాలలో చేరని ధ్యానాన్ని మొదట వివరించి, ఉపచారాల చివర మధుపర్కం, అక్షతలు, ఆభరణాలు, నీరాజనం, మంత్రపుష్పం మొదలైన వాటిని చివరన గ్రహించి పరిశీలించాను. సగుణోపాసనకు పూజ పాట ఉపాదేయంగా నిలిచింది. ఇది జనులకు నిత్యోపయోగి కాబట్టి బాగా ప్రాచుర్యం వహించింది. దీనిలో గంభీరమైన మధురమైన భక్తి భావాలను కవి పొందుపరచారు. ఒక్కొక్కటిగా రచించిన మేలుకొలుపు, లాలి, జోల పాటలను విడిగా పరిశీలించి వాటిలోని భక్తి తత్త్వాన్ని విశదీకరించాను.

ఈవిధంగా మూడు అధ్యాయాలు శర్మగారి జీవితతత్త్వ పరిశీలనకు, మిగిలిన ఏడు అధ్యాయాలు ఆయనసాహిత్య తత్త్వ పరిశీలనకు గ్రహించి పరిశోధన సాగించాను. ఆయనజీవితంలోగాని, సాహిత్య జీవితంలోగాని అంతస్సూత్రంగా కనిపించేది ఒకే అంశం. అదే అద్వైతం. దీన్నిబట్టి శ్రీవిశ్వనాథ శర్మగారిని పరమ భక్తుడుగా, ప్రజాసేవకుడుగా పరిగణించడమేగాక ఆయనను మనసా, వాచా, కర్మణా పరమ అద్వైతిగా సిద్ధాంతీకరించవచ్చు. నా పరిశోధనలో శర్మగారు అద్వైతి అని నిర్ద్వంద్వంగా ప్రతిపాదించాను.

## జ్ఞాపికలు


1. తెలుగు జానపద గేయ సాహిత్యము : డా॥ రామరాజు బిరుదురాజు పుట-379
2. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల పుట 114
3. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 110
4. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 112
5. నారదభక్తి సూత్రములు (ప్రేమదర్శనము) : హిందీమూలము : హనుమాన్ ప్రసాద్, పోద్దార్,
   ఆంధ్రానువాదము : ఉదయభాస్కరమ్, బులుసు., పుట- 119
6. వివేకచూడామణి : ఆదిశంకరాచార్య., పుట - 22
7. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 12
8. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 14
9. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 28
10. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 58
11. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 42
12. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 43
13. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 44
14. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 45
15. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 50
16. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 51
17. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల., పుట - 57

# అనుబంధం -1

## పద్య ప్రసూనాలు

శ్రీ విశ్వనాథశర్మగారి వ్యక్తిత్వాన్ని ప్రశంసిస్తూ పలువురు ప్రముఖులు పద్యరూపంలో వెలిబుచ్చిన అభిప్రాయాలు.

ఉ॥ **"చక్కని భక్తిగీతముల శ్రావ్యత బాడి చిరంతనీయ స**
**మ్యక్కృషి ధర్మబోధల సమాదరవృత్తి గృహస్థతాత్విక**
**ప్రాక్కమనీయ వాక్కులను భావచిదవ్యయ తుష్టినందు నీ**
**దృక్కవి విశ్వనాథ బుధుడీయిల శాశ్వతుడయ్యె సత్కృతిన్"**

– నరసింహరామశర్మ, అష్టకాల.

**"ఆతని జ్ఞాన వైఖరికి నయ్యెను మౌనము భూషణమ్ముగా**
**నాతని శక్తియుక్తులకు నాభరణమ్ము క్షమాగుణమ్మెయౌ**
**నాతని ధర్మకర్మలకు నందము నార్భటి లేనినిష్ఠ, తా**
**పూత చరిత్రుడున్ పరమ పూర్ణగుణుండు మహాత్ముడాతడౌ"**

– రామశర్మ, జి.ఎం.

**'స్వాధ్యాయం శతరుద్ర పూజన విధౌకుర్వన్ పరైః కారయన్**
**అధ్యేతవ్య ఇతీరితి శ్రుతి విధిం నిర్వర్తయన్ నిర్మలః**
**దేవీ కృష్ణ శివాది మూర్తిషు సమత్వం భావయన్ సాత్వికో**
**భూయాదాశ్రిత మార్గదర్శక మునిశ్రీ విశ్వనాథో మహాన్"**

– శ్రీ రఘురామశాస్త్రి, గౌరీభట్ల

**"కైతకు విష్ణుతత్వమును కల్గగజేయు కవీశ్వరుండు నా**
**పాత సుధా మధూకలిత భావన, జీవరసాయనమ్ముగా**
**ఆతత భక్తిమై హరికి హారతులల్లిన పుణ్యమూర్తి, సం**
**భూత యశస్వి, పూత గుణభూషణునెన్నుదు విశ్వనాథునిన్"**

– రాధాకృష్ణ శర్మ, త్రిగుళ్ళ

"నామ పారాయణ నౌకతో సుఖముగా
సంసార జలధిలో సాగవచ్చు
సర్వమర్పణచేసి సంకటస్థితిలోన
విశ్వాసముంచిన విజయమబ్బు
అందిన దానితో ఆనందమొందుచు
పొందని దానికై కుందబోకు
భవ బంధ భారమ్ము స్వామిపై పడవేసి
నిరతమ్ము సేవను మరువవద్దు
స్వామి కలడింక, భయమేమి వలదటంచు
బ్రతుకులన్నియు వికసించి, పరిమళింప
అమృత బోధలు కురిసిన మమత నీది
ఎన్నతరమౌనె మాకు 'విశ్వన్న' నిన్ను"

– రఘుపతి, వేదాటి.

"సదా ధర్మ కర్తవ్య నిష్ఠాగరిష్ఠం
గృహస్థాశ్రమాదర్శ వైదేహ మూర్తిమ్,
శ్రితాభీష్టపూర్తిం సదా శాంతమూర్తిం
గురుం దేవదేవం భజే విశ్వనాథమ్॥"

– వెంకటరామశర్మ, మదునూరి

"అమ్మయొడినుండి వచ్చిన యక్షరములు
నాట్యమాడెను విశ్వేశునాల్కపైన
పద్యకుసుమములు సుగంధ పరిమళములు
విస్తరించెను ఆశ్రమ వీధులందు."

– రామమూర్తి, త్రిగుళ్ళ.

"భావమందెపుడు భావానందుడుండగా తామరాకున నీరుదనరు భంగి
సంసారమందుండి సర్వము సర్వేశ్వరార్పణబుద్ధితో నలరుచుండు
దానము, ధర్మము, తపము, సచ్ఛీలముల్ గలిగి సర్వుల మెప్పుగలగి
యుండు

దరహాస మాధుర్య సరసోక్తులను శిష్యగణముల మోదము
గరపుచుండు."

– గోవర్ధనశర్మ, ఆకెళ్ళ

"పాండురంగాశ్రమక్షేత్రే రాధాకృష్ణాలయాశ్రయే
విశ్వకల్యాణ సద్భావ సద్గురుం భావయేత్సదా
పురుషార్థ ప్రదంసేవ్యం భావానంద ప్రియం శివం
హరేర్నామైక మంత్రార్థం చింతయేద్విశ్వశాంతయే."

శ్రీ ప్రభాకరాశ్రమ్ – దండి స్వామీజి.

"సదా రామనామ స్మరంతం మహాంతం
ముదారామ నామ్నో రహస్యం వదంతం
సదానామ సంకీర్తనా²నంద భాజం
హృదంభోజ మధ్యే భజే విశ్వనాథం"

శేషశర్మ, పోలా.

అవని మరుకూకు పాండురంగాశ్రమమున
విఠ్ఠలేశుని సేవించి విబుధ జనుల
మన్ననలనందుకొన్న 'విశ్వన్న'గారు
కీర్తిశేషులై వెలుగొందె కృష్ణకరుణ.

కృష్ణమూర్తి శర్మ, గౌరీభట్ల.

శ్రీ గోపాలార్పిత మతిరయమ్ సత్కవిః కీర్తి దేహః
భావానంద ప్రభుమృదు పదారాధనా సక్త చిత్తః
విశ్వామోదాప్త సుజన పదే పాండురంగాశ్రమేస్మిన్
బ్రహ్మానందందిశతు సతతం విశ్వనాథో మహాత్మా

సత్యనారాయణశర్మ, గౌరీభట్ల

## అనుబంధం -2

# శర్మగారి ఆత్మీయుల అభిప్రాయ సుమాలు

సర్వదా సర్వవృత్తులతో....




నాన్నగారు ఈ మాటలను ప్రతిసారి చెప్పేవారు. మానవసేవయే మాధవసేవ. ఎవరిని బాధపెట్టకూడదని అనేవారు. ఆ మాటలను శిరోధార్యంగా పాటిస్తూ, వారి ఆశీస్సులతో నేను నా సోదరులు వేణు, విఠలు, రాజుల సహాయంతో ఆశ్రమాన్ని నాన్నగారి ఆశయాలకనుగుణంగా, నేటికి సంప్రదాయానుగతమైన పద్ధతులతో నడిపిస్తున్నాను. ఇది నాకు వరంగా భావిస్తున్నాను.

**– శ్రీ సత్యనారాయణశర్మ, అప్పాల. (శ్రీ పాండురంగాశ్రమము)**

'కర్మత్యజేమ యదినూన మథః పతేమ యద్యాచరేమ కదాపి భవంతరేమ' కర్మను త్యజిస్తే అథః పతనమే, ఆచరిస్తే సంసారం నుండి విముక్తి లభింపదు. కావున విధివిహితమైన కర్మలను ఫలాపేక్ష లేకుండా చేయడమే ఉత్తమమని చెప్పేవారు. చేసేవారు. పూజలను, ఉత్సవాలను భక్తిశ్రద్ధలతో నిష్కామంగా చేసేవారు. తల్లిదండ్రుల యాజ్ఞల నౌదల ధరించేవారు. మితభాషి, స్థితప్రజ్ఞులు.

**– ప్రభాకర శర్మ, త్రిగుళ్ళ**

'మాకు తొలి ఆధ్యాత్మిక గురువుగా, భక్తి, విశ్వాసం అనే రెండు కళ్ళతో తాతగారిని చూస్తుండేవాళ్ళం. ఎప్పుడెప్పుడు ఆయన నోటివెంట అమృత బిందువుల్లాంటి భగవద్వాక్యాలు వెలువడుతాయో ఏరుకుందామన్నంత జిజ్ఞాస ఉండేది. ఈశ్వరప్రాప్తికి భగవత్ సేవ ఏవిధంగా చేయాలో వివరించారు.

**– శ్రీమతి లలితా శైలేశ్వర్, పార్నంది**

"విశ్వనాథశర్మగారి జీవనం చాలా నిరాడంబరమైన సాధుజీవనం. అతిథి అభ్యాగతులను ఆదరించడంలో సమదృష్టి, ఎన్ని భోగభాగ్యాలున్నా నిశ్చలమైన జీవనం కలిగినవాడు. జనకమహారాజు వంటివాడు. ఇది అందరికీ అసాధ్యం."

**– శ్రీకృష్ణానందస్వామి, తొగుట.**

"ఎంతోమంది భక్తులు తమకష్టాలను చెప్పుకుంటే ఓపికతో విని ఓదార్చి, తగిన సలహాలను, చేయూతను అందించారు. ఎందరికో మంచిని చేకూర్చిన ఇంతటి మహనీయుడు పాండురంగా శ్రమానికి కల్పతరువు. నడయాడు పాండురంగడు. ఇంతటి మహనీయుడిని తిరిగి మన ధరాస్థలి ఏనాడు పొందునో తెలియదు కాని పోగొట్టుకొని దుఃఖిస్తుందని చెప్పుటలో అతిశయోక్తిలేదు అని నాభావం."

**– జానకిరామశర్మ, త్రిగుళ్ళ**

"శ్రీయతివర భావానంద భారతీ భగవత్పాద కరకమల సంజాత వైరాగ్య విద్యా భక్తియోగ శిక్షాప్రవర్తక పూర్ణ కామ తేజో మణ్డలాధీశ అశరణశరణ్య కరుణా వరుణాలయ జీవమాత్ర సఖ భక్త భక్తిమాన్ భక్తానుగ్రహకాతర శ్రీపాండురంగాశ్రమ సర్వాధ్యక్ష ప్రభు శ్రీమదప్పాల వంశ పయః పారావార రాకా సుధాకర శ్రీశ్రీశ్రీ విశ్వనాథ గురుంభజే."

**– కీ॥శే॥ శ్రీ రామచంద్రమూర్తి, మదునూరి**

"విశ్వవ్యాపకమైన విశ్వకల్యాణం కొరకు స్వతః సిద్ధమైన చైతన్యం అంతటా వ్యాపించి ఉన్నదని తెలుసుకొని, అజ్ఞానులమైన మనకోసం భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను, మోక్షం లభించుటకొరకు, భగవంతుని సేవించుటకొరకు, ధ్యానించి, తరించుట కొరకు ఎన్నో గ్రంథాలు రచించినారు. వారు ఆదర్శమూర్తి"

**– వరలక్ష్మి, సికింద్రాబాద్**

## అనుబంధం -3

## శర్మగారి ఆశ్రమ జీవితాన్ని, ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రతిబింబించే ఛాయాచిత్ర మంజరి



ప్రశాంతతకు నిలయం – శ్రీ పాండురంగాశ్రమం, మరుకూకు



శ్రీ పాండురంగాశ్రమంలోని మూలమూర్తులు

శ్రీ రుక్మిణీ సహిత పాండురంగస్వామి



శ్రీశ్రీశ్రీ యతివర భావానంద భారతీ భగవత్పాదులు
(విశ్వనాథశర్మగారి తండ్రి)



సగుణోపాసన చేస్తున్న శర్మగారి దంపతులు

# ఉపయుక్త గ్రంథసూచి


1. అన్నమాచార్య కీర్తనలు : సంకలనం – ప్రసన్న, తెన్నేటి
ప్రచురణ : ముద్రా బుక్స్, విజయవాడ, 2005

2. అన్నమాచార్యుని మధుర కీర్తనలు : సంకలనం – శ్యామసుందరి, ముత్య
ప్రచురణ : గొల్లపూడి వీరాస్వామి & సన్స్, శ్రీ సీతారామబుక్ డిపో, రాజమండ్రి, 1993

3. అప్పకవీయము : అప్పకవి, కాకునూరి
ముద్రణ : వావిళ్ళ రామశాస్త్రులు అండ్ సన్స్, 1962

4. ఉపనిషద్దర్శనము (మొదటిభాగము) : శ్రీనాథ వేంకట సోమయాజులు, నోరి
ప్రచురణ : శ్రీ నోరి సూర్యనారాయణ ఛారిటబుల్ ట్రస్టు, మద్రాసు

5. శ్రీకృష్ణ కర్ణామృతమ్
ప్రచురణ : బిల్వ మంగళుడు
ప్రచురణ : చౌఖాంబ ప్రెస్, వారణాసి

6. కేశవాది నామమాల : విశ్వనాథశర్మ, అప్పాల
ప్రచురణ : శ్రీ మారుతి ప్రింటర్స్, హైదరాబాదు

7. శ్రీ గురు పూజాకల్పము : శ్రీ విశ్వనాథశర్మ, అప్పాల
ప్రచురణ : శ్యామలా ఎంటర్‌ప్రైజెస్, హైదరాబాదు, 1984

8. జానపద గేయసాహిత్యము : డా॥ రామరాజు, బిరుదురాజు
ప్రచురణ : ఆంధ్రరచయితల సంఘం, హైదరాబాదు.

9. జీవిత పరమార్థము : వేదాంత శాస్త్రము : నాగమణి, కొండూరి
ప్రచురణ : విప్ల కంప్యూటర్ సర్వీసెస్, నల్లకుంట, హైదరాబాదు, 1995

10. ఘంటసాల మధురగీతాలు :
ప్రచురణ : జె.పి. పబ్లికేషన్స్, విజయవాడ – 2005

11. తాళ్ళపాక కవుల సాహిత్య సేవ
సంకలనం : డా॥ విద్యావతి ఎ. 1979

12. త్యాగరాజ కీర్తనలు : సంకలనం : ప్రసన్న, తెన్నేటి
ప్రచురణ : ముద్రాబుక్స్, విజయవాడ, 2005

13. తెలుగు సాహిత్యములో దేశి కవిత : సుందరం ఆర్.వి.ఎస్.
ప్రచురణ : మానస సరోవర, 1970

14. తెలుగులో చిత్రకవిత్వము : ధర్మారావు గాదె

15. శ్రీదేవి స్తోత్ర రత్నాకరము : సంకలనం – శ్రీ పాలావజ్ఝల శ్రీరామశర్మ
ముద్రణ : శ్రీరామా బుక్ డిపో, సికింద్రాబాద్, 1973

16. శ్రీ దేవి నవరాత్ర పూజాకల్పము : సంకలనం – రాజేశ్వరశర్మ, పార్నంది
ప్రచురణ : పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్, 1997

17. ధర్మసింధువు : శ్రీ కామశాస్త్రి కొల్లూరి.
శ్రీజయలక్ష్మి పబ్లికేషన్స్, హైదరాబాద్.

18. నామస్మరణ : విశ్వనాథశర్మ, అప్పాల
ప్రచురణ : శ్రీ పాండురంగాశ్రమం, మరుకూకు, 1998

19. నారదభక్తి సూత్రములు
హిందీ మూలము : హనుమాన్ ప్రసాద్ పోద్దార్, 2003
ఆంధ్రానువాదము : ఉదయభాస్కరమ్, బులుసు
ప్రచురణ : గీతాప్రెస్, గోరఖ్‌పూర్

20. పంచసూక్తములు, రుద్రము : సంకలనం – వెంకటరామశర్మ, మదునూరి
ప్రచురణ : గీతాప్రెస్, గోరఖ్‌పూర్, 2002

21. శ్రీ పాండురంగ శతకము : విశ్వనాథశర్మ, అప్పాల
ప్రథమ ముద్రణ : 1974
ద్వితీయ ముద్రణ : 1990
తృతీయ ముద్రణ : 1999
ప్రచురణ : శ్రీ పాండురంగాశ్రమము, మరుకూకు

22. శ్రీ పాతంజల యోగ దర్శనము : పతంజలి
ప్రచురణ : శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు 1969

23. పూజా హోమ కల్పతరువు : సంకలనం – విష్ణుసేవానన్ద బ్రహ్మచారి
ప్రచురణ : శ్రీ పారాశర్య ప్రెస్, చిత్తూరు, 2005

24. బాలభక్తి : శ్రీ నారాయణ బాబా
ప్రచురణ : శ్రీ పాండురంగ ముద్రాలయము, 1935

25. శ్రీ భగవద్గీతామృత తరంగిణి : శ్రీ సత్యానంద మహర్షులు
ప్రచురణ : భగవాన్ ప్రెస్, నెల్లూరు, 1962

26. భావానందం : (శతజయంతి ఉత్సవ ప్రత్యేక సంచిక)
ప్రచురణ : సూర్య ప్రింటర్స్, ఎస్.ఆర్. నగర్, హైదరాబాదు, 1999

27. భావనవనీతము : విశ్వనాథశర్మ, అప్పాల
ప్రచురణ : శ్రీ పాండురంగాశ్రమము, మరుకూకు

28. మంగళకీర్తన : సంకలనం – మిత్రామశర్మ, త్రిగుళ్ళ,
ప్రచురణ : ఎస్.ఆర్. ఎంటర్‌ప్రైజెస్, హైదరాబాద్, 1989

29. మంగళమంజరి : విశ్వనాథశర్మ, అప్పాల
ప్రచురణ : లక్ష్మి ప్రింటింగ్ ప్రెస్, సిద్ధిపేట – 1988

30. శ్రీ మదాంధ్ర భాగవతము (1,2 సంపుటాలు) : కవి – పోతనామాత్య, బమ్మెర
ప్రచురణ : రోహిణి పబ్లికేషన్స్, రాజమండ్రి, 2004

31. శ్రీమద్భగవద్గీత : వ్యాఖ్యాత – స్వామిసుందర చైతన్యానంద
ప్రచురణ : శ్రీ లక్ష్మి గణపతి బైండింగ్ వర్క్స్, కొవ్వూరు, 1994

32. శ్రీమద్భాగవతమ్ – సప్తమ స్కంధము : సంపాదకులు – శ్రీమద్భక్తి విలాస తీర్థ గోస్వామి మహారాజుగారు
ప్రచురణ : శ్రీ రామానంద గౌడీయ మఠము, కొవ్వూరు, 1982

33. మహాన్యాసాది : సంకలనం – రామానుజ జ్యౌతిషికేణ, గోమఠం
ప్రచురణ : మైసూర్ కార్పోరేషన్ ముద్రణాలయం, మైసూర్, 1944

34. శ్రీ యతివర భావానందస్వామి – జీవితచరిత్ర : శ్రీ రఘురామశాస్త్రి, గౌరీభట్ల.
ప్రచురణ : శ్రీ కొండా శంకరయ్యగారి ప్రీమియర్ పవర్ ప్రెస్, సికింద్రాబాద్, 1961

35. యశోదామాతా : సంకలనం – పాండురంగాశ్రమ భక్తులు
ప్రచురణ : స్వదేశీ ముద్రణాలయం, హైదరాబాద్

36. శ్రీ దేవస్థాన పంచాంగము : పంచాంగకర్త– సీతారామశర్మ సిద్ధాంతి, గౌరీభట్ల
ప్రచురణ : శ్రీ యాదగిరిగుట్ట దేవస్థానము, 2005 – 2006

37. శ్రీ రామసేవాలహరి : సంకలనం – వెంకటరామశర్మ, మదునూరి
ప్రచురణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు, 2004

38. శ్రీ లలితా – విష్ణు సహస్ర నామ స్తోత్రములు
సంకలనం – బ్రహ్మశ్రీ రాధాకృష్ణమూర్తి, పురాణపండ
ప్రచురణ : గొల్లపూడి వీరాస్వామి & సన్స్, రాజమండ్రి

39 వివేక చూడామణి : ఆంధ్రానువాదం – ఉదయభాస్కరమ్, బులుసు
ప్రచురణ : గీతాప్రెస్, గోరఖ్‌పూర్, 2004

40. వేదాంత పరిభాషా వివరణము : శ్రీనివాసరావు, యల్లంరాజు
ప్రచురణ : అనుపమ ప్రింటర్స్, హైదరాబాద్ –2002

41. శబ్దరత్నాకరము : సీతారామాచార్యులు, బహుజనపల్లి
ప్రచురణ : ఏషియన్ ఎడ్యుకేషనల్ సర్వీసెస్, న్యూ ఢిల్లీ – 1988

42. శబ్దార్థ చంద్రిక (ఆంధ్రనిఘంటువు) : సుబ్బారాయుడు, మహాకాళి
ప్రచురణ : వావిళ్ల రామశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి – 1925

43. శ్రీ శివలింగ విలాసం : విశ్వనాథశర్మ, అప్పాల
ప్రచురణ : శ్రీ పాండురంగాశ్రమము, మరుకూకు – 2001

44. శ్రీ షిరిడీ సాయిబాబా అష్టోత్తర శతనామస్తోత్రమ్ : విశ్వనాథశర్మ, అప్పాల.
ప్రచురణ : లక్ష్మి ప్రింటర్స్, సికింద్రాబాద్ –2000

45. సంకీర్తనావళి : సంకలనం – డా॥ కృష్ణమాచార్యులు ఎం.
ప్రచురణ : గీతాప్రెస్, గోరఖ్‌పూర్, 2000

46. సకలార్థ సాగరము : శ్రీ దొరసామయ్య, ఓ.వై.
ప్రచురణ : అమెరికన్ డైమండు ముద్రాక్షరశాల, చెన్నపురి - 1929

47. సత్యదేవాష్టకము : విశ్వనాథశర్మ, అప్పాల.
ప్రచురణ : ఉదయ్ ప్రింటింగ్ ప్రెస్, సికింద్రాబాద్

48. శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము : పండిత పరిష్కృతము
ప్రచురణ : గొల్లపూడి వీరాస్వామి & సన్స్, శ్రీ సీతారామా బుక్ డిపో, రాజమండ్రి

49. సద్భావలహరి : విశ్వనాథశర్మ, అప్పాల
ప్రచురణ : తరణి ప్రెస్, సికింద్రాబాద్, 1972

50. సాహిత్య సోపానములు : డా॥ వేంకటావధాని, దివాకర్ల
ప్రచురణ : ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద,1992

51. శ్రీ సీతారామచంద్ర సుప్రభాతమ్ : విశ్వనాథశర్మ, అప్పాల.
ప్రచురణ : శ్రీ పాండురంగాశ్రమము, మరుకూకు

52. సుప్రభాతాది మంజరి : విశ్వనాథశర్మ, అప్పాల.
ప్రచురణ : తరణి ప్రెస్, సికింద్రాబాద్

53. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు (అయిదు, ఎనిమిదవ సంపుటములు)
ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1982

54. స్తోత్ర మణిమాల : సంకలనం - వెంకటరామశర్మ, మదునూరి
ప్రచురణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు, 2003

55. స్తోత్ర రత్నావళి : సంకనలం - డా॥ వెంకట రామయ్య, గోలి
ప్రచురణ : గీతాప్రెస్, గోరఖ్‌పూర్, 2004

56. శ్రీ హరిహర సేవాలహరి
సంకలనం : శ్రీ సీతారామశర్మ సిద్ధాంతి, గౌరీభట్ల
శ్రీరాధాకృష్ణశర్మ, గౌరీభట్ల
ప్రచురణ : విప్ల కంప్యూటర్ సర్వీసెస్, హైదరాబాద్, 1991

## అనుషక్త గ్రంథసూచి

1. కొంపెల్ల జనార్ధనరావు జీవితం – సాహిత్యం
డాక్టర్ ప్రసాద్, ఏటుకూరి
ప్రచురణ : విశాలాంధ్ర పబ్లికేషన్స్, హైదరాబాద్.

2. తాపీ ధర్మారావు జీవితం – రచనలు
డాక్టర్ ప్రసాద్, ఏటుకూరి
ప్రచురణ : విశాలాంధ్ర పబ్లికేషన్స్, హైదరాబాద్.

3. త్యాగరాజు కవిత్వము (విమర్శనాత్మక పరిశీలనము)
డాక్టర్ శమంతకమణి, ఎస్.
ప్రచురణ : క్రాంతి ప్రెస్, మద్రాసు –1988

4. మహాభక్త విజయము
రామకృష్ణ శాస్త్రి, కేతవరపు
ప్రచురణ : కొండపల్లి వీర వెంకయ్య & సన్స్, రాజమండ్రి – 1978

5. రాకమచర్ల వేంకటదాసు కీర్తనలు – జీవిత విశేషాలు
డాక్టర్ ఆంజనేయ శాస్త్రి, సాగి
ప్రచురణ : గోపాలకృష్ణ ప్రెస్, నల్లకుంట, హైదరాబాద్

6. శివపంచమి కృతుల సమీక్ష
శంకరయ్య, జంధ్యాల
ప్రచురణ : విక్టరీ ప్రెస్, విజయవాడ – 1979

7. శ్రీ సద్గురు మదనానంద సరస్వతీ స్వామి గురుపరంపరా చరిత్ర
సంకలనం : శ్రీ రాధాకృష్ణశర్మ, గౌరీభట్ల
ప్రచురణ : జె.ఎస్.గుప్త & సన్స్ వెబ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, హైదరాబాద్ – 1999

8. సురవరము ప్రతాపరెడ్డి జీవితము – సాహిత్యము
శివారెడ్డి, ఎల్లూరి
ప్రచురణ : కుడవెల్లి పుల్లారెడ్డి & శ్రీమతి ఇ. లక్ష్మీదేవి,
కల్లూరు, మహబూబ్‌నగర్ – 1973